భీరపగాత్రముం జేఁ గద ♦ వీరుని నీననుహీనుఁగాఁగ నే
కారణ మెంచి చెప్పితివొ ♦ గాని యెఱుంగను దాని హేతువున్. ౬ 1320

సీ. క్షత్రియజాతులలోనఁ ♦ గలఁడె వీరుండొక్కఁడున్నాఁడె యను ద్వేష ♦ మూనియొక్క
పటులయుం దలఁతు ♦ పక్షపాతముననో, శత్రువు లట్టి ప్రో ♦ త్సాహపఱుప
దానికిఁ జిక్కియో ♦ తగనిరీతిని బరుషోక్తులాడితి వని ♦ యొక్క శంక
గలుగుచున్నది నాకు ♦ నిలఁ బరప్రోత్సాహమే లేకయుండిన ♦ నిట్లు శాస్త్ర
తత్త్వ మెఱింగి వి ♦ ద్వాంసుఁడు ప్రాజ్ఞుండు నయి తగువాఁ డెవ్వఁ ♦ డైన సాధు

తే. మతిఁ బ్రభావసమన్వితు ♦ మాన్యతముని
బరుషములు పల్కు? నీవన్న ♦ పలుకు సత్య
మే యగుంగాక సరసిజ ♦ హీన లక్ష్మి
వలెఁ జెలంగెడు సీత న ♦ వ్వనమునుండి. ౭ 1321

క. కొనివచ్చి మరల నారా,మునకున్ భయమంది యీయఁ ♦ బూనుదునే? చి
క్కనివస్తువు లభియించినఁ, గొనక యొసంగుదురె మరలఁ ♦ గుమతులైనన్.

చ. వనచరకోటిసంవృతుని ♦ వానరనాయక లక్ష్మణాన్వితున్
గనఁగల వింక లంకఁ గొనఁ ♦ గాఁ జనుదెంచినవాని రామునిన్
దనుజవరేణ్య! మన్నిహతుఁ ♦ దద్దయుఁ బ్రీతిని గొన్నినాళ్లలో
నని మొన నెవ్వనిం దొడరి ♦ యా త్రిదశావలి గూడ నిల్వదో?. ౯ 1323

తే. అట్టిశూరుఁడు ద్వంద్వయు ♦ ద్ధాభిరతుఁడు
రావణుఁడు రామభూపతి ♦ రణమునందు
నేల భయమందు?; నని యంత ♦ హితపరుఁ గని
యేల పరుషములాడితి ♦ నిట్టు లనుచు. ౧౦ 1324

*క. అనుతాపంబున మఱియి,ట్లనియెన్ శ్రీరాఘవుఁడు భ ♦ యంబును బొందం
గను జేసిన రెండుగఁ దుని,మిన నే నెవ్వరికి లొంగి ♦ మెలఁగఁ దలఁప నా.

క. వినుమిద్ది నాస్వభావం,బునఁ బుట్టినదోష మిద్ది ♦ పో విడువంబా
లనియది దురతిక్రమ మని, యనఘా! తెలియంగవలయు ♦ నాత్మ దృఢముగన్.

చ. వననిధిసేతుబంధన మ ♦ వార్యపరాక్రమ మొప్ప రాముఁడే
యొనరిచినాఁడటంచు భయ ♦ మొప్పఁ గదా! మదినీకు నల్పమీ
వననిధి దీనిఁ గట్టుటయుఁ ♦ బౌరుషచిహ్నము గాద దెట్టులో
యొనరిచె దీన భీతిఁ గను ♦ టొప్పదు సుంతయు నిశ్చయంబుగన్. ౧౨ 1327

చ. వనచరసేనతోడ రఘు ♦ వర్యుఁడు సంద్రము దాఁటి వచ్చి వ
చ్చినయటు ప్రాణముక్తుఁడయి ♦ చేరున వ్వస్థల మింక మీఁద సం
చును శపథంబు చేసెదను ♦ సూనృతవాక్య మిదౌను రాముఁ డే
పునఁ జనువాఁడె యుంచుఁ బలు ♦ పోకలఁ బల్కెడు గర్వితాత్మునిన్. ౧౩ 1328

* ద్విధా భజ్యేయ మప్యేవం ననమేయంతు కస్యచిత్-అనియు.

[1]క. దనుజేంద్రుని గుపితునిగా, మనమునఁ దగ నెఱఁగి సేనదు ♦ మంచినుడులు పే
చని యెను నిష్ఫలములుగా, నని లజ్జను బొంది యేమి ♦ యునఁ దోఁపమిచేఁ.
తే. మాల్యవంతుఁడు సంశయ♦మానసమున
నుండి జయ మబ్బునంచు య♦థోచితముగ
నాశిషము లిడి సెలవంది ♦ యాత్మవసతి
కరిగె; రావణుఁ డంత జ♦యంబుఁ గోరి. ౧౨ 1330
క. తనమంత్రులతోఁ గృత్యం,బును జక్కఁదలంచి చేయఁ ♦ బూనినపని గా
దనుజు లిటు చేయనోఁ గద, యని నిశ్చయ మొప్పఁ జేసి ♦ యుప్పురమునకున్.
క. అనుపమమగు సంరక్షణ,మును జేసి యతండు ద్వార♦మునఁ దూర్పునఁ జ
క్కనిరీతి నా ప్రహస్తుని, గనుచుండఁగ నాజ్ఞ చేసెఁ ♦ గను నేర్పుమెయిన్. ౧౩ 1333
సీ. దక్షిణంబున నున్న♦ద్వారంబునన్ మహావిక్రమాఢ్యులుగాఁగ ♦ వెలయుచున్న
యమ్మహోదరుని మ♦హాపార్శ్వునిం గావ నాజ్ఞ చేసెను పశు♦జాశిఁ గల్గు
ద్వారంబునం గావఁ ♦ దనయుని నింద్రజిత్తును రాక్షసౌఘయు♦క్తుని ఘనబలు
నామహామాయుని ♦ నంతట నియమించె; నుత్తరద్వారమం ♦ దుత్తమబలు
తే. లైన శుకసారణులఁ గావ ♦ నాజ్ఞ సేసి
తాను నట నుండ నెంచి యా♦తఁడు మంత్రి
గణమునకుఁ దెల్పె మఱియు న♦గరమునందు
[2]మధ్యమస్థానమును గావ ♦ మహితబలుని. ౧౪ 1333
క. నిరుపమమగు పౌరుషమునఁ, బరఁగు విరూపాక్షు దనుజ♦బలయుక్తుని నా
కరణి నియమించెఁ గావఁగ; నరసి నిశాచరవరేణ్యుఁ ♦ డంతఁ బురి కాగెన్.
[3]క. ఈవిధమున రక్షణమును, గావించి తనుం గృతార్థుఁ♦గాఁ దలపోసెన్
వావిరి మృత్యుప్రేరితుఁడై వాఁ డంతటను బురిని ♦ సనువగురీతిన్. ౨౧ 1335
తే. తావ నియమించి మంత్రులఁ ♦ గాంచి పోవ
నాజ్ఞ చేయంగ వారు జ♦యాశిషముల
నలరఁ జేయుచు గృహముల ♦ కరుగ నతఁడు
సిరులఁ దెంపొందు సౌధంబుఁ ♦ జేరె నెలమి. ౨౨ 1336

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౩౭ - వ సర్గము.

రాముఁడు వానరసేనారక్షణమును గావించుట.

క. మనుజేంద్రులు రాఘవు లట, వనచరనాయకుఁడు మఱియు♦వాయుతనయుఁ డా
హనుమయు భల్లూకేంద్రుం, డనుపముఁడగు జాంబవంతుఁ ♦ డంగదశరభుల్.

---

1 ప్రీడితో మాల్యవాన్ వాక్యమ్-అనిమా. 2 మధ్యమే స్థాపయే ద్గుల్మే-అనిమా. 3 కృత కృత్య మి వాత్మానం మన్యతే కాలచోదితః-అనిమా.

చ. ఘనమతి యావిభీషణుఁ; డ♦ఖండబలుండు సుషేణుఁ డట్లె యా
తనిపరివారముల్, మఱియు ♦ దారుణవిక్రముఁడైన మైందుఁ డ
ట్లనుపములౌ గజద్వివిదు ♦ లాకుముదుండు, గవాక్షుఁ డానలుం
డనితరసాధ్యశక్తియుతుఁ ♦ డౌ పనసుండును దక్కువానరుల్. ౩౹ 1338

చ. అరిపరిపాలితంబయిన ♦ యాపృథివీస్థలిఁ జేరి యందఱున్
వరుసగఁ గూడి లంక యిదె ♦ వాయుజుఁ డప్పుడు చెప్పినట్టి దీ
కరణిని గాన నయ్యెడిని ♦ గప్పర,నిర్జర,పన్నగాళికిన్
దరమె జయింప దీనిఁ గనఁ ♦ దద్దయు భీతియె గల్గఁ జేసెడున్. ౪ 1339

తే. మఱియు గంధర్వనాయకుల్ ♦ నెఱి జయింపఁ
గల్గఁ జాలరు రాక్షస♦కాంతుఁ డెపుడు
పురమునం దిందు నసముఁడై ♦ పొలిచియుండుఁ
గాన మనకింక జయసిద్ధి ♦ గల్గునట్లు. ౪౹ 1340

క. చక్కఁగ నాలోచింపుం, డిక్కడ గుమిఁగూడి యున్న ♦ యెల్లరు నని వా
రొక్కట నాడుకొనన్ విని, యక్కజముగ నవ్విభీష♦ణాఖ్యుం డంతన్. ౫౹

[1]ఉ. వారలఁ గాంచి స్పష్టముగ ♦ భావము వారికిఁ దోఁచునట్లుగాఁ
జారుతరంబుగాఁ దనరి ♦ సంస్కృతభాషను గ్రామ్యభాషయే
చేరని సత్పదంబులను ♦ జెల్వమరన్ వచియించె నిట్లు; లో
పారమనీషులార! వినఁ ♦ జాలుదురే మదుదీరితం బిఁకన్. ౬ 1342

క. అనలుఁడు, శరభుఁడు, సంపా,తినామకుఁడు, ప్రఘసుఁడన క్షి♦తిం బేర్వాసిం
గను నామంత్రులు నల్వురు, చని లంకకు వచ్చినారు ♦ సరగున మరలన్. ౭

క. పతగాకృతులం దాల్చి య,హితసైన్యముఁ జొచ్చి నగర♦మేలాగు సుర
క్షితమగునో దానికి నా, దితిజులు చేసిన మహావి♦ధివ్రజ మెల్లన్. ౮ 1344

[2]చ. కనుఁగొని వచ్చినారు నృప♦కాంత! దురాత్ముఁడు రావణుండు ప
త్తనమును గావఁజేసిన వి♦ధానము లన్నియుఁ దెల్పినారు మీ

---

1 వాక్య మగ్రామ్యపదవ త్సుష్కలార్థం విభీషణః - అనిమూ. అగ్రామ్యపదవత్ సంస్కృతపదవత్ సర్వేషాం స్ఫుటప్రతిపత్తయే స్వదేశభాషాపదరహిత ముక్తవా నిత్యర్థః - అనివ్యాఖ్య. దీనిచే సంస్కృతభాష దేశభాషగనుండి ఆయాదేశములలోఁ బ్రాకృతాదిగ్రామ్యపదములు కలిసియుండెనని స్పష్టమగుచున్నది. గ్రామ్యభాష నుపయోగించినచో వానరులునుం దెలియకపోవచ్చునేమో యని విభీషణుఁడు కేవలసంస్కృతభాషనే యుపయోగించె ననుట నిర్వివాదాంశము. సంస్కృత మేకాలమునను దేశభాషగాదను దుర్వాదము దీనఁ దొలఁగవచ్చును. సంస్కృతము దేశభాషగా నుండఁబట్టియే మనవారు సకలదేశములయందుండు వారలకు స్పష్టముగాఁ దెలియుటకై సంస్కృతభాషనే గ్రంథములవ్రాసి రనికూడఁ దెలక మానదని గ్రహింపవలయు. 2 లోఁగా వానరులందఱింగాంచి విభీషణుఁడు చెప్పినట్లు చెప్పఁబడినది. ఇందు నృపకాంత-అనిరామునిసంబోధించిచెప్పఁబడినట్లు

యనుమతియైనఁ దద్విధుల ♦ నన్నిటి నున్నటు లేను జెప్పెదన్
వినఁదగు; నాప్రహస్తుఁ డతి♦విస్తృతసైన్యముతోడఁ బొంగుచున్. ౧౧॥ 1845

సీ. ప్రాగ్ద్వారమున; వీర్య♦బలముల ననముత్రైతసరారు నస్తుమహో♦దరుఁడు మఱియు
నమ్మహాపార్శ్వుండు ♦ యామ్యదిగ్ద్వారంబునందును, రావణు ♦ నాత్మజుఁడగు
నింద్రజిత్తును దైత్యుఁ ♦ డేవునఁ బట్టసఖడ్గముద్గరశూల♦కార్ముకాంచి
తకరులు శూరులౌ ♦ దైత్యప్రధానులు పెక్కండ్రు తనుఁగొల్వ ♦ నుక్కుమిగిలి
తే. పశ్చిమద్వారమందును ♦ బరమనియత
బుద్ధియై యాయుధంబులఁ ♦ బూని దనుజ
సద్భటవ్రజములు తన్ను ♦ నరగఁ గొలువ
రావణుఁడు తాని లంకాపు♦రమునఁ జెలఁగి. ౧౨॥ 1846

తే. ఉత్తరద్వారమందును ♦ నున్నవారు
పరులబాధలు పురికి నె♦క్కరణి నైనఁ
గలుగకుండఁగఁ జేయంగఁ ♦ గర్బురగణ
తల్లజుండు విరూపాక్షుఁ ♦ డుల్ల మలర. ౧౩॥ 1847

చ. ధనువులు శూలఖడ్గములు ♦ దాల్చిన రాక్షససేనతోడ, నిం
కను బలశాలురౌ దనుజ♦కాంతులతోడను, గుల్మమందుఁ గా
వను నిలుచున్నవాఁడు; పుర♦వర్యమునం దిటు సంవిధాన మొం
దినసురవైరిసేనలను ♦ దెల్లముగాఁ గని మంత్రు లిప్డు దే. ౧౪॥ 1848

క. చను దెంచినార లిచ్చటి, కనఘాత్మా! రామచంద్ర! ♦ హస్తిసకర మొ
య్యన నెక్కు వేయిమందియు, ఘనరథికులు నయుతసంఖ్య♦గాఁ దగువారల్.

క. ఇరువదిసహస్రములుగాఁ, బరఁగెడు నాశ్వికులు మఱియు ♦ భటముఖ్యులు భీ
కరమూర్తు లొక్కకోటియు,నిరతము రావణునిఁగొల్వ ♦ నేర్పరులగుచున్. ౧౬

క. బలమునఁ బరాక్రమంబున, నిలఁ జేరుం గాంచి క్రూరు♦లై యయి యుద్ధం
బుల నేర్పుగలుగు రాక్షసు, లలరుచు రావణుని గొల్తు ♦ రనుచరు లగుచున్.

క. అనిసేయఁగఁ బదిలక్షలు, దనుజులు పూర్వోక్తవీర♦తతులం ద్రొక్కం
గ్కనికిన్, సాయమ్ముగ వే, చను దెంతురు మనములందు ♦ సమ్మద మలరన్. ౧౮

క. అనుచు మహాబాహుండగు, ఘనబుద్ధి విభీషణుండు ♦ గాదిలిమంత్రుల్
[illegible]కుం జెప్పినవార్తల, వినిపించుచు మంత్రుల [illegible]ట ♦ విభునకుఁ జూపెన్. ౧౯

క. వారును బురివార్తల నా, శ్రీరామున కెల్లఁ దెలియఁ ♦ జేసిరి, విదపన్

వ్నది. విరుద్ధము కాదా యని ప్రశ్నింపరాదు. తథా తేషు ప్రధానేషు [illegible] ఉప్రీత్- అనియు లఙ్కాయాం సచివైః స్వర్యాం రామాయ ప్రత్యవేదయత్- అనియుఁ జెప్పఁబడినది. కాఁ బట్టి శ్రీరామమూర్తి వినుచుండ వారలంగూర్చి కొంతచెప్పి రామునిం గూర్చియుం బల్కెనని యర్థము చేసికొనవలయును.

సారసపత్త్రాక్షుండగు, భూరమణునకుఁ హితంబు ♦ బుద్ధిఁ దలఁచుచుఁ. ౨౦

క. సిరివెలయు రావణానుజుఁ, డురుముదమున రాముఁ గాంచి ♦ యోరఘురామా!
సురవైరి రావణుఁడు సం,గరమున యక్షేశు నొంపఁ ♦ గాఁ దగుకోర్కిఁ.

క. మును వెడలిన సమయంబున, ననుపమవీర్యమున శక్తి ♦ ననిఁ గుందక యొ
ప్పిన విక్రమమున ధైర్యం, బున బలమున నాదుజ్యేష్ఠుఁ ♦ బోలిన సుభటుల్.

క. [1]చని రక్షువది లక్షలమం,ది నియతి యొప్పారుచుండ ♦ దితిజేంద్రుని వెం
టను; నిట్లు వైరిబలములఁ, గొనియాడితి నంచు మీరు ♦ క్రుధనొందకుఁడీ!.

క. పరులను నిరసించుటకై, యురురోషముఁ బుట్టఁజేయు ♦ చున్నాఁడను గా
ని రిపుల వర్ణించుచు మీ, కురుభయమును గల్గఁ జేయ ♦ నోరఘురామా!.

క. ఫల మేమి రోషమును నీ,మ్ములఁ బుట్టింపంగ ననెదొ ♦ మునుకొని యాది
త్యుల నీవు నిగ్రహింపం, గలవాఁడవు వీర్యమున ని♦కామము రామా !.

క. చతురంగబలంబులతో, వృతుఁడవు రావణునియట్లు ♦ వీరులుగా ను
న్నతబలములఁ దగు కపులను, జతురంగములుగ విభాగ♦సరణి మెఱయఁగఁ.

ఆ. [2]నిర్వహించి దాన♦వేంద్రుని మథియింపు
మనుచు; రావణుని స♦హాజుఁడు పలుకఁ
బరులవిక్రమంబు ♦ భంగింప రాఘవుం
డతనితోడ నిట్టు ♦ లనియె నపుడు. ౨౫ 1361

చ. నిరతిశయప్రతాపుఁడగు ♦ నీలుఁడు వానరపుంగవుండు కీ
శరమణసంవృతుండగుచుఁ ♦ జయ్యనఁ దూరుపుద్వారమందు భీ
కరగతి నిల్చి దైత్యబల♦కాంతుఁడుగాఁ దగు నాప్రహస్తుతో
దుర మొనరించు; వాలికి సు♦తుండగు నంగదుఁ డాత్మసేనతోఁ. ౨౬

తే. దక్షిణద్వారమున నిల్చి ♦ దర్ప మలర
నమ్మహాపార్శ్వబలయుతు ♦ నమ్మహోద
రుని రణంబున నోర్చుఁ గా ♦ కనిలతనయుఁ
[3]డప్రమేయబలోన్నతుఁ ♦ డగుటవలన. ౨౭ 1363

క. దనుజేంద్రు నింద్రజిత్తును, నని నోర్వంగలఁడు గాన ♦ నగచరవరులఁ
గొని పడమటిద్వారంబున, ననిహతపౌరుషముఁ జూప ♦ నరుగఁ వలయుఁ.

చ. దనుజుల దానవాళుల ను♦దారమనీషుల బ్రహ్మమానులఁ
గని యపకార మెప్పుడును ♦ గాదనకే యొనరించి దానఁ బ్రీ
తిని గని క్షుద్రబుద్ధియయి ♦ దివ్యవరంబుల బ్రహ్మనుండి కై
కొని పెనుగర్వమూని ప్రజ♦కుఁ బెనుతాపముఁ గల్గఁజేయుచుఁ

1 అత్ర మన్యుర్న కర్తవ్యో రోషయే త్వాం నభీషయే-అనియూ. 2 నిర్మథిష్యసి రావణమ్-అనియూ. 3 ప్రవిశ త్వప్రమేయాత్మా-అనియూ.

దనమదిఁ దోఁచినట్లు సత♦తంబు జగంబుల సంచరించు నా
దనుజవరేణ్యు రావణుని ♦ దర్పము పొంగ వధింప నెంచితిన్
గనుక ససైన్యుఁడై దనుజ♦కాంతుఁడు కావలిఁగాంచు నుత్తరం
బునఁ దగు ద్వారమున్ జొరఁగఁ ♦ బూనెద లక్ష్మణుతోడ నేనికన్. ౩౧

క. అని చెప్పిన నాతనితోఁ, వనచరనాయకుఁడు జాంబ♦వంతుఁడు దనుజే
శునితమ్ముఁ డావిభీషణుఁ, డను మువ్వురు నీదు శౌర్య ♦ ముఁగనుచు నుండన్.

తే. *పశ్చిమోత్తరమధ్యమ♦భాగమందు
నిలిచియుందురు గాక; కోఁ♦తు లివు డుండు
నట్లు మానుషరూపంబు ♦ నాశ్రయించి
యుండరాదిఁకమీఁదట ♦ యుద్ధమందు. ౩౩ 1367

క. మనవానరసేనల నిం, కను నాచెప్పెడు సుచిహ్న♦కంబులు గ్రహియిం
పనుదగునే వవి యనఁగా, వనచరు లివ్వార లనుచు ♦ బవరములందున్. ౩౪

క. మనకుం దెలియుటకై వా, రనయము వానరులుగానె ♦ యలరారుట యే
ఘనచిహ్నము; లిదిగో వినుఁ, డనూనతేజుండు నాస♦హాయుఁడును నేనున్.

ఆ. ఈవిభీషణుండు ♦ నీతనిమంత్రులు, నలువు రిట్లు దురము♦నం దలంప
నత్తసంఖ్య నలరు ♦ జనులము మేము న, రాకృతులను బరుల ♦ నని వధింప.

క. తలఁపఁడు వారము నుఁడి యని, పలికెన్; మతిమంతుఁడైన♦భాస్కరకులుఁ డి
మ్ములఁ గార్యసిద్ధికై యిటు, పలికె విభీషణునితోడ ♦ బరవశ మలరన్. ౩౬

ఆ. ఇట్లు పలికి రాముఁ ♦ డెంతయు నింపుగాఁ, దగు సువేలధరణి♦ధరతటంబుఁ
గాంచి దాని నెక్కఁ♦గాఁ దలపోసె న, మ్మదిని వేఱుతలఁపు ♦ మానియుండె.

చ. ఘనమతియుం బరాక్రమము ♦ గల్గినవారలలోనఁ బెద్దయై
తనరు రఘూత్తముండు ప్రమ♦దంబునఁ బెద్దదిగాఁ జెలంగు నా
వనచరసేన యాత్మ ♦ బన్వచు వెంబడిరాఁగ వైరులన్
దునుము తలంపునన్ జనియెఁ ♦ దోడనె లంకకుఁ జెంతనున్నయా
ఘనగిరిపైకిఁ బత్తనముఁ ♦ గాంచెదువేడ్క (?) నతిశయింపఁగన్. ౩౭ 1373

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౮ - వ సర్గము.

రాముఁడు లంక దరించుటకై సువేలాద్రి నెక్కుట.

చ. మనమున నాసువేలమహి♦ధ్రంబును గాంచుచు దానినెక్కవే
డ్కను సహజుండు తోనడువఁ ♦ గా నసురక్షుల ధర్మవేత్తలన్

---

* న చైవ మానుషం రూపం కార్యం హరిభి రాహవే - అనియూ అనఁగా నింతకుముందు వానరులు మనుష్యరూపములఁ దాల్చియుండిరనియు నిఁకమీఁదట నిట్లుండరాదని శ్రీరాముఁ డాజ్ఞ చేయ యథారూపముగ నుండిరనియుఁ దేటపడును.

వనచరరాక్షసాధిపుల ♦ భాస్కరసూను విభీషణాఖ్యులన్
ఘనతరమంత్రవేత్తలను ♦ గార్యగతిజ్ఞులఁ గాంచి ప్రీతితోన్. ౧½ 1374

తే. మధురములు నుత్తమములునౌ ♦ మాట లొప్పఁ
బల్కె నిట్లని; మనమెల్లఁ ♦ బలువిధంబు
లైన ధాతుగణంబుల ♦ నలరు నీసు
వేంద్రవర్యముపై నెక్కి ♦ యీనిశ నొగి. ౨½ 1375

క. నున నుఱరఁ గడపుదము; దుర్గనమునఁ దనచావుకొఱకు ♦ మామకసాధ్విన్
జనకజ హరించి ధర్మంబును దెలియక న్వకులవృత్త♦ముల నెంచకయే ౩½

క. కులగౌరవంబు నుంతయుఁ, దెలియకయుండెడు మదాంధ♦దితిజేంద్రపురిం
గలయం జూతము; రావణుఁ, డల రాక్షసనీచబుద్ధి ♦ నవలంబించెన్. ౪ 1377

చ. కనుకని గర్హితంబయిన ♦ కార్యమొనర్చెను; రాక్షసాధమున్
వినుతి యొనర్చినన్ మదిని ♦ వేగను రోషము ప్రజ్వరిల్లెడున్
దనుజుని జంపఁ బూనుకొనఁ ♦ *దత్కృతమంతువుచేత నెల్లరన్
దనుజులఁ జంపఁగానలయుఁ ♦ దప్పదు నీచుని నేమనందగున్. ౫ 1378

తే. ఒక్కఁ డపరాధ మొనరింప ♦ నొరునిజంప
నేలయన్నను వినుఁ డింక ♦ మృత్యుపాశ
వశగతుండయి యొక్కఁడు ♦ బహుళపాప
కార్యములఁ జేయు నానీచు ♦ కారణమున. ౫½ 1379

క. కుల మెల్లను నశియింపం, గలదని; రావణునిపైని ♦ గల కోపమునం
బలుకుచు నీగతిఁ జిత్రంబులుఁదగు సానువుల నొప్పు ♦ భూమిధరంబున్. ౬½

క. ఆ రేయిన్ వసియింపం, గా రయమున నెక్కెఁ; దోడఁ ♦ గార్ముకశరముల్
పౌరుషము నెఱపఁ దాలిచి, శ్రీరాముని వెంటఁ జిత్ర♦శిఖరిని వేడ్కన్. ౭½

తే. లక్ష్మణుండును నియతుఁడై ♦ లలితగతుల
నెక్కె; సుగ్రీవుఁడును మంత్రు ♦ లెల్ల గాఁగ
నతని వెంబడి నెక్కె నా♦యసురవర్యుఁ
డా విభీషణుఁడును నెక్కె ♦ నతనితోడ. ౮½ 1382

సీ. అనిలతనూభవుం ♦ డంగద, నీల, మైం
ద, ద్వివిదాహ్వయుల్ ♦ తగ గజుఁడును,
గవయు, గవాక్షులు, ♦ గంధమాదనుఁడును,
శరభుండు, పనసుండు, ♦ హర, కుముదులు,
యూథపుండగు రంభుఁ ♦ డురుబలుండగు జాంబ
వంతుండును, సుషేణుఁ, ♦ డెంతొ బుద్ధి,

* యస్యాపరాధా న్నీచస్య-అనియూ, మంతువు=అపరాధము.

## ౩౯ - వ సర్గము.

-శ్రీరాముఁడు లంకం గాంచుట.-

[1]క. వారివీరులు తన్నిశ నా, ధరణీధరమందునుండి ♦ తమిఁ గాంచుచు రా
తిరి పోవ లంకయందలి, పరమవనారామములను ♦ బరికించి రొగిన్. ౧ 1389

తే. సమములై సుందరములు వి♦శాలములును
నాయతంబులు రమ్యంబు ♦ [2]లక్షిసుంద
రములునై యొప్పుచున్న యా♦రామములను
గాంచి యానంద మొంది రక్కపులు మిగుల. ౨ 1390

సీ. చంపకాశోకముల్ ♦ సాలతాలంబులు పున్నాగములు చాలఁ ♦ బొలిచియుండఁ
గాఁ దమాలవనముల్ ♦ కడు నిండియుండంగ నాగకేసరపంక్తి ♦ బాగుమీఱ
నొప్పు హింతాలార్జు♦నోర్వీరుహాంబులు నీపముల్ సుమభర♦నిబిడసప్త
పర్ణద్రుమంబులు ♦ కర్ణికారంబులు తిలకముల్ రమ్యపా♦టలము లోలయఁ
బుష్పితాగ్రంబులై ♦ పొలుచుఁదీఁగలుతమ్ముఁ గాఁగిలింపఁగఁ జిత్ర♦కమ్రపుష్ప
తే. యుతములై రక్తపల్లవ♦యుక్తములయి
తనరు మందారముఖదివ్య♦తరుయుతమయి
యలరు నమరావతిం బోలి ♦ యాపురంబు
వెలయుచుండెను వర్ణ్యమై ♦ విపులరీతి. ౬౪ 1391

చ. పురమది నీలశాద్వలవి♦భూతి నెసంగుచుఁ జిత్రరీతిగాఁ
బరఁగు వనంబులన్ వెలసి ♦ వర్ణనయోగ్యమునై చెలంగె; న
త్తరువులు భూమణాదుల ని♦తాంతము మానవులొప్పునట్లుగా
సురుచిరగంధముల్ వెలయ ♦ సుందరపుష్పఫలంబులన్ మనో
హారముగఁ దాల్చి చూచుటకు ♦ నందముగాఁ దగియుండె నెల్లెడన్. ౭ 1392

తే ఎల్లఋతుధర్మములతోడ ♦ నెంతొరమ్య
మగుచుఁ దుమ్మెద లింపుగా ♦ నార్వ నచటి
వనము చైత్రరథంబు నం♦దనము నాఁగ
నలరెఁ గన్నులకింపుగాఁ ♦ జెలఁగి మిగుల. ౮ 1393

క. వనములఁ దగు నిర్ఝరములఁ, గనుపట్టెడు నీరుకోళ్ల♦గములును గోయ
ష్టినికరములునున్ నర్తన,మును నల్పునుయూరములును♦మోదము నొసఁగన్.

క. ధ్వనిచేయుపరభృతంబుల, నినాదముల వినిరి కీశ♦నివహోధ్యక్షుల్;
వనముల నుపవనముల యం, దనిశము పతగములు క్రొవ్వి ♦ యార్చుచునుండన్.

క. నిరతము మట్పదపంక్తులు, తిరుగుచునుండును, బికాళి ♦ దివ్యతరువరో
త్కరములను నిండియుండును, నిరంతరము పతగవిసుల♦నినదమ్ము లొగిన్. ౧౦

1 వనా న్యుపవనానిచ-అనియూ. 2 దృష్టిరమ్యాణి తే దృష్ట్వా-అనియూ.

తే. షట్పదంబులఝుంకృతి ♦ సముదయములు
వినఁబడుచునుండు నల్గడ♦లను; మనోజ్ఞ
షట్పదంబులు సేవింపఁ ♦ జాలియుండు
బెగ్గురులు మందవిచ్చుకల్ ♦ బిగ్గ నార్వ. ౧౦౪ 1397

క. వనములు తనరారంగా, వనచరు లారామణీయ♦వై భవములకున్
దనువు లొగిఁ బులకరింపం, గనుమిక్కిలి వ్యాప్తుఁ గుచుఁ♦గ... చెలఁగుచున్.

తే. వీరులును గామరూపులై ♦ వెలయుచుంటఁ
దగినరూపంబులం గొని ♦ తద్వనములఁ
జొచ్చి రిట్లుగ వనమ తే♦జులగు వార
లందుఁ జొరఁబడుచుండు న♦య్యుద్వనమునందు. ౧౦౬ 1399

క. అనిలుఁడు సుమనఃపరిమళ,మున మున్గుచు ఘ్రాణింద్రి♦ములకు సుఖంబుం
గనఁజేయుచు వీచెను; నో,య్యనఁ గొండలు యూథనాథ♦ లగుహరివీరుల్.

చ. వనచరనాథునాజ్ఞఁ గొని ♦ శైలము భీకరనాద మొప్పఁగా
వనగతపక్షివారముల ♦ వారక భీతిలఁ జేయుచున్ ముదం
బునఁ దగుసేన్గులన్ మృగస♦మూహము భీతిలి పాఱఁ జేయుచున్
దనుజపురంబు కంపము ని♦తాంతము నొందఁగఁ జేయుచున్ జవం
బునఁ జనుసప్త పాదముల ♦ భూమిని వ ... తలంగఁ జేయుచున్
జని ఠల లంకకున్ గడుధ్వ♦జంబులఁ జెన్నగుచోటికిన్ నమున్
వనచరపాదసంహతులఁ ♦ బర్విసధూళి జనంబునన్ దినం
బును గడు నావరించె, బహు♦భూతభయంకరరీతి నుద్ధ్వతిన్. ౧౦౮ 1401

చ. వనములయందునున్న ఘన♦భల్లమృగేంద్రవరాహముల్ మదం
బునఁదగు సేనుఁగుల్ మహిష♦ముల్ మృగముల్ ... ప్పుచే
సిన భయదారవంబులకుఁ ♦ జెచ్చెఱ భీతిలి పాఱ నార్తమౌ
నినదము చేత దిక్కులను ♦ నిండఁగఁ జేయుచు నొక్క పెట్టునన్. ౧౦౯ 1402

సీ. ఆత్రికూటాద్రిమ♦ధ్యమశృంగ మత్యున్నతంబయి సుప్రసి♦ద్ధంబు నగుచు
నంబరంబును దాఁకు♦నట్లు గానంబడి యద్వితీయంబయి ♦ యఖిలభాగ
ములఁ బుష్పనికురుంబ♦ముల సమాచ్ఛాదితంబయి స్వర్ణవర్ణమై♦ నూఱిమాఱు
యోజనంబుల పొడ♦వొప్పఁగా విపులమై చానుడగ్నిసమయి ♦ శక్తమగుచు
తే. సిరులఁ దనరుచుఁ బెద్దదై ♦ పఱఁగి *పతగ
ములకునుం జేరరానిదై ♦ చెలఁగి మనసు
చేతనైన నెక్కఁగరాక ♦ చిత్రరీతి
నుండ నన మర్త్య లెక్కంగ ♦ నోపువారె ౧౧౦ 1403

క. ఆపర్వతశిఖరంబునఁ, జూపట్టును లంక దనుజ♦శూరాగ్రణి యుం

* దుష్ప్రాపం శకునై రపి-అనిమూ.

దేవారి పాలకుఁడుగా, శ్రీపాలితుఁ డగుచుఁ జాలఁ ♦ జెలఁగుచు నుండున్.౨౦

క. పుర మయ్యది శతయోజన,పరిమితమగు పొడవుఁగల్గి ♦ భాసిలి మిగులన్
సిరులన్ ద్రింశద్యోజన,పరిమిత మగు వెడలుపు దగఁ ♦ బరినుత మగుచున్.౨౦౻

క. తెల్లనిమేఘంబులవలె, నల్లసిల్లెడు గోపురములు ♦ నొప్పుచుఁ గడు భా
సిల్లెడు సువర్ణ పనణము, లెల్లెడలన్ రాజతంబు ♦ లెనఁగం బరఁగున్. ౨౧౻

తే. వానకాలంబురాఁగ నా♦వానును ఘన
మధ్యమపథంబు నాఁ దగు ♦ మహితపుమ్మ
రంబు మేఘగణంబుల ♦ గాజిలునటు
లదియుఁ బ్రాసాదతతివిమా♦నాళి వెలయు. ౨౨౻ 1407

సీ. అందు మధ్యమభాగ♦మందుఁ బ్రాసాద మొక్కండు కాంతులమీఱి♦క్రాలుచుండు
వేయి స్తంభంబులు ♦ వెలయును దానికి గైలాసశిఖరంబు ♦ కరణి నాక
సంబున వ్యాపించి ♦ చైత్యంబునకు నది భూషణప్రాయమై ♦ పొల్చుచుండు
దానవముఖ్యములు ♦ దానిఁ గాచుచునుండు ననిశము, రమ్యమై ♦ యమలకాన

తే. నములచే భూత్రములచేత ♦ ననులవివిధ
ధాతువులచేత నతివిచి♦త్రంబు నగుచు
నుపవనంబులు వెలయుంగ ♦ నురుపతత్రి
గణము కలనాదములు చేయుఁ♦గాఁ బరఁగుచు. ౨౫ 1408

క. పలువిధములైన మృగగణ,ములు తిరుగుచు నుండఁగ వన♦ములు పెక్కులు భా
సిలు రాజసగణములు నుజ్జ్వలభూషణయుక్తిఁ గావ ♦ భాసిలుచుండున్.౨౬౻

చ. అనిశము సంపదల్ పొదల ♦ సత్యధికోన్నతి నొప్పియుండు ప
ట్టనమును దాని రావణుని ♦ ధామముగాఁ దగుదాని లక్ష్మణుం
డనుజుఁడుగాఁ జెలంగు మహి♦మాఢ్యుఁడు రాముఁడు వేడ్కఁ గాంచె నా
వనచరయుక్తుఁడై మదిని ♦ వర్ణనముల్ దమి సేయుచున్ గడున్. ౨౭౻ 1410

క. సురనిభుఁడు వీర్యవంతుఁడు, ధరణీపతిచంద్రుఁడగుచుఁ ♦ దగురాముఁడు సుం
దరసౌధనిబిడమా పుర,వరమును గని యద్భుతార్ణ♦వంబున మునిఁగెన్. ౨౮౻

చ. సురుచిరవస్తుసంతతులు ♦ శోభిలి రత్నకయత్నపూర్ణమై
నిరుపమసౌధవారములు ♦ నిండి కవాటవరంబులున్ మహా
స్థిరపరియంత్రముల్ వెలయఁ ♦ దద్దయుఁ బొల్చెడు నట్టి లంక నా
హరిగణయుక్తుఁడై కనియె ♦ నారఘురాముఁడు వేడ్క మీఱఁగన్. 1412

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౦ - వ సర్గము.

### రావణ సుగ్రీవుల ద్వంద్వయుద్ధము.

క. జనకసుతాపతి యంతట, వనచరయూథపులు తన్నుఁ ♦ బరివేష్టింపం
గను సుగ్రీవునితో సౌ,జనయుగ్మవిశాలమైన ♦ స్థలము న్రొంబె. ౧ 1413

క. తనరారు శైలశిఖరం,బును నెక్కెను; రాముఁ డద్రి ♦ముఖ్యశిఖరమునం
దున నొక్కముహూర్తము ని,ల్చి నిఖిలదిక్కులను గాంచి♦చేసవ నొకచోఁ.

ఆ. అతివిచిత్రమగుచు ♦ నా త్రికూటాద్రిశృం
గమునయందు విశ్వ♦కర్మచేత
నిర్మితమయి మిగుల ♦ నిర్మలమగువన
ములను వెలయు లంకఁ ♦ గలయఁ జూచె. ౨॥ 1415

క. పురగోపురశిఖరంబున, దురాసదుండగుచు మిగుల ♦ ధూర్తుండగు న
ర్బురనాథుఁ డుండ శ్రీరఘు,వరుఁ డప్పుడు గాంచెఁ గ్లనక♦నయ్యలతో వడిన్. 3

*క. ఇరుభాగంబుల సితచా,మరములు, విజయంబు దెలుపు ♦ నూతనశుభ్రం
బరలసితమైన ఛత్రము, పరసుప్రమునంబు నింప ♦ భాసిలు వానిన్. ౩॥ 1417

తే. అరుణచందనలిప్తాంగు ♦ నమలరత్న
భూషణాలంకృతుని హేమ♦భూషితాంబ
రుని వినీలాంబుదశ్యామ♦తనుని, దేవ
పతిని మార్కొనఁ జాలిన ♦ పౌరుషాఢ్యు. ౪॥ 1418

క. మును నైరావత మొక్కట, నసిమైన దంతములఁ బొడువ ♦ నా దెబ్బలచే
తను గల్గినకాయలు ఱొమ్మునఁ జూపట్టంగ వెలయు ♦ భూగిభయదునిన్. ౫॥

తే. మఱియుఁ గుందేటినెత్తురు ♦ మాడ్కి వెలయు
నుత్తరీయంబు చెలువార ♦ వ్యోమమందు
సాంధ్యరాగంబు వ్యాపించి ♦ జలదరాశి
పగిదిఁ జూపట్టు దానవ♦పతిని భయదు. ౬ 1420

చ. వనచరులున్ రఘూత్తముఁడు ♦ వానిని గన్గొనుచుండఁగా నె యా
దనుజవరేణ్యుఁ గాంచి యిటు ♦ ధారణినాథుఁడు రామమూర్తి ని
ల్చినతఱి రాజచిహ్నములు♦చే వెలుఁగొందుచు నీచుఁ డీతఁ డుం
డ నగు నె యన్నకోపము న♦డంగఁగఁ జేయఁగ నూర్యసూనుఁ డా
య్యెనఁ దను చిత్తసత్వముల ♦ నగ్గిరిశృంగమునుండి చివ్వనన్. ౭॥ 1421

క. దనుజేంద్రుఁ డున్నగోపుర,మునకున్ వడి నెగిరెఁ; జ స్థ♦మున నిందుకలుష
నను భీతి లేక యాతనిఁ, గనుచున్ సుగ్రీవుఁ డొక్క♦యుగముండి తిగన్. ౮॥

* విజయచ్ఛత్రశోభితమ్-అనియూ.

¹ఉ. దానవనాయకుం గొనక ♦ తద్దయుఁ గ్రూరతరోక్తులన్ గ్రుధం
బూని వచించె; నోరి రఘు♦భూపతి కేను సఖుండ దుర్మతీ !
యానిఖిలప్రపంచవిభు ♦ నంఘ్రిసరోరుహదాసుఁడన్ మహా
మానవనాథుసత్త్వబల♦మంజులకీర్తిసహాయసంపదన్
నే నిను వీడఁ జాల నిఁక ♦ నిర్భరపౌరుషమూని తన్నెదన్. ౧౦ 1423

చ. అని వచియించి వేగముగ ♦ నాతనిమీఁదికి దాఁటి చిత్రమా
దనుజవరేణ్యమస్తకని♦తాంతవిభాసురసత్కిరీటపం
క్తిని గడులాగి యుద్ధతిని ♦ గ్రిందఁ బడంగను ద్రోసి తాను నొ
య్యన ధరవ్రాలె; నిట్లు తన♦యంతికముం గడుఁ జేరు నాకపిన్. ౧౧ 1424

²క. కని రావణుండు తా ని, ట్లనియెఁ బరోక్షమునయందు ♦ నైతివి నీవో
వనచరసుగ్రీవుండవు, చనుదెంచితి విపుడు నాదు♦సమ్ముఖమునకున్. ౧౨ 1425

³క. కనుకన్ హీనగళుండవు,గను గాఁగల వింకమీఁదఁ; ♦ గడువడి నని యా
దనుజేంద్రుఁ డాడి శీఘ్రం,బున లేచి సరోజమిత్ర♦పుత్త్రునిఁ బెలుచన్.౧౩ 1426

క. కరములను బట్టి యప్పుడె, ధరణిం బడఁద్రోసె హరివ♦తంసుఁడు శూరుం
డరుదుగఁ జెందువిధంబున, నురుగతిఁ దా లేచి బాహు♦యుగళిని నతనిన్.

సీ. ధరణిని బడఁద్రోసె; ♦ నిరువురు వారిట్టు లొకరి నొక్కరు బిగు♦వొప్పఁ గౌఁగి
లించుకొనుటచేత ♦ మించి దేహంబునఁ జెమటలు గాఱ న♦ఖముల జీఱు
కొనుటచే నంగము♦లను రక్తమును గాఱఁ గదలనీయక పట్టు♦వదలకుండఁ
బెనచుకొనుటఁ జేష్ట♦లను మాని పట్టును విడువఁగాఁ బుష్పిత♦విమలకింశు

తే.కాఖ్యభూరుహశాల్మలి♦కావనీజ
ముల విధమ్మున నుండిరి ♦ పెలుచ వారు
కరతలారత్నిముష్టిసం♦ఘాతములను
ఖరనఖరములఁ జీఱుటఁ ♦ గడఁగి చేసి. ౧౪ 1428

క. భరియింపరానివిధమున, నురుబలులగువారు మిగిలి ♦ యుద్ధంబును జే
సిరి; వారు భీమజవమునఁ, బురగోపురమునకు నడుమఁ ♦ బొంగెడుకాంక్షన్.

తే.మల్లయుద్ధంబు గావించి ♦ యెల్లరుఁ గనఁ
బైకిఁ జిమ్ముచు మరలను ♦ బట్టి లాగు
చును బరస్పరమున్ వంచు♦కొనుచు నడుగు
లిడుచు నడుమకుఁ బోవుచు ♦ దుడుకుమీఱ. ౧౬ 1430

తే.ఒకరిపై నొక్కరుగ్రత ♦ నూని హస్త
ములను వైచి తగం బట్టి ♦ మూర్తుల దృఢ

---

1 లోకనాథస్య రామస్య సఖాదాసోఽస్మి రాక్షస-అనియు. 2 సుగ్రీవస్త్వంపరోక్షం మే హీనగ్రీవో భవిష్యసి-అనియు. అనఁగా నాకంటఁబడనప్పుడు సుగ్రీవుండవు. (మంచికంఠముగల వాఁడవు) ఇఁకఁ గంఠహీనుఁడ వగుదువని భావము.

ముగను గౌఁగిటఁ జేర్చియు ♦ దిగిరి నాఁ
పరిఖముల యంతరమునకు ♦ సరిగ నిలకు. ౧౬౪ 1431

చ. సులువుగ లాఘవంబునను ♦ క్షోణిని ముట్టక మ్రొక్కి దాఁటి యా
యలఘుబలాఢ్యు లొక్కక్షణ ♦ మందున నిల్చి పరిక్రమంబునన్
గలిగిన నూన్పులన్ విడిచి ♦ క్రమ్మఱఁ గౌఁగిటఁ జేర్చుకొంచు ని
మ్ములఁ బయికేగి భూరికర♦ముల్ ఘనపాశములై పెనంగఁగాన్. 1432

క. తనువుల బంధించిరి యుద్ధనిపుణతన్; బట్టులను ♦ దారుణవిక్రాం
తిని నభ్యాసబలంబులఁ, బెనుగర్వముచేత విజ్జ♦వీఁగుచు వారల్. ౧౮ 1433

క. పులులవిధంబునఁ గలభంబులరీతిని నొకరినొకరుఁ ♦ బూనిన బంధం
పలలితగతులొప్పఁగఁ ద్రోవలఁ దిరుగుచుఁ బెనఁగి రెండొ♦సాంఘలు మీఱన్.

సీ. ఇతరేతరము వార ♦ లేపునఁ గదిసి వక్షంబులు మోఁదుచు ♦ గాఢతరము
గాఁ గౌఁగిటం జేర్చు ♦ కరణిగా నడుముకొనుచుఁ బటాలునఁ బడి ♦ రచటినేల
నంతలోపలనె వా ♦ రట్టె లేచి పరస్పరముఁ బట్టి ప్రస్ఫుటశక్తి ♦ క్షమఁ బడంగఁ
ద్రోయుచు బహుశిక్షి♦తులగు సంగరమార్గములఁ బెనంగిరి మనశ్శంబులఁ జెలంగు
కరులఁ బోలెడు వీర♦వరులు వారిద్దఱు వ్యాయామనిపుణుల ♦ బలముకలిమి

తే. గల్లువారలు గావునఁ ♦ గట్టుగంబ
ములకు సరియగు తనుబాహు♦వుల నణంచు
కొనుచునుండియు నలజడి ♦ గనక యుండి
రాహవంబునఁ బొంగుచు♦హాలు చెలంగ. ౨౦౪ 1435

క. ఈరీతి చాలకాలము, వారాహవ మొప్పఁ జేసి ♦ పడి మీఱంగా
బోరన మండలగతులన్, జేరి పరాక్రమము చూపఁ ♦ జెలఁగిరి కినుకన్. ౨౧

[1]క. వానరాకరి నొకరు చేగుచు, నేరీతినినైనఁ బంప ♦ నెంచుచుఁ గడు నా
హారమునకుఁ బొంచిన మార్జారంబులభంగి నొండొ ♦ సంతసపడుచున్. ౨౨

క. చలియింప కించుకంతయు, నిలువంబడి మండలాది ♦ నియతపథములన్
గలన మొనరింప సాగిరి, బలశాలుసు యుద్ధమార్గ♦పటుతరశక్తుల్. ౨౩౪ 1436

[2]సీసమాలిక:—

వనచరనాయక ♦ దనుజేంద్రు లొయ్యన సవ్యాపసవ్యాది ♦ సకలమార్గ
ములను, వ్యాఘ్రమృగేంద్ర♦ముఖావలి నిలుచంక్రమై శాఖ,సమపాద♦వైష్ణవమ్ము
లాలీఢ మల్లి ప్రత్యాలీఢమండలములనఁగఁ దగుస్థాన♦ములును మఱియు
గోమూత్రగతివంటి ♦ కుటిలమార్గంబుల నట్టులె యుపసర్ప♦ణాపసర్ప
ణములఁ, దివ్యగ్రమ♦నముల సవ్యాపసవ్యక్రమంబులఁ; జన్ను ♦ సరి చెలంగి
నొప్పింపఁ బూనఁ దా♦నును దానివ్యర్థంబుగను జేయు పరిమోక్ష♦మును, జెలంగి

1 మార్జారా ఇవ భక్షార్థే-అనియు. 2 వ్యాఖ్యానాభిప్రాయ మిందుఁ జేర్పంబడినది.

బదులు నొప్పించుచు ♦ వైరితాడనములఁ బరిహరించెడు నట్టి ♦ వర్జనమును
బగవాఁడు నిలుపంగఁ♦బడ వానిచుట్టునుదగఁ జరించెడు పరి♦ధావనమును
నెదిరించి శత్రువు♦ను దలపడు నభిద్రవణమును, దేహంబు ♦ వంచి యొక్క
యంగంబు నిక్కించి♦యడఁగి మండూకంబుభంగిఁ బైఁబోవు నా♦ప్లావమును, ద
గంగ ధైర్యంబున ♦ గాఢంబుగాఁ దాఁకి కేవలాసనమును ♦ జేవఁగొనుచు
నిర్భయంబుగ నందు ♦ నిల్చియుండుటయను నాస్థానమును, ముఖ ♦ మట్టిత్రిప్పి
వెనఁజను టను పరా♦వృత్తంబు, నిలుచున్నయట్లె వెన్కకుఁ బోవు♦నట్టిదగు న
పావృత్తమును, వైరిఁ♦బట్టుకొనంగోరి తనువెల్ల వంచి యా♦తనిపయికని
జవము మీఱెడునట్లు♦చనుట నాఁదగు నవద్రుతమును, దనదుశ♦త్రువునుగాలఁ
దన్న నాస్యమువంచి ♦ త్వర నెగురుట యనఁజను నవప్లుతమును ♦ శత్రుబంధ
నార్థమై తనకర ♦ మట్టె చాఁచుటయనునట్టి యుపన్యస్త ♦ మరియుఁ దనను
బట్ట యత్నింపంగఁ ♦ బట్టుతప్పించుకొనఁగఁ గేలు చిమ్ముట♦నంగఁ బరఁగు
నట్టి యపన్యస్త ♦ మాదియౌ పథముల మెలఁగుచుండిరి; పోరు ♦ సలుపుచుండ
దనుజనాథుఁడు సోలి ♦ వనచరేంద్రునకు మాయాబలంబునఁ దన♦యట్టివారు

ఆ. పెక్కుమంది తోఁచు♦విధమున మాయను, జూప మొదలుపెట్టె ♦ నాపగిదిని
దానెఱింగి జయము ♦ తగఁగాంచుశీలంబు, వెలయు భానుపుత్రుఁ♦డలయకవడి.

క. ఆకస్మికముగ నెగిరెను, నాకాశంబునకు దాన♦వాధీశుఁడు తా
నాకపి మరలన్ వచ్చుని, దే కరణిని ననుచు నచట♦నే నిలుచుండెన్. ౨౭

క. ఈరీతి వంచితుండై, యారావణుఁడుండ వాన♦రాధీశుఁడు తా
నే రావణుతో సంగర, మారీతి నొనర్చె ననెడు ♦ యశముం గనుచున్. ౨౮

చ. దనుజపతిన్ జయించి రణ♦ధర్మము తప్పక వానిఁ గష్టముల్
గన నొనరించి యున్నతము♦గాఁ దగు నభ్రపథంబు జొచ్చి రా
మునిఁ గని యంతఁ బార్శ్వమున ♦ మోదము భక్తియు మీఱుచుండ న
వ్వనచరమధ్యసంస్థుఁడయి ♦ భాసిలుచుండె జయోత్సవంబునన్. ౨౯ 1442

చ. తరణిసుతుండు వీరుఁడయి ♦ తత్కృతి నవ్విధిగా నొనర్చి హ
ర్ష రతిని గాంచి యారఘువ♦రప్రియనూత్నకి యుద్ధహర్షమున్
బరఁగ నొనర్చి వానరుల♦వారము తన్నును బూజసేయ నా
హరిగణమందుఁ జొచ్చెను మ♦హాబలవేగము మీఱఁ జక్కఁగన్. ౩౦ 1443

నలువదియవ సర్గము సంపూర్ణము.

---

౪౧ - వ సర్గము.

అంగద రాయబారము.

చ. వనచరనాథునం దవుడు ♦ భాస్కరవంశసుమాత్తికంబు చ
క్కనిరణచిహ్నజాలములఁ ♦ గాంచుచుఁ గౌఁగిటఁ జేర్చి ప్రీతిని

ట్లనియెను; నాదుసమ్మతిని ♦ సంధసేయుటగాని సాహసంబుచే
యను జనునే మహీశులిటు ♦ లద్భుతసాహసకృత్యముల్ తమం
తన యొనరింపఁ బూనగు ని♦తాంతము ధైర్యమునాని వేగమే. ౨ 1444

తే. సాహసప్రియుఁడవు నీవు ♦ శౌర్యఘనుఁడ
వందునని నవ్విభీషణు ♦ సఖులనవచ
రేంద్రబలమును సంశయ ♦ మిట్టులొంగఁ
జేసి యొగొప్ప తెగువను ♦ జేసితి విటు. ౩ 1445

*క. నీవిట్లు సాహసంబును, జేవం జేయంగఁ బూన ♦ క్షితి మాఱొంట్లే
జీవించుట దుర్లభమగు; నోవీరా! యింకనైన ♦ సుస్థితి నిమ్మా. ౪ 1446

తే. ముందువెన్కలు తలఁప కీ♦చందమునను
సాహసంపుఁబనుల్ సేయఁ ♦ జనదు సుమ్ము
బాహుబలమున దుర్భర♦వైరిగణము
నడఁచు నీకును నేదైన ♦ హాని గలుగ. ౫ 1447

క. జనకజతో భరతునితోఁ, బినతమ్ములతోడఁ దుడకు ♦ విమానంబగు నీ
తనువర్యముతో నాకే,పనియుండును? జక్కఁ జెపుమ ♦ భాస్కరతనయా!. ౬

క. సురపతివరుణసమానుఁడ, పురుబాహుబలంబు విట్టు ♦ యుగ్రరణముచే
యురతిని జని రాకుండెదు, తరుణంబున నీదుశౌర్య♦ధర్మ మెఱిఁగియున్. ౭

సీ. ఏదేని నీకప♦కృతియె గల్గునో యని సందియమంది నా♦శపథ మట్టు
లైనఁ దీర్పకయుంచ ♦ నౌని యందున నేనునాత్మజబంధువా♦హనయుతముగ
రావణు ననిఁ జంపి ♦ రాజ్యంబునకు విభీషణుని బట్టముగట్టి ♦ సత్వరముగ
నాయయోధ్యకుఁ బోయి♦యఖిలరాజ్యమ్మును భరతునకొసంగి సం♦ర్వాతిఁ జక్క

తే. దనువు వదలంగ నిశ్చయ♦మును నొనర్చు
కొంటినని పల్కి; శ్రీరఘు♦కుంజరుఁ డిటు
పలుక సుగ్రీవుఁ డతనితోఁ ♦ బలికె నిట్లు
రఘుకులాభరణంబ శ్రీ♦రామ నేను. ౮ 1450

క. నీపౌరుషముల నెఱిఁగియు, నీపత్ని హరించినట్టి ♦ నీచదురాత్మున్
బాపిని గని యెటుసైతును, భూపవరేణ్య! యటంచుఁ♦బొంగుచుఁ బలుకన్.

క. వీరుండగు సుగ్రీవుని, చారుతరోక్తులను విని యొ♦సంగెడు కాంతి
స్ఫారుని లక్ష్మణుఁగని యా,శ్రీరాముం డిట్లు పలికెఁ ♦ జిత్తమలరఁగన్. ౧౦

క. మన మీసేనల శిశల,వనముల ఫలరాజిఁ గోసిన ♦ వనములకుం గై
కొనిచని యూథపులకు నొ,య్యన వేఁడుగఁ బంచియిచ్చి♦యరిభయదముగన్.

---

* త్వత్సాహసేఽస్మదాదీనాం జీవనం దుర్లభమితి - అనువ్యాఖ్యాభిప్రాయ మిటఁ జేర్పఁబడినదని తెలియందగు.

క. గరుడాదిరూపములుగాఁ, బరఁగంగాఁ జేసి సిద్ధపడియుండము భీ
కరమై లోకక్షయకర, మురుతరమును నౌ భయంబు నూహింపంగన్. ౧౧౪

క. కలుగం గలదని తోఁచెడుఁ, దలఁపఁగ నది భల్లుక,హరిదానవవీరా
వళికి వినాశనమును ని,మ్ములఁ దెలిపెడు వీచెఁ బరుషముగఁ బవనుండున్. ౧౨

చ. ధరణి వడంకుచున్నయది ధాత్రిధరాగ్రము లల్లలాడెడున్
దరువులు భూమిపైఁ బడెడుఁ దద్దయు భీకరనాద మొప్పఁగాఁ
బరుషతరాకృతుల్ గలిగి వారిధరంబులు శ్యేనముఖ్యభీ
కరతనువుల్ ధరించుచు జగత్ప్రళయంబును దెల్పఁజాలి నె
త్తురుచినుకుల్ గలట్టి. గురుతోయములన్ గురియున్ నితాంతమున్. ౧౪

ఆ. సంధ్య యద్దె రక్తచందన మట్లుగాఁ
గాన నగుచు భీతికరముగాఁగఁ
జూడఁబడెడు నదిగో సూర్యమండలినుండి
పడెడు మండుశుచికబలము లట్టి. ౧౫ 1457

క. హీనములగు మృగపక్షులు, దీనాకృతు లొప్ప మిగుల దీనరవములన్
వీనుల కతిభయదమ్ములు, గా నొనరుచుచున్ సరోజకాంతుని కెదురై. ౧౬

తే. అఱచుచున్నవి; లయకాల మందువలెనె
చంద్రుఁడు నిశను దనప్రకాశంబు మాని
*నడుమ నలుపును రక్తవర్ణంబు చివర
లందుఁ దగఁ గల్గఁ జేయుఁ దాపాతిశయము. ౧౭ 1459

క. పరివేషము హ్రస్వంబై, పరుషం బశుభప్రదంబు పరికింపంగా
నరుణతరాంతరమునునై, కరముం జూపట్టుఁ బ్రళయకాలవిధమునన్. ౧౮౫

క. కను మర్కమండలంబున, ననుజా! నీలాంక మొక్కఁ దగపడియెడుఁ జ
క్కనితారలు మలినములై, మునుపటివలెఁ గాక నూత్నముగఁ గనఁబడెడున్.

క. ఈదుర్నిమిత్తములు గన, నేదో ప్రళయంబు జగతి కేతెంచెడు నాఁ
గాఁ దగియున్నవి చూడుము;, వేదికలను శ్యేనకాకవితతులు గ్రద్దల్. ౧౯౫

తే. క్రిందుగాఁ జేరుచున్న వీరీతి నక్క
లశుభనాదంబులను సాధ్వసావహంబు
లైన యెలుఁగులఁ జేసెడు ననుజ! యింక
వనచరుల్ పరివేష్టించి వచ్చుచుండ. ౨౦ 1463

చ. మన మిడె రావణుండును నమానుషశక్తిని నేలుటన్ జగం
బున నెదిరింపరాకయె యపూర్వమునై తనరారు లంకకుం

---

* కృష్ణరక్తాంశుపర్యంతో యథాలోకస్య సంక్షయే-అనియూ.

జనుదము వేగ; యంచు గురు♦సత్త్వుఁడు వీరుఁడునై నరాముఁ డా
యనుజునితోడఁ బల్కుచు మ♦హాచలశృంగమునుండి యుప్పుడే. ౨౧ 1464

క. ధరణికి దిగి ధర్మాత్ముఁడు, ధరణీశలలాముఁ డంతఁ ♦ దనసేనను నె
వ్వరికి నెదిరింపరాకయె, యరుదుగఁ దగుదానిఁ జూచె ♦ నాగిరిక్రిందన్. ౨౨

క. కాలోచితకృత్యంబులఁ, జాల నెఱింగిన ఘనుండు ♦ క్ష్మాపతి తానున్
బోలఁగ సుగ్రీవుండును, నోలి మహాప్లవగసేన ♦ నుత్సాహమునన్. ౨౩ 1466

క. తనరారఁ జేసి యుద్ధం,బునకున్ సమయంబువచ్చె ♦ భూరిబలమునన్
జనవలయునంచుఁ దానా,జ్ఞను జేసెను; దెల్లవాఱు♦జాము చనంగన్. ౨౪

క. ఘనబాహుండగు రాముఁడు, ధనువును ధరియించి ప్లవగ♦తల్లజు లెల్లం
దనచుట్టు బలసిరాఁగాఁ, జనె లంకాపురముఁ గూర్చి ♦ సరభసగతితోన్. ౨౫

క. దనుజేంద్రుఁడు సుగ్రీవుఁడు, హనుమంతుఁడు జాంబవంతుఁ ♦ డానీలుఁడు రా
ముని వెంబడించి పోయిరి, వనచరవీరుండు నలుఁడు ♦ భల్లుకవిభుఁడున్. ౨౬

తే. లక్ష్మణుండును బ్లవగబ♦లంబుతోడ
నరుగుదేరంగఁ జనియె; నా♦తఱుణమందు
భల్లుకప్లవగంబుల ♦ బలము మిగుల
గొప్పదిగ మీఱి పెద్దదా ♦ క్షోణి నెల్ల. ౨౭ 1470

తే. ఆవరించియె రాముని ♦ ననుసరించి
చనియెఁ; గుంజరదేహులై ♦ శత్రువార
ణమున నేర్పఱులైన వా♦నరవరు లొగి
శైలశృంగంబులను దరు♦జాలములను. ౨౮ 1471

చ. కరములఁ దాల్చి రామనృప♦కాంతుని వెంబడిపోయి; రక్షసో
దరులగు రామలక్ష్మణులు ♦ తచ్చలముంగొని చాలసేపు త
ద్ధరమును డిగ్గి పోవుచును ♦ దానవనాథుపురంబుఁ జేరి రా
యరిబలసూదనుల్; నగర ♦ మయ్యది యున్ ధ్వజపంక్తి గ్రాలఁగాన్. ౨౯

*క. కరము మనోహరమై నుం,వరముగఁ గనుపట్టు నుపవ♦నంబులతోడన్
బరఁగుచు నద్భుతతరమగు, వరణము ప్రాకారవరము ♦ ఘనురరీతిన్. ౩౦

సీ. పరఁగుచుండఁగ బహి♦ర్ద్వారంబు లొప్పంగ నర్యశేద్యంబయి ♦ యమరులకును
దుర్ధర్షమై యుండెఁ ♦ దొలఁగక వానరుల్ రామునాజ్ఞనుబూని ♦ భీమరూపు
లయి తమచోటుల ♦ నరయుచు ముట్టడి సల్పిరి; గురుతర♦శైలకూట
మట్టు లున్నతమగు ♦ నాయుత్తరద్వారమును రాఘవుఁడు సో♦దరునిగూడి

తే. ధనువుఁ దాలిచి సైన్యంబు♦లను దగంగఁ
గాచుచున్ ముట్టడించె; ని♦ష్కారణి వీరుఁ

---

* చిత్రవప్రాం మదుప్వాపా ముచ్చైః ప్రాకారతోరణామ్-అనియూ.

డైన రాముఁడు లక్ష్మణుఁ ♦ డనుచరుఁడయి
యుండ రావణుఁడున్నట్టి♦యుత్తరదిశ. ౩౩ 1474

క. కనుఁగొని లంకాపురమహి,మను జూచుచు ముట్టడించె; ♦ మఱి యాసురవీ
రుని కాపురపలను మించిన, ఘనమగునాద్వారమచటఁ ♦ గడుభయదంబై.

క. వరుణాధిష్ఠితమగు సా,గరమునవలెన్ వెలసి శస్త్ర♦కలితులును భయం
కరసాహసులునగు రాక్షస, వరులెల్లం జుట్టుముట్టి ♦ పరిరక్షింపన్. ౩౪ 1476

క. ఘనమై యుండుట నితరుల,కు నెవ్వరికి ముట్టడింపఁ ♦ గూడక భీతిం
గనఁజేయు చల్పబలులకు, దనుజాన్వితభుజగలోక♦తల్లజము వలెన్. ౩౫

క. కనవయ్యె రాఘవున కా,క్కనికిం దక్కంగ ధరణిఁ ♦ గన నితరులకున్
దనుజేంద్రపురిని దోర్బల, మున నిల్వఁ దరంబుగాదు ♦ ముందు నిలువఁగన్.

తే. రాముఁ డాద్వారసీమల ♦ రాక్షసభటు
లునిచి యున్నట్టి బహువిధా♦యుధసమూహ
ములను బహువిధకవచావ♦ళులను గాంచె;
నంత వీరుఁడు నీలుఁడు ♦ హరివిభుండు. ౩౭ 1479

క. తూరుపుద్వారంబునఁ దా, శ్రీరాముని నాజ్ఞను నిలి♦చియె యుండెను దు
ర్వారులు మైందద్వివిదులు, చేరి తనుం గొల్వఁ బ్లవగ♦సేనలతోడన్. ౩౮

క. ఘనబలుఁ డంగదుఁ డంతట, వనచరవీరులగు గజగ♦వయులు గవాక్షుం
డును ఋషభుఁడు తనుఁ జేరం, గను యామ్యద్వారమందుఁ♦గావలియుండెన్.

క. బలవంతుఁడైన హనుమయు, నలఘుండు ప్రమాథి,ప్రఘసుఁ; డట్టిమహావీ
రులు పెక్కుమందిప్లవగే,శులు తనుఁ గొల్వంగ నింటఁ ♦ జూపరు లలరన్. ౩౯

తే. *పశ్చిమద్వారసీమను ♦ బలసియుండె;
నంతసుగ్రీవుఁ డాగరు♦డానిలసము
లైనహరివీరులం గూడి ♦ యతులరీతి
నడిమిగుల్మంబునం దుండెఁ ♦ గడఁగి యంత. ౪౦ 1483

క. హరియూథపతులవశమున, గురుబలులగు ముప్పదారు♦కోట్ల వనచరుల్
పురి ముట్టడించి వనచర, వరుఁ డున్నయెడన్ వసించి ♦ వఱలిరి పూన్కిన్.

క. రాముని యానతిఁ గైకొని, సౌమిత్రివిభీషణులు వె♦సన్ ద్వారములన్
దా మునిచిరి కోటినిగా, భీమకపీంద్రులను వేఱు♦వేఱుగఁ గడిమిన్. ౪౨

క. ఉనిచిరి ముట్టడికై; రా,మునకుం బడమట సమీప♦మున సుగ్రీవుం
డును జాంబవంతుఁ జెక్కుర, వనచరసైనికులఁ గూడి ♦ బల మలరారన్.

తే. నడిమి గుల్మమునందుండెఁ; ♦ గడుబలాఢ్యు
లైన యవ్వానరోత్తము ♦ లపుడు దంష్ట్రి

* పశ్చిమేచ ద్వారంగుల్మే సుగ్రీవ స్సమతిష్ఠత-అనియూ.

క. సురలకు నసురులకైన న,దిరింపఁగా రాకయుండె; ♦ ధీమంతుండా
ధరణీశ్వరుండు శ్రీరఘు,వరుఁ డిటు విడియించి ప్లవగ♦బలముల నెల్లన్. ౫౮

చ. దనుజులఁ జంపఁ బూని యిఁకఁ♦దా నొనరింపఁగ నర్హమైన య
ప్పని విషయంబు చక్కఁగను ♦ బండితమంత్రులతోడ దూతనుం
బనుపఁగ నర్హమం చరసి ♦ వాలికుమారుని దూతగాఁగఁ బం
పను వగ నిశ్చయించి బహు♦వారము లాత్మఁ దలంచి యంతటన్. ౫౯

క. జనకసుతాపతి సామా,దినిఖిలతత్త్వజ్ఞుఁ డౌట ♦ దివ్యనృపతిధ
ర్మనిచయమును స్మరియించుచుఁ,దనమదిఁగృపపొడమ వాలి♦తనయునిఁబంపన్.

క. తనయట్టు లవ్విభీషణుఁ, డనుమోదము నొందఁ బిలిచి ♦ యంగదుతో ని
ట్లనియెన్; సౌమ్యా! యంగద!, వనచరుఁడవుగాన నగర♦వరమున్ దీనిన్.

తే. శ్రమము లేకయె లంఘించి ♦ చనఁగఁగలవు
గాన భయ మించుకంత లే♦క దశవదను
పాలికిం బోయి నేను చె♦ప్పంగఁ బూను
నట్లు నానల్కులుగఁ బల్కు ♦ మతనితోడ. ౬౦ 1501

[1]శా. ఓరీ! రాక్షస! నీదుసంపదయు నీ♦యుర్వీశభావంబు నీ
ధీరత్వంబును నంతమొందె నిపు డే♦తెంచెన్ వినాశంబు నీ
భూరిస్వాంతబలంబు గూడఁ జెడియెన్ ♦ బో నీవు గర్వించి దై
త్యారిత్వాసురమానిసర్యులను య♦క్షాహీంద్రసంఘంబులన్. ౬౧ 1502

తే. అచ్చరల భూమిపతుల నె♦య్యెవిధముల
బాధలం బొందఁ జేసితో ♦ వాని కంత
కును ఫలంబుగ బ్రహ్మయి♦చ్చిన వరంబు
వలనఁ గల్గిన దర్పంబు ♦ విలయ మొందె. ౬౨ 1503

క. బుత మిది విను మిఁక భార్యా,హృతికై నేఁ గోపమొంది ♦ యిప్పుడు నిన్నున్
జతనంబున దండింపన్, మతినియతిం బూని శౌర్య♦మహిమం బలరన్. ౬౩

తే. ఈపురద్వారమున నిల్చి ♦ యిట్టులున్న
వాఁడనే; [2]నన్ను దండింప ♦ వచ్చుఫలము
నీకు నేమని యన్నచో ♦ నిన్ను నేనుఁ
జంపఁగా దాన నీపాప♦నమితి యడఁగు. ౬౪ 1505

క. సురమానివర్యధరణీ,శ్వరమును లేవదముఁ బొందఁ ♦ జాలుదు రీ వా
వరపదము నొందఁ గల విఁకఁ, ద్వరితంబుగ రమ్ము పాప♦తతిఁ దొలఁగింతున్.

క. దనుజాధమ! యామారీ,చుని మాయను నన్ను నుఱుక ♦ చోటికిఁ దొలఁగం
గను జేసియే మహాబల,మును నమ్మి మహీతనూజ♦మును దొంగిలితో. ౬౫

---

1 ప్రాప్తః కిళ కగత్తైశ్వర్యమమూర్ష్ణోనష్టచేతవ-అనియూ. 2 ఏవంవిధస్య మమ నియమనేన తవ కిం భవిష్యతి తస్త్రాహ-అనివాహ్యళ్య.

క. కనఁబఱిపుము మాయాబలమును దానిఁ నేఁడు నాదు♦ముందఱ; నీవా
జనకజ నర్పించి నను౦, గని శరణముఁ జొరవయేని ♦ ఘనవిశిఖములన్. ౯౬

క. దనుజుం డీలోకంబునఁ, గన నొక్కఁడు లేఁడయుండెఁ♦గాఁ గావింతున్
విను ధర్మబుద్ధి నాతఁడు, దనుజేశవిభీషణుండు ♦ తగు న్యాయమునన్. ౯౭

చ. శరణముఁ జొచ్చినాఁడు గద ♦ శాశ్వతమౌచు నకంటకంబునై
పరఁగు సురారిరాజ్యమును ♦ భాస్వదనూనమనీషసంగతిన్
త్వరితముగాను పొందు నిది ♦ తథ్యము మూర్ఖుఁడవైన దురాత్ములౌ
సురరిపులే సహాయులయి ♦ సూరత నిన్గొలువంగఁ బాసినన్. ౯౮ 1510

చ. మనము వశంబుగాక యను♦మానసమున్విశసమ్మై తగంగ నొ
ప్పిన దనుజుండ వీ వికను ♦ ప్రీతిని నొక్కముహూర్తమైన నీ
ఘనతర రాజ్యసంపదలఁ ♦ గాదు దురాత్మక! పొందఁ శక్యమౌ
దనుజ! మదీయవాక్యమును ♦ దప్పక చేసిన నిన్నుఁ గాచెదన్. ౯౯ 1511

క. హిత మిద్ది కానయున్నన్, ధృతిమీఱఁగ శౌర్యమూని ♦ తెగి సంగరము
న్నతిఁ జేయుము నాశరములమృతిఁ గని పరిశుద్ధమతివి♦యై మనుదుఁసుమీ. ౧౦౦

క. దురితంబు లెల్లఁ దొలఁగును; దురాత్మకా! యట్లుగాక ♦ చేఁచినకీర్తిన్
జరియింపఁ బత్నివై నీ, వరయ మనోవేగ మూని ♦ యఖిలజగములన్. ౧౦౧

తే. సంచరించిన నాదువీ♦క్షణపథమునఁ
బడి యనంతర మనువుల ♦ వదలకుండ
నుండఁ జాలవు; హితమగు ♦ నొక్కమాట
నీకుఁ జెప్పెద విను రజ♦నీచర! యిఁక. ౧౦౨ 1514

చ. ధరణిని నొక్కరాక్షసుఁడు ♦ దక్కఁడు గావున నీకు నీవె యి
త్తరుణమునందె చేయఁదగు ♦ ధర్మములట్ల పరత్రికృత్యావళుల్
జరపుకొనందగున్ మఱియు ♦ త్వాన్థలిఁ జూడఁగఁ బోవుసద్ది యౌ
క్కరణిని లేదుగాన నరి♦గాఁ బురమంతయుఁ జూచుకొమ్మికన్. ౧౦౩ 1515

తే. నాకరంబున నున్నవి ♦ నీకుఁ బ్రియము
లైన ప్రాణము లిఁకనంచు ♦ నాదుమచట
ననుచు నక్లిష్టకర్ముఁ డ♦య్యవనినాథుఁ
డనినఁ దారాతనూభవుఁ ♦ డంగదుండు. ౧౦౪ 1516

క. తనువు ధరించిన పాలితపవాలుఁ, డన నాకాశమున నెగసె ♦ నాక్రిమంతుం,
డనఘుఁడు తేజం బలరఁగఁ, జని క్షణమున దనుజనాథు♦సద్మము నొందెన్.

చ. దనుజవరేణ్యు మంత్రియుతుఁ ♦ దక్షభవనంబునఁ గాంచె నంతఁ జ
క్కనిగతిఁ; గాంచనాంగదుఁడు ♦ కర్బురనాయకుముందు ప్రాలి రౌ
య్యన జ్వలితాగ్నిరీతిఁ గన ♦ నై నిలుచుండెను నీవయనాము మూ
తని కెఱిఁగించి తాన యల♦దైత్యకులేశుఁడు వానిమంత్రులున్. ౧౦౬ 1518

క. వినుచుండఁగ శ్రీరాముని, యనువాదము నెల్లఁ జెప్పి♦నట్టులె వినిపిం
పను బూని యిట్టులనియెన్;, దనుజేంద్రా! కోసలేశ♦తల్లజుఁ డగుచున్. ౭౫

సీ. అక్లిష్టకర్ముఁడై ♦ యలరు రామునిదూత నావాలిపుత్త్రుండ ♦ నంగదాఖ్యుఁ
డను నన్ను వినితివా; ♦ ఘనరఘుకులభూషణమ్ము కౌసల్యయా♦నందవర్ధ
నుఁడు నగు శ్రీరాఘ♦వుఁడు నీకుఁ జెప్పంగ దగువల్కులం జెప్పఁ♦దలఁచె వాని
వినవయ్య! క్రూర! ప♦త్తనమును వెడలి నాయెదుటికి వచ్చి నీ♦వింక నని

తే. జేయుమీ? శూరుఁడవు కమ్ము ♦ న్యాయరీతి
నిన్నుఁ గొడుకుల జ్ఞాతుల ♦ నీదుబంధు
వులను మంత్రుల నేఁ జంపఁ ♦ దలఁచినాఁడ
మీకు నేనంతకుండఁ జు♦మ్మీ! దురాత్మ!. ౭౮ 1520

క. అనిమొన నీ విలఁ బడఁగా, విను ముల్లోకములు ప్రీతి ♦ వెలయు సుఖం బుం
డును; యక్షులు గంధర్వులు, దనుజులు త్రిదశులును మాని♦తల్లజు లెపుడున్.

క. ఉరగులు సుఖముండుదు రె, త్తరుణంబుననైన వారి♦దారుణరీతిం
బరికించి యేఁచు నిను ని, త్తరుణంబునఁ జంపువాఁడఁ ♦ దథ్యము సుమ్మీ!.

క. నను సత్కరించి నాభా,ర్యను సీతను నప్పగించి ♦ యడుగులఁ బడవే
ని నిన్నున్ జంపి విభీషణు, దనుజమహారాజ్యవిభవ♦ధాము నొనరుతున్.

చ. అని వచియింపుమా! యనుచు ♦ నారఘురాముఁడు నన్నుఁ బంచె నం
చని యలయంగదుండు ప్లవ♦గాధిపుఁ డాడిన రాక్షసేశుఁ డొ
య్యన ఘనకోప మందె నసు♦రాధిపుఁ డుగ్రరుడావిలాక్షుఁడై
దనుజుల మంత్రివర్యులను ♦ దాఁ గని వీని దురాత్ము దూతనున్. ౮౧ 1524

ఆ. పట్టుకొనుఁడు వీనిఁ ♦ గొట్టుఁడు చంపుఁడు, విడువ వల దటంచు ♦ విపులకోప
మడరఁ బెక్కుసారు ♦ లానతియిచ్చెను;, దాని నాలకించి ♦ తడయ కపుడు.

క. జ్వలితాగ్నితేజసులు దైత్యులు భీకరతనులు నలువ్వ ♦ రొక్కట నాకోఁ
తులరాయనితనయుని ని, మ్ములఁ బట్టుకొనంగఁ; గూట♦మున నచ్చోటన్.

క. *వీరుండగు నంగదుఁ డతి, ధీరుఁడు గావునన యరిత♦తికిఁ దనబలమున్
నేరుపును జూపుటకుఁ దా, వారలు తనుఁ బట్టుకొనెడు ♦ భంగి నొనరిచెన్.

చ. దనుజుల హాస్తయుగ్మమునఁ ♦ దాఁ బతగంబులరీతి నుంచుకొం
చు నపుడు పర్వతాకృతిని ♦ శోభిలు తద్భవనంబుమీఁదికిన్
దనవడి గ్రాలఁగా నెగసె; ♦ దానవవీరులు వారు తజ్జవం
బున విదళింపఁగాఁ బడుచు ♦ బోరన నభ్రమునుండి యూర్చుచున్. ౮౬

తే. [1]రావణుఁడు చూచుచుండఁగ♦నే వడిఁబడి;
రంత విక్రమశాలి యా♦యంగదుండు

---

* గ్రాహయామాస తారేయ స్వయమాత్మాన మాత్మవాన్-అనిమూ. 1 తతః ప్రాసాదశిఖరం శైలశృంగ మివోన్నతమ్-అనిమూ.

గిరిశిఖరమున వెలసి మిక్కిలిపొడవుగఁ
గ్రాలు ప్రాసాదశిఖరంబుఁ గాంచె మించి. ౮౭౪ 1529

చ. వనచరుపాదఘాతమున వారక రావణుఁ డెట్టె నూగఁగా
నని మును వజ్రిభేదితమహాతుహినాచలశృంగమట్లు లో
య్యన నది బ్రద్దలయ్యె నిటు లాతఁడు దానిఁ బగుల్చి చక్కఁగాఁ
దనదగునామ మెల్లరకుఁ దా వినిపించి ధ్వనుల్ చెలంగఁగాఁ. ౮౭౫ 1530

క. ఉరవడి నింగికి నెగసెన్; సురవైరుల కార్తిఁ బ్లవగకోటులకు ముదం
బు రహిం గూర్చుచు శ్రీరఘు, వరపార్శ్వమునందు గ్రాలెఁ బ్లవగులనడుమన్.

క. దనుజేంద్రుఁడు ప్రాసాదం,బును భగ్నంబగుటఁ గాంచి భూరిక్రోధం
బును బొంది వీఁడొకం డ,య్యును నాబలమెల్ల శక్తి నోడించి వడిన్. ౮౮౧

చ. అరుగుచునున్నవాఁడు గదె! యారయ నిట్టి బలాధికుల్ హరీ
శ్వరు లొకకొంద ఱట్లు తమశౌర్యముఁ జూపఁగఁ బ్రాణయుక్తిఁ నేఁ
బరఁగుట యెట్లొ యంచుఁ దనభావిఫలంబును గూర్చి యూగుఫల్
వరుసగఁ బుచ్చె, నంత నిట వాలిజనూజుఁడు రాఁగ రాముఁడున్. ౮౮౪

ఆ. మోద మొంది సింహనాదముల్ చేయువా
నరులు పెక్కుమంది వరుసఁ గొలువ
నరులఁ జంపఁ గోరి యనిఁ జేయఁగా నుండె
నచట నానుషేణుఁ డధికబలుఁడు. ౮౯౪ 1534

క. గిరిశిఖరాకారుండై, హరివీరులు కామరూపు లాదృతిఁ గ్న్యం
బరివేష్టింపఁగ నుండెను;, బరజనదుర్ధర్షుఁ డతఁడు పశ్చిమానతిచేన్. ౮౯౩

తే. తారకారాజిలో శశిధరుఁడు తిరుగు
చుండునట్లుగఁ దిరుగుచు నుండె నాల్గు
ద్వారములఁ గాచుచున్; సముద్రంబు చెంతఁ
బురమునుం జుట్టుకొని కపివరులు పూన్కి. ౮౯౬ 1536

క. సరిగా నక్షౌహిణిశత, మరయఁగ నంతంగఁ జూచి యతిశయబలులై
పరఁగెడు దనుజేశ్వరు ల,చ్చెరువును గొంచును భయంబుఁ జెందిరధికుల్.

క. శూరులు కొందఱు సమరం, బేరీతిని నైనఁ జూత మేమని యంచున్
భూరిముద మంది రటఁ బ్రాకారమునకుఁ బరిఖకుఁ గల త్వరితంబెల్లన్.

తే. వనచరావృత మై యుండ వానరమయ
మైన మతియొకసాలమ ట్లసురులకును
గానఁబడె; దీనులై యుంటఁ గర్బురు లపు
డతిభయంబున విస్మృతు లై తపఁబడి ౮౯౮ 1539

క. పెలుచన హాహాకారం,బులు గావింపంగ భయముఁ ♦ బుట్టించురవం
బులు చెలఁగుచుండ లంకన్, గల శూరవరేణ్యులైన ♦ కర్బురు లంతన్. ౯౮

క. అనిసేయఁగఁ దగు వెనుసా,ధనముల ధరియించి ప్రళయ ♦ తరుణంబున నా
యనిలువిధంబునఁ దిరిగిరి; వనచరులకు భీతినొంది ♦ పౌరుష మలరన్. ౯౯

నలువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

### యుద్ధారంభము.

చ. దనుజులు రావణాసురుని ♦ ధామము చేరఁగఁ బోయి; రంత నా
వనచరయుక్తుఁ డౌచు రఘు ♦ వర్యుఁడు లంకను ముట్టడించె నం
చును దెలుపంగ; నాదితిజ ♦ శూరుఁడు లంకను ముట్టడించినా
రన విని క్రుద్ధుఁడై పురము ♦ నారయుకృత్యము లెల్ల నూటిగన్. ౧ 1542

తే. ద్విగుణముగఁ జేయఁగాఁ బంచి ♦ విమతబలము
నరయఁ బ్రాసాద మెక్కి; యు ♦ ద్ధాభిలాషు
లగుచు లెక్కింప రాక యా ♦ హరివరు లొగిఁ
బురము నెల్లను గానన ♦ గిరివనముల. ౨ 1543

చ. అరుదుగ నిండియుంట నతఁ ♦ డంతటఁ గాంచె; మహీతలంబు నా
హరివరు లెల్ల మ్రింగునటు ♦ లత్తరుణంబున నుంటఁ గాంచి యె
క్కరణిని వీరిమృత్యువును ♦ గాంచఁగఁ జేయఁగ నౌనటంచు నా
తురుఁ డయి యెంచె; నిక్కరణి ♦ ధూర్తనిశాచరుఁ డాత్మలోపలన్. ౪ 1544

[1]క. చిరకాలము చింతించుచుఁ, బరుమత్వం బూని బుద్ధి ♦ పాటవమునఁ దా
నరుదుగ నశ్రుల విప్పుచు, హరియూధములన్నరేంద్రు ♦ నచ్చటఁ గనియెన్.

చ. వనచరసేనలన్ గొనుచుఁ ♦ బార్థివవర్యుఁడు తాను బూర్వము
న్న నెలవువీడి యాదితిజ ♦ నాయకుపత్తనసాలసన్నిధిం
గనఁ జని సాధుగుప్తమయి ♦ కర్బురసంవృతమై చెలంగు లం
కను గొనియెన్; విచిత్రతర ♦ కమ్రపతాకమహాధ్వజాళిచే
తను సమలంకృతంబయిన ♦ తత్పురముం గని [2]యార్తచిత్తుఁడై. ౬ 1546

చ. జనకజ నాత్మలోఁ దలఁచి ♦ సత్వరమే యిటులెంచె నక్కటా
జనకతనూజ యాహరిణ ♦ శాబవిలోచన నానిమిత్తమై
దనుజులు తన్నునొంపఁగ వె ♦ తం గడుఁగుందుచుఁ బస్తులుండి చి
క్కి నిరతమున్ బరుండి ధరఁ ♦ గేవల మార్తిని బొందు చున్నదే. ౭ 1547

---

1 స చింతయిత్వా సుచిరం-అనిమూ. 2 దూయమానేన చేతసా - అనిమూ.

చ. అని యిటు ధర్మచిత్తుఁడగు ♦ నారఘురాముఁడు వీక్ష్యమాణయౌ
జనకజ నాత్మలోఁ దలఁచి ♦ చయ్యనఁ గ్రోధమహాగ్నినుండ నా
వనచరులన్ గనుంగొని జ♦వంబున శత్రువులన్ వధింపుఁడీ
యని యపు డాజ్ఞసేసె; నిటు ♦ లారఘురాముఁడు భీకరాత్ముఁడై. ౯ 1548

తే. అక్రమంబున సేవని ♦ నైనఁ జేయఁ
జాలువాఁడౌటఁ దమకు నా♦జ్ఞనిడ వార
లొక్కరొక్కరి మీఱుచు ♦ నుగ్రరవము
లడర ననిసేయఁ బూని ర♦త్యంతనియతి. ౧౦ 1549

సీ. హరియూథపతులు శై♦లాగ్రంబులను వైచి కాని ముష్టుల గ్రుద్ది ♦ కాని రావ
ణాసురుఁ డేలు నీ♦భాసురపురమును బాడుసేయుదమని ♦ నాన్తములను
దలపోసి రంత; వా♦రలు గొప్పశైలాగ్రముల శిఖరంబులఁ ♦ బెలుచ నెత్తి
కొనుచును బహుతరు♦కూటముల్ పెకలించిధరియించియును బ్రవి♦దారణంబు

తే. నొనరుపన్ సిద్ధపడి; రంత ♦ దనుజనాథుఁ
డట్టె చూచుచునుండ నా♦హరిబలములు
భాగములు పెక్కుగాఁ జీలి ♦ పార్థివునకుఁ
బ్రియముఁ గూర్ప సాలంబును ♦ వేగ యెక్కి. ౧౩ 1550

క. కనకచ్ఛాయల వక్త్రము, లనూనచిత్రంబుఁ గూర్ప ♦ నరుణచ్ఛాయల్
గనఁబడ వారలు శ్రీరాముని కై ప్రాణముల వీడఁ ♦ బూని కరములన్. ౧౩॥

క. శిలలను సాలమహీజం, బులఁ దాళంబులను శస్త్ర♦ములుగాఁ గొని యు
జ్జ్వలశక్తి లంకపయికిం, బెలుచన చని, రాప్లవంగ ♦ వీరులు పూన్కిన్. ౧౪॥

చ. తరువులఁ బర్వతాగ్రముల ♦ దారుణముష్టుల నొంచుచున్ గడున్
బురవరసాలకూటముల ♦ భూరివనంబులఁ దోరణంబులన్
బరిపరి నుగ్గుచేసి; రల ♦ భల్లుకవానరు లంత నృత్తుచేఁ
బరిఖల నట్టె రమ్యతర♦వారిమయంబులఁ బూన్పఁ బూనుచున్. ౧౫॥ 1553

తే. దారుతృణములనున్ వైచి ♦ దారుణగతు
లొప్పఁగా వానిఁ బూడ్చి; ర♦త్యుగ్రశౌర్యు
లైన కొందఱు వానరుల్ ♦ పూని వేయి
మందితోఁ గోటితోఁ గొంత♦మంది కపులు. ౧౬॥ 1554

క. హరు లొకకొందఱు గడుభీ,కరశతకోటిప్లవంగ♦కాంతులతో నా
వరణము నారోహించిరి, కరివరసమకాయులైన ♦ కపివరు లవలన్. ౧౭ 1555

క. కనకమయతోరణంబుల, ఘనతరకైలాసశిఖర♦కల్పములయి చె
న్నునఁ దగుగోపురముల నొ,య్యనఁ జెందుచు సంతసమున♦నాడుచుమిగులన్.

తే. ఎగిరి గంతులు వైచుచు ♦ నిటునటు చరి
యించుచున్ బొబ్బలిడుచు నొ♦క్కించుకైన

భయములేకయె యాలంక ♦ పైకిఁ బోయి
రాకపులు కామరూపంబు ♦ లలరుచుండ. ౧౯ 1557

*క. వినుఁడీ సర్వోత్కృష్టులు, గను రాఘవులున్నవారు ♦ కపినాథుఁడు రా
మునికడ నుత్కృష్టుండై, తనరుచునున్నాఁడు భూమి♦ధవపాలితుఁడై. ౨౦

క. అని యిట్లు రవము లొప్పం, గను లంకావరణమునకుఁ ♦ గడువడిఁ జని; రం
దును వీరబాహునలులను, వనచరయూథాధిపులు సు♦బాహువు కడఁకన్.

క. లంకాప్రాకారంబును, బింకం బలరంగఁ గూల్చి ♦ వెడలి సురారుల్
సంకటపడఁగా నిల్చిరి, యంకుశముగ రావణాహ్వ♦యద్వీపమునకున్. ౨౨

తే. అంతియే గాక సేనల ♦ కర్హములగు
వసతు లేర్పాటు గావించి ♦ వారి వ్యూహ
ములుగ నిల్పిరి; కుముదుఁడు ♦ బలముపొంగ
విజయశీలురుగాఁ దగు ♦ వీరకపులు. ౨౪ 1561

సీ. పదికోట్లు గొలువంగ ♦ భవుదిక్కునుండి ప్రాగ్ద్వారంబు గాపాడు♦తలఁపుఁబూని
నిలిచెను; బ్రఘసుండు ♦ నిర్భరశౌర్యుఁ డాపనసుండు వానర♦బలముతోడ
నాకుముదునకు స♦హాయంబు చేయంగ నందె యుండిరి; వీరుఁ ♦ డతిబలుండు
నగు శతవలి యప్పు ♦ డాగ్నేయముననుండి దక్షిణద్వారమ్ముఁ ♦ దాను గావ
నిరువదికోట్ల క♦పీంద్రులతోఁ గూడి యావరించి చెలంగె; ♦ నానుషేణుఁ

ఆ. డధికబలుఁడు పితయు ♦ నాతార కాతఁడు, షష్టికోటికీశ♦సత్తములను
గొనుచు నసురకోణ♦మునసుండి పశ్చిమ,ద్వార మావరించి ♦ తాను నిలిచె.

క. బలవంతుఁడైన రాఘవుఁ, డలఘుబలోపేతుఁడైన ♦ యాసౌమిత్రిం
గలిసి యుదీచీద్వారము, బలిమిని దా నావరించి ♦ వఱలెన్ మిగులన్. ౨౬

క. వనచరపతి సుగ్రీవుం, డనిలునికోణంబునుండి ♦ యారాఘవుతో
డను నిల్చె; భీమదర్శనుఁ, డనూనకాయుండునొ గ♦వాక్షుం డంతన్. ౨౭

తే. ఒక్కకోటి గోలాంగూలు ♦ లొప్పుచుండ
వీర్య మొప్పంగ నారఘు♦వీరుపార్శ్వ
భాగమున నిల్చె; శత్రుని♦బర్హణుండు
బలయుతుఁడు ధూమ్రుఁ డొకకోటి♦భల్లుకములు. ౨౮ 1565

క. తనుఁ గొల్వ రాముపార్శ్వం,బున నుండెను; వీర్యము బల♦మును బొంగఁగఁ జ
క్కని కవచంబును దాలిచి, ఘనుఁడైన విభీషణుండు ♦ గద కైఁ గ్రాలన్. ౩౦

తే. అనికి నాయత్తుఁడై సచి♦వాళిఁ గూడి
రామచంద్రునికడనుండె; ♦ భీమబలులు

* జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభి
పాలితః - అనిమూ. ఈశ్లోకము సుందరకాండమునఁ గొన్నిపర్యాయములు ప్రయోగింపఁబడినది
ఇందును జెప్పఁబడియె. కాన నిది వాల్మీకిమహర్షి కవిచంద్రునకుఁ బ్రీతిపాత్రమని తోఁచును.
ఇంతకన్న రామవిషయకకీర్తన మేమిగలదు ?

క. [హరివీరు లుగ్రశౌర్యము, పరులకుఁ గనఁబడఁగ నంత ♦ బవరంబునఁ గ
ర్బురులం గొట్టుచు శ్రీరఘు, వరుఁ డతిబలశాలి దుష్ట♦వైరిలయదుఁడున్.
క. బలవంతుఁడైన లక్ష్మణుఁ, డిల సర్వోత్కృష్టుఁ డగుచు ♦ నెనఁగుచునున్నా]
రల కపిపతిసుగ్రీవుం, డలఘుబలుం డున్నవాఁ ♦ డహార్యవిభవుఁడై. ౪౩
క. అని గట్టిగ నార్చుచు నా, దనుజులపైఁ బడిరి; ఘోర♦తనులౌ కపులో
ఘనకీర్తిరాజా! యుర్విని జయజయ యనుచు రాము♦వినుతించు చనిన్.
క. తమనామవిక్రమాదుల, నమరారులయెదుటఁ బొగడి ♦ యతివేగముగా
ద్రుమముల గిర్యగ్రంబుల, నమధికబల మలరఁ గొట్టి ♦ శాతనఖములన్.
ఆ. దంతములను వారిఁ ♦ దక్షణ మలయించి, రంత భయదరూపు♦లౌ దనుజులు
ప్రబల గర్వమలరఁ ♦ బ్రాకారగతులయి, శూలఖడ్గభిండి♦వాలములను. ౪౫
క. ధరణి గతులైన యవ్వన, చరులం బరిమార్చి; రంత ♦ స్థానస్థలిఁ దగునా
హరివరులు గోపముం గొని, త్వరపడి వరణాగ్రములకుఁ ♦ దా మెగిరి తగన్.
చ. దనుజులు నందు నిల్చి తము ♦ దారుణరీతిని గొట్టువారి మే
దినిఁ బడఁద్రోసి; రత్తఱిని ♦ దృప్తమహాసురకీశవీరజా
లనియతసంగరంబు తుము♦లంబయి శోణితమాంసపంకమై
కనుఁగొన నద్భుతంబగుచుఁ ♦ గ్రాలెను సాటియె లేక యుగ్రమై. ౪౭౪ 1583

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩ - వ సర్గము.

కపిరాక్షసులకు ద్వంద్వయుద్ధము.

చ. అనుపమధైర్యసారులగు ♦ నాహరివీరులు ఘోరసంగరం
బును నొనరించుచుండఁ గని ♦ పూర్వసుపర్వులు దారుణాగ్రహం
బును గని; రంత సాధ్వసముఁ ♦ బుట్టెడు కార్యము లెల్లఁ జేయునా
దనుజులు రాక్షసోత్తము లు♦దారజయంబును గోరి తేనికిన్. ౧౪ 1584
సీ. కనకశేఖరములఁ ♦ గ్రాలునశ్వంబులు వహ్నిశిఖోపమ♦ధ్వజవితతులు
దపనసంకాశర♦థవ్రజంబును జారు కవచాళి భాసిల్లఁ♦గా దెసలను
ధ్వనులచే నింపుచు ♦ ననిఁ జేయ వెడలిరి భూరివానరసేన ♦ భూమిపతికి
విజయమ్ముఁ గోరుచు ♦ వేగమ కామరూపులగు నా రాక్షస♦బలములఁ గని
తే. తలపడియె; రెండుబలములు ♦ కలహకాంక్ష
నొండొరులమీఁదికిం జను♦చుండ నడుమ
ద్వంద్వయుద్ధంబు చెల్లెఁ; ద♦ద్దయును దేజ
మలరు నాయింద్రజిత్తు దో♦ర్బలము మెఱయ. ౫ 1585

పాశబంధము విడిపింప ♦ బలసముగ్రు
లైన యసురులు, శూరులౌ ♦ దానవులును ౪౭ 1884

క. సురపతితోఁ గూడిన నిర్జరులును గంధర్వులెల్ల ♦ శత్రువులుగా భీ
కరరూపనాగములు భీకరదంష్ట్రలు గలిగి విషముఁ ♦ గ్రక్కుచు మిగులన్.

తే. కాద్రవేయములయి పొల్చుఁ ♦ గద్రుకేంద్ర
తనయమాయాప్రభావంబు ♦ ననుశరాకృ
తిని జెలంగుచు నిన్నుఁ బొం♦దెను రఘువర!
ధర్మవేత్తవు నిత్యస♦త్యవ్రతుఁడవు. ౪౯ 1886

చ. నిరతము సత్యశౌర్యుఁడవు ♦ నీవు రణంబున శత్రునాశనుం
డురుభుజవిక్రముండునయి ♦ యిప్పుడు లక్ష్మణుఁ జేర్చుకొంట మీ
యిరువు రదృష్టవంతుల రిఁ♦కేమియు మీకు భయంబు లేదు; భీ
కరఫణిపాశబద్ధులయి ♦ క్లిష్టస్థలి మీరు పసుండియుండుటల్. ౫౦ 1887

క. వినినంత మిత్రధర్మంబును బాలించుచును నెయ్య♦మున నిచ్చటికిం
జనుదెంచితి శీఘ్రంబున;, వినుఁడీ మీముఁ దీక్ష్ణబాణ♦విషధరము లిటుల్. ౫౧

ఆ. పాశములుగ నగుచు ♦ బంధింప విడిపించి,తిని; సతంబు మీరు ♦ మనసునందు
నేప్రమాదమొంద ♦ కేయస్త్రములకుఁ బ్రతీకస్త్రములను బైచ ♦ నర్హరీతి.

క. ఆలోచింపుచునుండుం, డాలంబునఁ గృత్రిమముగ ♦ నసురులు పోరం
జాలుదు రది నైజం బా,బాలిశులకు మీ రసంగ ♦ భవ్యాత్మయులై. ౫౩

క. ఘనశౌర్యంబున మించుచు, మనములఁ గపటంబె లేక ♦ మహిఁ బొల్తురు మీ
కనుపమబల మియ్యదియోఁ;, గనుక నె నమ్మంగరాదు ♦ కర్బురుల ననిన్. ౫౪

క. ఈదృష్టాంతముచేత న, యీదనుజులు కుటిలులౌట ♦ నేమియు నమ్మం
గాఁ దగదని తెలియఁగ నగు;, మేదినిపతులార! యనుచు ♦ మిక్కిలిప్రీతిన్.

[1]క. బలవంతుఁడు గరుడుండిటు, పలికి మహాస్నేహమూని ♦ బాగుగ నారా
ము లలితముగ నాలింగనములఁ దన్పుచు సెలవుఁగొనఁగఁ♦బూనియిటుల నన్.

క. చెలికాఁడా! శ్రీరామా!, పలుధర్మములఁ నెఱింగి ♦ పగతురదోషం
బులఁగూడం బాటింపక, యెలమిం జూతు గద వారి ♦ నినకులతిలకా!. ౫౮

తే. సెలవొసంగఁగ నిన్ను వాం♦ఛించువాఁడ
వచ్చినట్లుగ నేను బో♦వలయు; వీర!
నాకు నీకును మైత్రి యు♦న్నవిధ మరయ
[2]నివుడు కుతుకంబు నొందఁగా ♦ నేల? వలదు. ౫౯ 1895

1 ఏవ ముక్త్వా తతో రామం సుపర్ణ స్సుమహాబలః-అనిమూ. 2 నచ కార్యాబాలం కార్యం సఖిత్వం ప్రతి రాఘవ-అనిమూ.

క. అనిఁ గృతకృత్యుఁడవై నీ, వనుపమమైత్రి యొనఁగూడి ♦ నట్టివిధ మెఱుం
గను గలవు లంకపై నీ,వు నిశితబాణోర్మిఁ బఱపఁ ♦ బూనుము దానన్. ౫౭

తే. బాలవృద్ధులు తప్ప న♦ప్పట్టణమునఁ
గలుగుదనుజుల రావణుఁ ♦ గర్వు రేంద్రుఁ
బగతునిం జంపి సీతను ♦ బడయఁగలవు;
రాఘవా! యని భూరివీ♦ర్యయుతుఁ డగుచు. ౫౮ 1897

సీ. శీఘ్రవిక్రముఁడునై ♦ చెలఁగు గరుత్మంతుఁడిట్లు వచించి భూ♦మీశసుతుల
కష్టములం బాపి ♦ కపులెల్లఁ జూడంగ వారి కిద్దఱకును ♦ వలగొని తమిఁ
గౌఁగిలించుకొని యా♦గంధవాహునిఁ బోలి యాకాశపథమున ♦ నరిగెనంత
వనచరయూథపుల్ ♦ ఘనులగు రాములక్ష్మణులు విచ్యుతబంధ♦కలితులగుచు
తే.నుండుటం గాంచి సంతోష♦ముప్పతిల్ల, సింహనాదంబులను బూని♦చేసి వాల
ములను ద్రిప్పిరి;ముంవటి♦వలె నెహర్ష,ములను భేరులు వాయించి♦రలఘుగతుల.

క. సురుచిరమృదంగముల న,త్స్వరముగ వాయించి రల్లి ♦ వనచరు లతిభీ
కరముగ శంఖము లొత్తిరి, పరభయకృచ్ఛింహనాద♦పటలము పర్వన్. ౬౨

*క. ఒనరిచి; రానగయోధులు, వనచరులు పరాక్రమంబు ♦ వైరుల కెల్లన్
గనఁబడగ భుజాస్ఫాలన, మనేకవారము లొనర్చి ♦ యంతఁ దరువులన్. ౬౩

తే. వరుసఁ బెకలించివానిని♦గరములఁ గొని,శతసహస్రంబులుగఁ జేరి♦సమరమునకు
నాయితులగుచునిల్చిర♦య్యవసరమున,వనచరులు గొప్పనినదంబు♦వఱలునట్లు.

క. అనిశం బార్చుచు దనుజుల,కును భీతిం గల్గఁజేయు ♦ కుతుకము యుద్ధం
బొనరించువాంఛితంబులు, గనఁబడ ద్వారములను నరి♦కట్టిరి పెలుచన్. ౬౫

చ. వనచరు లర్ధరాత్రమున ♦ వారక సింహరవంబు లొప్ప నా
ర్చినఁ దుములస్వనం బదియుఁ ♦ జెచ్చెఱ మీఱుచు వృష్టికాలమం
దనుపమ మేఘగర్జనము ♦ లట్టులు చాలభయంకరంబుగా
దనుజపురంబునందుఁ దగెఁ ♦ దద్దయు వారిలయంబుఁ దెల్పుచున్. ౬౬ 1903

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట.

క. వనచరు లతిబలవంతులు, ఘనసింహరవంబు లట్లు ♦ కావింపఁగ నా
ధ్వని మిక్కిలి తుములంబుగఁ, దనరన్ రాక్షసులు దనుజ♦తల్లజుఁ డోకటన్.

క. విని రంత రావణుఁడు చ,క్కనిదియు గంభీరమునగు ♦ కపినాదంబున్

* వానరా నగయోధినః-అనిమూ.

విని యామంత్రులయంతర,మున నిట్లని పల్కె సచివ♦ముఖ్యులఁ గనుచున్. ౩

చ. వనచరవార మొక్కటను ♦ వారిదముల్ తగ గర్జనంబు సే
యునటులు హర్షపూర్ణమయి ♦ యుద్ధతి మీఱఁగ నార్చుచున్న దం
దునఁ బెనుహర్ష ముప్పతిలెఁ ♦ దోడన యంచును దోఁచె స్పష్టమే
యనఁదగు లేదు సంశయ మ♦నట్టిదియే కద యెన్నిచూచినన్. ౩½ 1906

క. ఆనినదంబులచేతనె, యీనత్తై వలినిపతియు ♦ నెంతయుఁ గలఁతం
దానొందె, నన్నదమ్ములు ,మానవపతిసుతులు తీక్ష్ణ♦మార్గణములచేన్. ౪½

తే. బద్ధులై యున్నవా రిట్టి♦పట్టున నిటు
గొప్పనినదంబు మనకిది♦గో వినంగ
నయ్యె నిట్లాటఁ గ్రూరశ♦రాభిబంధ
నము వదలెనేమొ యనుశంక ♦ నా కొదవెడు. ౫ 1908

చ. అని దనుజేంద్రుఁ డాత్మసచి♦వాళికిఁ దెల్పి సమీపవర్తులౌ
దనుజులఁ గాంచి యిట్లనియెఁ ♦ దప్పక యిప్పుడు వానరాళికిన్
వనటఁ గృశించుకాల మిటు ♦ వచ్చి చెలంగఁగ వారు సంతసం
బునఁ దగియుండ హేతు వెది♦పోలునొ దాని నెఱింగి రండొగిన్. ౬ 1909

క. అని యాజ్ఞాపించిన నా,తనియానతిఁ గొనుచు యాతు♦ధానులు సంభ్రాం
తిని గని ప్రాకారంబుల,కును నెగఁబ్రాకుచును ప్లవగ♦కుంజరుల నటన్. ౭½ 1910

క. కనిరి మహాత్ముండగు నా, వనచరపతి కాచుచుండ ♦ వర్ధిలువారిన్;
దనుజులు మఱియున్ భీతిక,రనాగపాశములు వీడ ♦ రాఘవు లెలమిన్. ౮½

క. వడి లేచి భాగ్య మలరఁగఁ, బుడమిపయి న్నిల్చి సుఖము ♦ పొంగఁగ నుండం
గడఁగి కని ఖేదమొందం, గడఁగిరి; వారంత గుండె♦కాయ లదరఁగన్. ౯

తే. వడిగఁ బ్రాకారమును దిగి ♦ భయమున ముఖ
ములును వెలవెలఁ బోవఁగ ♦ నలఘుగతుల
రావణుని జేరి; రంత నా♦రాక్షసవరు
లెల్ల వాక్యవిశారదు♦లే యగుటను. ౧౦ 1913

క. దీనముఖులౌచు రాఘవు, లానిశితశరాళి పీడ ♦ వాయిగనున్నా
రానిన ప్రియమున నని తగఁ,గా నెఱిఁగింపంగ వలసెఁ ♦ గా యప్రియమున్.

చ. అని తలపోసి యీవిధము ♦ నంతయు నున్నది యున్నయట్లు తె
ల్పను సమకట్టి; నీసుతుఁడు ♦ పాకనిషూదన జేత సంగరం
బున ఫణిబాణపాశములఁ ♦ బోలఁగఁ గట్టి కరంబు లించుకే
నను గదలింపరానిగతి ♦ నైజమహాద్భుతశక్తిఁ జేయఁగన్. ౧౧½ 1955

ఆ. అట్లు బాధపడెడు ♦ నాయన్నదమ్ములు, హస్తిపతిసమాన ♦ మహావరాక్ర
మమున నాగబంధ♦నములు పోవఁగఁ బాశ,ములను ద్రెంచుకొన్న♦యులకరివలె.

క. కనుపట్టుచున్నవా; రో, దనుజాధిప! యన నితాంత♦దర్పసమగ్రుం
డనుపముఁడు నైన రావణుఁ, డని మొన నున్నట్టివిధము ♦ నసురులు పలుకన్.
క. విని చింతాశోకంబులు, మనమునఁ బెనఁగొనఁగ మోము ♦ మాడినరీతిం
గనఁబడె నిట్లనియెన్; నా, తనయుండగు నింద్రజిత్తు ♦ తా వరములచేన్.
సీ. కడఁగి సంపాదింపఁ♦గడుభయదము లుగ్రములునగు క్రూరఫ♦ణులనఁ బొల్చు
నట్టి యమోఘంబు ♦ లర్కసమానంబులగు బాణములఁ గొని♦యాజి బలిమి
బంధించె వారి; నా♦పగవార లిద్దఱు బద్ధులయ్యుండియు ♦ బంధముక్తు
లై నపక్షమున నీ ♦ దానవసేనకు నాశనమే యంచు ♦ నాకుఁ దోఁచు
తే. చున్న దెన్నియొ మాఱులు ♦ యుద్ధమందు
నాదుపగవారి ప్రాణమా♦నములఁ గొనిన
వాసుకిసమాన తేజంబు ♦ భాసిలంగ
నలరుబాణము లయ్యె ని♦ష్ఫలము లకట. ౧౭ 1919
క. అని పల్కి భూరికోపం, బున నహివలె నూర్పుగములఁ ♦ బుచ్చుచు నవ్వా
రినడుమ ధూమ్రాక్షుండను, దనుజవరుం గాంచి పల్కె ♦ దర్పసమగ్రా!.
క. విను రాక్షససైన్యంబును, గొని నీవా రాఘవులను ♦ గోఁతులఁ జంపం
గను వెడలుము త్వరగ నటం,చు నాజ్ఞ నిడి బుద్ధిబలము ♦ శోభిలుచుండన్.
క. పురికొలుపంగ ధూమ్రాక్షుం, డురుసంతోషమున నతని ♦ కాదవినభక్తిన్
ధరణిఁబడి మ్రొక్కి వెడలెను, ధరణిపుసౌధంబునుండి ♦ దర్పము పొంగన్.
తే. ఆగృహద్వారముననుండి ♦ యతఁడు వెడలి
యచ్చటి బలాధిపుం గాంచి ♦ యనినొనర్పఁ
దలఁపుఁ గొన్నాఁడ నేను నా♦బలము నెల్ల
నాయితము సేయుమా తడ♦యంగ నేల?. ౨౧ 1923
క. అని రావణుననుమతి నా, దనుజేంద్రుఁడు పలుక వినుచు ♦ దానవబలమున్
వెనుకొని కాచుబలేశుఁడు, తనబలముల సిద్ధపఱచెఁ ♦ దదనుజ్ఞ మెయిన్. ౨౨
చ. దనుజులు భీకరాకృతులు ♦ దారుణదర్పులు నొంచు విక్రమం
బునకును గుస్తిగాఁ గతులఁ ♦ బొందుగఁ దాల్చినఘంట లొప్పఁ జ
క్కని వివిధాయుధంబులును ♦ గ్రాలు మహాపరిఘాళిముద్గరా
ఘనిబిడహస్తులై తమిని ♦ గర్జిలుచున్ ద్వర ధూమ్రనేత్రునిన్. ౨౩౪ 1925
సీ. పరిఘముల్ గదలును ♦ బట్టసముసలమ్ము లినుపదండములు కై♦కొనుచు శౌర్య
ములరుచునుండంగ ♦ ననుసరించిరి; మఱియును భూరిభిండివా♦లోగ్రభల్ల
ములును బరశ్వథం♦బులు ప్రాసములుఁ గరంబులఁ గ్రాలవారిదం♦బుల తెఱఁగున
గర్జించుచున్ గపి♦గణముల నొంపంగ నాల్గుదిక్కులనుండి ♦ నామములను
తే. జెప్పుకొనుచుచు వెడలిరి; ♦ చిత్రకవచ
ములను దాలిచి ధ్వజముల ♦ వెలసి బహువి

ధానసంబుల నొప్పు ఖ♦శాలిఁ బూన్చి
కనకజాలములఁ దగుస్యం♦దనము లెక్కి. ౨౮ 1926

క. దనుజులు కొందఱు వెడలిరి;, దనుజులు మఱికొంద రల్లి♦ దర్పంబున వ్యా
ఘ్రనికరమువలె దురాసదు, లనూనవేగమునఁ గొవ్వు♦ నశ్వములపయిన్.

క. ఆరోహించియె వెడలిరి;, ఘోరమదాకులములైన♦ కుంజరములపైఁ
జేరి మఱికొంద ఱేగిరి;, గారవ మేపారుచుండఁ♦గా నయ్యదనన్. ౨౯

క. పరుషరవం బొప్పెడు భీ,కరరూపుఁడు దేవనాథ♦కల్పుఁడునగు ని
ర్జరరిపుఁ డాధూమ్రాక్షుం, డరదము హేమాభరణము♦ లలరుచునుండన్.

క. హరివృకముఖముల నొప్పెడు, ఖరములచే నీడ్వఁబడుచుఁ♦ గ్రుతరంబై
పరఁగన్ దానెక్కెను; గురు,తరవీర్యుఁ డతండు వెట్టి♦దముగ నడచుచున్.

క. ఖరవాహనంబుఁ గడుభీ,కరశబ్దము నగుచు దివ్య♦కాంతులఁ దగు నా
యరదముపై నెక్కి మహా, సురులెల్లను బలసి రాఁగ♦ సొంపు గులుకుచున్.

సీ. పకపక నవ్వుచుఁ♦ బావని యూథాధిపతియయి యేదిశఁ♦ బరఁగునట్టి
పడమటిద్వారంబు♦ వడిఁ జేరె, భీతికృద్విక్రముం డతిఘోర♦వికృతరూపుఁ
డైన యాధూమ్రాక్షుఁ♦ డట్లుగా నుగగంగనాకాశమునయందు♦నతిభయంక
రములైన యట్టి కా♦రణములఁ దెల్పెడు పక్షు ల[illegible]ం బయ్యె;♦ భవ్యరథము
తే. శీర్షమునఁ బెనుభీతినిఁ♦ జెందఁజేయఁ
జాలు గ్రద్దయొకండు తా♦వ్రాలె శవము
లను దినంజాలు పక్షులె♦ల్లను ధ్వజంబు
మొనపయిని వ్రాలె గుంపులు♦గను జెలంగి. ౩౦॥ 1932

క. తనువెల్ల రక్తపూరం, బునఁ దడియఁగఁ దెల్లనగుచు♦ భూరితరముగా
గనఁబడు మొండెము వికృత, ధ్వని నేడ్చుచు నతనిచెంత♦ ధరణిం బడియెన్.

క. జలదము రక్తము గురిసెను, నిల గంపము నొందెఁ బిడుగు♦లిలఁబడురీతిన్
బలురవమునఁ బ్రతికూలా, నిలుఁ డప్పుడు వీచె; నంత♦ నిఖిలదిశలనున్. ౩౩॥

తే. అంధకారంబు గ్రమ్మట♦ నపుడు దెసలు
విగతకాంతులు గానుండె♦ విమనములును
దనుజభయదంబు లెంతయు♦ దారుణములు
నైన యుత్పాతములు పుట్ట♦ నతఁడు చూచి. ౩౪॥ 1935

క. మనమునఁ జింతించెను; నా, దనుజేశునిముందుఁ జనెడు♦ దానవు లార్తిన్
గని యేమియుఁ దోఁపమిచేఁ, గనుచుండిరి వాని; నంతఁ♦ గర్బురవిభుఁడున్.

ఆ. అతిభయంకరుండు♦ నతిబలశాలియు, నై చెలంగుచుంట♦ నానిమిత్త
ములను లెక్కఁగొనక♦బలయుతుల్ దనుజులు, తన్ను బలసికొలువ♦దర్పయుతుఁడు,

క. అని సేయుకోర్కి వెలువడి, పనివడి శ్రీరాముబాహు♦పాలిత మగుచున్
వనచరనికరమయంబై, వననిధివలె నున్న ప్లవగ♦వాహినిఁ గనియెన్. ౩౬॥

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౫౨ - వ సర్గము.

ధూమ్రాక్షుఁడు హనుమచేఁ దెగుట.

క. వనచరు లెల్లను యుద్ధం,బును జేయఁగఁ గోరుచుంటి ♦ భూరిభయదశౌ
ర్యుని ధూమ్రాక్షుని, నాలం,కనుండి యట వచ్చువానిఁ♦గాంచి ముదమునన్.

క. హరినాదంబు లొనర్చిరి, తరువులఁ గొని ప్లవగవరులు ♦ దానవపతు లా
తురులయి శూలంబులు ము,ద్గరములు గొని యొకరినొకరు ♦ దారుణభంగిన్.

తే. అట్టి ప్రహరించుకొనుచుండ ♦ నాయిరుదెగ
లకును సంకులసమరంబు ♦ సకలభూత
భయదముగఁ జెల్లె రాక్షస♦వర్యు లొకటి
గాఁగఁ గూడి చిత్రములు భీ♦కరములునయి. ౨॥ 1941

క. పలువిధములైన పరిఘం,బులును త్రిశూలములు గొనుచుఁ♦బొంగుచు నాకోఁ
తుల నెల్ల యెడలఁ జెండిరి;, యిల శకలములై పడంగ ♦ నెల్లతనువులున్. ౩

చ. వనచరవీరు లంతఁ దరు♦వారముఁ గైకొని త్యాసముంబుగా
దనుజులఁ గూలనేసి; రల ♦ దానవు లందుల కాగ్రహించుచున్
సునిశితఘోరబాణముల ♦ స్రుక్కఁగ నేయుచుఁ గాలహవ్యవా
హనసమకంకపత్రనిక♦రాభియుతాకుటిలాంబకంబులన్. ౪॥ 1943

క. వనచరులన్ నొప్పించిరి;, దనుజులు మఱి భీమగదలు ♦ దగుపట్టసముల్
ఘనకూటముద్గరంబులు, గొని కీశులఁ జెంపుమీఱఁ ♦ గొట్టుచునుండన్. ౫

క. గురుబలయుతు లౌటను వన,చరు లుత్సాహంబు రోష♦సంగతిఁ బొంగన్
దుర మొనరించి రభీతుల,కరణిన్; దరువాతఁ బ్లవగ♦కాంతు లనిమొనన్. ౬

చ. దనుజుల శూలసాయకవి♦దారితగాత్రులునయ్యు జంక కొ
య్యన శిలలం దరువ్రజము ♦ నందిరి; వానరవీరు లంత న
ద్దనుజులపైకి వేగముగఁ ♦ దారు చెలంగుచుఁ బోవుచున్ భయం
బును గలిగింప సింహముల ♦ పోలిక నార్చుచుఁ బేర్లఁ దెల్పుచున్
గన భయదాకృతుల్ వెలయు ♦ కర్బురులన్ బ్రహరించి రెంతయున్. ౭

క. తరుశిలలఁ గొనుచు నవ్వన,చరులును వివిధాయుధవ్ర♦జంబును గొని క
ర్బురులును దలఁపడఁగా సం,గర మాశ్చర్యమును భీతి♦కరమును నయ్యెన్. ౮

ఆ. విజయశాలురైన ♦ వీరవానరులచేఁ, గొట్టఁబడిన దనుజ♦కుంజరు లొక
కొంతమందిచచ్చి ♦ రంతటఁ గొందఱు, క్రక్కుకొనిరి నల్లఁ ♦ గళవళించి,

క. దనుజులు పార్శ్వంబులఁ జించిన గుండెలు వగులఁ గపులు♦క్షితిని బడిరి; శూ
లనికరహాతులై ప్రేఁగులు, దనువుల వెలుపలికి రాఁగ ♦ ధరణిం బడుచున్. ౨౨
క. మరణించిరి కొందఱు న,ట్లిరువురు మార్కొనుచు శిలల ♦ వృక్షంబుల, భీ
కరశరముల వైచుచు సం,గరమును జేయంగ నద్ది ♦ గాఢరవములన్. ౨౩
క. ఘనభయదముగాఁ జెలఁగెను, ధనువులకుం దగిన యల్లె♦త్రాళ్లధ్వనులు చ
క్కనివీణాస్వనములుగాఁ, దనరఁగ *నెక్కిళ్లు మిగులఁ ♦ దాళంబులుగాన్. ౨౪
తే. అలసియుండుటచే మంద♦గిలిన పలుకు
లతులగానంబుగా నొప్ప ♦ నాజిగాన
మెంతయుం జక్కఁగా నొప్ప; ♦ నేచియంత
ననిని ధూమ్రాక్షుఁ డురుచాప♦మును గ్రహించి. ౨౫ 1962
క. తనశౌర్య మూని నవ్వుచు, సునిశితనారాచములను ♦ సోన గురియుచున్
వనచరులఁ దఱిమె దెసలకు;, దనుజేశ్వరబాధితనుయి ♦ తప్పల మెల్లన్. ౨౬
క. కలగుండుపడుట మారుతి, పలువిధములఁ జూచి కోప♦భరమునఁ బెలుచన్
జెలరేఁగి గొప్పశిల నిమ్ములఁ గరమునఁ బట్టి దనుజ♦ముఖ్యునిపైకిన్. ౨౭
క. అరిగెన్ యుద్ధమొనర్పఁగ;, మరుదాత్మజుఁ డంతఁ బిత్రుస♦మంబగు శౌర్యం
బు రహిం గన్పడఁ గ్రుధచే, నరుణిమ కనులందు ద్విగుణ♦మై తోఁపంగన్.
ఆ. ఊచి యూచి దాని ♦ నుగ్రుఁడై ధూమ్రాక్షు
నరదమందుఁ బడెడు♦నట్లు వైచె,
నంత ధూమ్రనయనుఁ ♦ డాశిల తనపైకి
వచ్చుచున్నయట్టి ♦ వరుసఁ జూచి. ౨౮ 1966
క. కరమున గద దాలిచి యు,య్యరదము విడనాడి వేగ ♦ యవనికి దిగి యా
ధరణి నిలుచుండె; నాతని,యరదముఁ దచ్చక్రకూబ♦రాశ్వయుతముగన్. ౨౯
క. సధ్వజశరాసనంబుగ, విధ్వంసముగా నొనర్చెఁ ♦ బృథుశిల యది; యా
ప్రధ్వాంతమిహిరసను ఖటు, ప్రధ్వంసము చేసి ధరణిఁ ♦ బడియె విరుచిగన్.
చ. అనిలకుమారుఁ డాహనుమ ♦ యట్లను రేంద్రరథంబు నుగ్గుగా
నొనరిచి స్కంధశాఖలను ♦ నొప్పు మహీరుహముల్ కరంబునన్
దనరఁగ నిర్జరారులను ♦ దార్కొని యుద్ధముచేసె; నంత న
ద్దనుజులలోనఁ గొంద ఱటు ♦ ధాత్రిరుహంబుల మోఁదు నొందుచున్. 3౧
క. శిరములు పగులఁగ నెత్తురు, నిరతమ్ము స్రవింప మేది♦నింబడి; రిట్లా
మరుదాత్మజుండు దనుజో,త్కరమును బాఱంగఁ దోలి ♦ కదురథసమునన్. 3౨
క. గిరిశృంగ మొకఁడు గొని యా,శరవరుపై కడరె; వీర్య♦శాలియ యిన ని
ర్జరవైరి యతఁడు తనపై, కరుదెంచెడు హనుమఁగాంచి ♦ యతివేగమునన్. 33

* హిక్కా శాకమునివ్వరిహ-అనిమా.

క. కరమున గదఁ దాల్చి భీ,కరసింహధ్వని చెలంగ ♦ గాలికొడుకు పైఁ
కరిగెన్; ధూమ్రాక్షుఁడు క్రో,ధరతిన్ బవమానుం డటకా స్వ♦తంబగు దానిన్. 3౪

క. తడయక హనుమచ్ఛిరంబునఁ, బడవైచెన్; భయదనాద♦భాస్వద్గద పైఁ
బడ హనుమంతుఁడు ఘాతముఁ,బడసెన్;మారుతిసమాన♦బలుఁడు దృఢుఁ డంతన్.

క. దానిన్ లెక్కగఁ గొన కా,దానవుమస్తాంతరమునఁ ♦ దద్గిరిశృంగం
బూని పడవైచె; నతఁడ,ద్దానిసమాహతిని సంగ♦తతి క్షోభింపన్. 3౫-౬ 1974

క. ధరఁబడియె వికీర్ణంబై, ధరణీధర మట్లు వే య♦తం డిటు పడఁ గ
ర్వులులంతట హతశేషులు, సురరిపుపతిమృతిని గనుటఁ ♦ జూచి వగవునన్. 3౭

క. వనచరులు వెంటఁబడి చం,ప నిశాంతత్వరను నధిక♦భయమున నాలం
కను జొరఁగఁ బాఱి; రటఁ బా,వనియు మహోత్సుకుఁడై తనదు ♦ వైరి బలమునన్.

చ. అని వధియించి రక్తనదు ♦ లయ్యెడఁ బాఱఁగఁ జేసి వైరిఁ జం
పినశ్రమ మొందియున్ దనుఁ గ♦పిప్రవరుల్ కొనియాడ పూజలన్
మనములఁ బొంగుమోదమున ♦ మాటికి మాటికిఁ జేయ నెమ్మనం
బునఁ దమిఁ గాంచె రక్కసుఁడు ♦ పోవుట లెల్లఁ దలంచుచుం గడున్. 3౯

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౫3 - వ సర్గము.

వజ్రదంష్ట్రుఁడు యుద్ధమునకు వచ్చుట.

క. దనుజేంద్రుఁడు రావణుఁ డా,యనిలోన ధూమ్రాక్షుఁ డిట్టు♦లంతముఁ గనుటన్
విని నిట్టూర్పులు ఫణివలెఁ, దనముఖముల వెడలఁ బనుక్రో♦ధం బొందె మదిన్.

సీ. అతఁడు కోపంబున ♦ నాత్మఁ గలంగఁగ వేఁడినిట్టూర్పులు ♦ విడుచుచుఁ గడు
బలశాలి శూరుఁడౌ ♦ వజ్రదంష్ట్రునిఁ గాంచి పలికె; వీరా పొమ్ము ♦ పట్టణంబు
వెలువడి దానవ♦బలపరివృతుఁడవై చని దాశరథిరాము ♦ సకలకపుల
నట్లు సుగ్రీవుని ♦ ననిఁ జంపి రమ్మని పనిచిన మాయావి♦ దనుజవరుఁడు
తే. వజ్రదంష్ట్రుండు రాక్షసే♦శ్వరునిఁ గాంచి
యట్లె సేసెదనని పల్కి ♦ యఖిలబలము
లను దగంగూడి బలనాథు♦లును దనుఁగొలు
చుచును రాఁబోయె దివినున్న ♦ సురలు కలఁగ. ౪ 1979

చ. కరులును ఘోటకంబులును ♦ గాడిదె లొంటెలు కేతనధ్వజో
త్కరవిలసన్మహారథని♦కాయము వెంటను రాఁగ దేహముల్
సురుచిరగంధపుష్పములు ♦ శోభిలఁ జేయఁగ నంగదంబులున్
వరమకుటంబులున్ గరము ♦ భాసిలుచుండ విచిత్రరీతిగాఁ
బరఁగుచుఁ గత్తిశంబలకఁ ♦ గార్ముక మంది సహాయకాత్ముఁడై. ౫ 1980

క. వెలువడి పురమును వేగము, కల నొనరుపఁ బోయె; సైన్య♦కాంతుఁ డతం డు
జ్జ్వల కేతనసమలంకృత,ము లలితహేమాభిరామ♦ము నగు నరదమున్. ౭౹

తే. వలగొనుచు నెక్కె; నాతని♦భటులు బహువి
ధాయుధంబులఁ దాలిచి ♦ యష్టితోమ
రములు శూలంబులును, ముస♦లములు భిండి
వాలములు పాశశక్తులు ♦ పట్టిసములు. ౮ 1982

తే. ఖడ్గ, చక్ర, పరశ్వధ♦గదలు మొదలు
గాఁ గలుగు తీక్ష్ణసాధన♦గణము కరము
లందు వెలుఁగంగ వెడలి రా♦హవమొనర్పఁ
జిత్రవస్త్రాభిరాములై ♦ చెలఁగి కడఁక. ౯౹ 1983

క. అనిసేయ సమర్థులుగాఁ, దనరెడు నాదనుజవరులు ♦ తమిఁ దోమరరా
జిని సంకులంబులం గొని, ఘనమదవిక్రమము లొప్పఁ♦గాఁ దగుకరులన్. ౧౦

క. చలియించుపర్వతమ్ములు,వలె నొప్పెడువాని నెక్కి ♦ బయలు వెడలి; రం
త లలితలక్షణయుక్తం,బులు గురుబలయుతము లగుచుఁ♦బొలుచు జవములన్.

క. దనుజాలు కొంద ఱధిష్ఠిం,చి నితాంతము శౌర్యములరఁ ♦ జెచ్చెరఁ జని; రా
దనుజబలంబులు సింహ,ధ్వను లలర వినీలదేహ♦వరభూషణముల్. ౧౧౹

క. కనఁబడఁగ ఘోరతరముగఁ, జన వర్షాకాలమందు ♦ సముదీర్ణవిద్యు
ద్ఘనములు నల్లఁగ నార్చుచుఁ,గనఁబడున ట్లొప్పుచుండెఁ♦గడుభయదముగన్.

క. సురవైరు లంత యూధే,శ్వరుఁ డంగదుఁ డున్ననగర♦వరయామ్యమునం
బరఁగెడు ద్వారమునన్ వెడ,లిరి వారలు వెడలఁగాఁ గ♦లిగె నశుభములున్.

చ. ఘనములు లేని యభ్రమున ♦ గాఢతరోల్కలు తోఁచి వారికిం
గనఁబడెఁ గ్రిందుగాఁ బడియెఁ ♦ గ్రన్నన నక్కలు నిప్పుమంట లో
య్యన వడిఁ గ్రక్కుచున్ భయద♦మౌగతి నార్చెను; క్రూరసత్త్వముల్
దనుజున కెల్ల మృత్యువును ♦ దా రటఁ దెల్పెను స్పష్టమౌగతిన్. ౧౪ 1989

క. సురవైరియోధు లానం,గరమునకుం బోవునపుడు ♦ కడు భయమున నా
తురులయి తొట్రిల్లఁబడ సా,గిరి; గురుతేజుఁడయి సుభట♦కీర్తితుఁ డగుచున్.

సీ. బలశాలియునునగు ♦ వజ్రదంష్ట్రుం డట్టియుత్పాతములఁ జూచి♦యురుతరమగు
ధైర్య మూతఁగఁగొని♦తారణోత్సాహముగల్గి ముందున కేగెఁ;♦గర్బు రేంద్రు
లట్టు వచ్చుటఁ గాంచి ♦ యావానరేంద్రులు జయశీలురౌట ద♦శదిశలందు
నిండినట్లుగ భూరి♦నిస్వనం బలర సింహధ్వనుల్ చేసి; ర♦య్యవసరమున

ఆ. భయదరూపయుతులు ♦ భయహేతువులునైన, వానరులకు నట్టి♦దానవులకు
నొకరి నొకరు చంప ♦ నుద్యమించెడువారి, కయ్యెఁ దుములయుద్ధ♦మట్టితఱిని

క. ఇరుతెగలవార లీర్ష్యల, గురుసాహసములను మిగులఁ ♦ గోర్కులతో నం

ములకుఁ దలలొఁగి బగులంగ ♦ నిలనుబడిరి
మూలములుపోవఁ దరువులు ♦ గూలునట్లు. ౨౯ 2003
*క. శకలములైన రథంబుల,వికలాంగములైన యశ్వ♦వివిధపతాకా
ప్రకరంబుల హరిదనుజాం,గకముల నల్ల నిల భీతి♦కరముగ నయ్యెన్. ౩౦
తే. హారకేయూరముఖభూష♦ణాళివస్త్ర,శస్త్రభూషితమై ధరా♦స్థల మది యట
నబ్జతారాభియుక్తిచే ♦ నలరుచున్న, యాశరద్రాత్రివలెఁ గన♦నయ్యె విరుచి.
క. పెనురాక్షసబల మది యా,తనిజవమున నిల్వలేక ♦ తాఁ జలియించెన్
ఘనవాయువేగమునకున్, ఘనములు చలియించుచున్న ♦ కరణిగ నంతన్.

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

—అంగదుఁడు వజ్రదంష్ట్రునిఁ బొలియించుట.—

చ. అనుపమవిక్రమాఢ్యుఁడు బ♦లాధికుఁడై తగువజ్రదంష్ట్రుఁడ
వ్వనచరుఁ డాత్మసైన్యమును ♦ వావిరిఁ గొట్టఁగఁ బాఱుచుంటయున్
వనచరుఁ డట్లుగా విజయ♦వర్ధితుఁడై విలసిల్లుచుండుటల్
కని కడుఁగోపమంది గురు♦కార్ముకముం బటుఘోరరూపమున్. ౧ 2007
చ. కరమునఁ బట్టి వజ్రసమ♦గాఢనినాదముగల్గ లాగి వా
నరులబలంబుపైఁ గడు వి♦నాశనముం దెలుపంగఁ జాలు నా
శరముల వృష్టిగాఁ బరపె ♦ శౌర్యముపొంగఁగఁ గర్బురేంద్రు ల
ట్లరదము లెక్కుచున్ బహువి♦ధాయుధముల్ గొని పోరి రయ్యెడన్. ౨
చ. వనచరులందు శూరులగు ♦ వారు కరంబులఁ బ్రస్తరంబులన్
గొని నలువైపులం జెలఁగి ♦ కోర్కి రణంబొనరించి; రంత నా
యనిమొన రాక్షసుల్ హరివ♦రాళిపయిం జెలరేఁగి వేలసం
ఖ్యనిశితమార్గణాళి నవు ♦ డార్చుచు వైచిరి దర్ప మొప్పఁగన్. ౩ 2009
చ. వనచరవీరు లంత మద♦వారణతుల్యులుగానఁ గొండలన్
ఘనశిలలం దరువ్రజముఁ ♦ గర్బురసంతతిపైని వైచి; రి
ట్లని వెనుదీయ కెంతయు న♦హార్యపరాక్రమయుక్తులై రణం
బొనరుచుచున్న కోఁతులకు ♦ నుద్ధతరాక్షసకోటి కత్తఱిన్. ౪ 2010
క. సమర మ్మధిక మ్మగుచుం, దుములంబుగ సాగె; హరిత♦తులఁ గొందఱు క
ట్లమరారులఁ గొందఱకున్, సమరంబున శీర్షహస్త♦చరణము లెల్లన్. ౫
ఆ. పగిలి విఱిగియుండ ♦ బాణము లంగాళిఁ
గ్రుచ్చుకొనఁగ దీవ్ర♦రుధిర మంగ

* రుధిరేణచసంఛన్నా-అనిమూ.

క. వనచరవర్యుఁడు పెనుగొం,డను గొని యద్దానఁ దద్వి♦నాశనమగు నం
చనుకొని వైచి మహారవ,మును జేసెను; భయదశౌర్య♦మునుగల యతఁడుఁ న్.
క. పెనుగిరి తనపై కరుదేఁ, గని సంభ్రాంతుండు గాక ♦ గదఁ జేఁగొని స్యం
దనమునసుండి ధరిత్రికి, ఘనజవమున దుమికి నిలిచెఁ ♦ గపివరుఁ డంతన్.
క. తనరిపుని వజ్రదంష్ట్రుని, నని మొనఁ దాఁ జేరఁబోయి ♦ యాతనిగదఁ జేఁ
గొనియెను బలవంతంబుగఁ, మును పంగదుఁ డతనిమూర్ధ♦మున నెదిపై చెన్.
క. గిరి యద్ది వజ్రదంష్ట్రుని, యరదంబు సచక్రకూబ♦రాశ్వంబుగ ను
ర్వరఁ గూల్చె నుగ్గుగా; న,త్వరముగ నాయంగదుండు ♦ బల మలరారన్. ౨౩౪
క. తరుయుక్తము విపులమునగు, ధరణీధ్రము నెత్తి వజ్ర♦దంష్ట్రునితలపై
నురుగతి వైచెను దానన్, సురవైరియు నల్లఁ గ్రక్కు♦చున్ మూర్ఛితుఁడై.
*క. ఉరగమువలె నిట్టూర్పులు, పరిపరిఁ బుచ్చుచు సుఱొక్క♦భయదగదను నా
తురుఁడయి కైఁగొని సంజ్ఞా,విరహితుఁడై క్షణముసేపు ♦ వెళ్లగఁ బుచ్చెన్.
చ. దనుజుఁడు మూర్ఛఁబాసి తన♦దాపున నున్నకపీంద్రుఁ గాంచి యిం
తని యనరానికోపమున ♦ నాతనివక్షము నొవ్వఁజేసె నా
పెనుగదవ్రేటునన్; మఱియు ♦ బీరముపొంగ గదం ద్యజించి వాఁ
డనినొనరించె ముష్టిహతి ♦ నంగదు నొంచుచు నంత నయ్యెడన్. ౨౭ 2030
క. వనచరరాక్షసు లేచి యొ,కని నొక్కఁడు తన్నుకొనిరి ♦ గాఢంబుగ నా
పెనువ్రేటుల నెత్తుటిలో, మునుఁగుచు నలజడినిమిగులఁ♦బొందుచుమఱియున్.
ఆ. అతులవిక్రమమున ♦ నంగారకబుధుల, వలెను బొల్చుచుండి; ♦ రలఘు తేజుఁ
డగుచుఁ గీశతిలకుఁ♦డగు నంగదుం డంత,సుమఫలాళియుతకు♦జము నొకండు.
క. బల మొప్పఁ బెఱికి యనిమొన, నిలిచెను సురవైరి యట్లు ♦ నిలిచెను మఱియా
యలఘుబలశాలి యంగదుఁ, డలరుచు వృషచర్మవిహిత ♦ మగు ఫలకంబున్.
సీ. విపులమై, కింకిణీ♦వితతిఁ జెన్నారుచుఁ జర్మమొక్కటి సమా♦చ్ఛాదనముగఁ
గలిగియున్నట్టి ఖ♦డ్గంబును బూనంగ నసురయు నట్లె చే♦నందె వాని;
నిర్వురు వారు జ♦యించెడు నిచ్ఛలఁ గుపితులై మించెడు ♦ కోరికలను
బహుచిత్రమార్గముల్ ♦పరఁగ యుద్ధము సేయుచును బరస్పరము భీ♦తినిజనింపఁ
తే. జేయునట్లుగ బవరంబుఁ♦జేసి రట్లు, కడఁకమైఁ గొట్టుకొనుచుండఁ♦గా స్రవించె
రక్త మిద్దఱివౌ శరీ♦రములనుండి, పుష్పితపలాశతరువుల♦పోల్కి వారు. ౩౭
క. పోలిచిరి మఱియును సంగర,మలఘుబలంబులను జేసి ♦ యలయుచు ధాత్రీ
స్థలి జానువులపయి జయే,చ్ఛలఁ గూర్చుండిరి; క్షణంగ♦స త్తముఁ డంతన్.
తే. ఒకనిమేషములోపల ♦ నుగ్రనయనుఁ, డగుచు దండాహతభుజంగ♦మట్లు లేచి

* మహార్త మభవ న్మూర్ధో గదా మాలింగ్య నిశ్వసన్ - అనిమూ. గదాంఆన్యాం - అని వ్యాఖ్య.

యుతరంబగుబలమున♦నొప్పిస్వచ్ఛ, మగుచుసా నం సీతిచ♦స్వ గపొలయుచు.
[1]క. తనరారుఖడ్గమున నా, దనుజో త్తమునుందరమగు ♦ తలను నతికె; నా
యనన రక్తసిక్తగాత్రం, బునఁ బగునావజ్రదంష్ట్రీ♦భూరిశిర మటఁగ. ౩౪
తే. కోపపరివృత్తనయనమై ♦ గొట్టువడుచు
రెండుగాఁ దున్గి నేలను ♦ బండియుండె;
నట్టు లావజ్రదంష్ట్రుఁడు ♦ హతుఁడగుటను
గాంచి భయమోహితులయి రా♦క్షసులు వనట. ౩౫ 2038
క. వనచరులు తమ్ము వెనుకొని, ఘనతరుశిలలఁగ గ్రహించి ♦ కావరమునఁ జం
ప నితాంతము దీనాస్యము,లను దుఃఖంచుచును మిగుల ♦ లజ్జను దలలఁగ.
ఆ. నంత వాంచి లంకఁ ♦ జొచ్చిరి; వజ్రము,హత్వబలము గలరు ♦ నంగదుండు
వైరిఁ జంప దేవ♦వారాంతరస్థేంద్రు,వలెను గపుల నడుమ ♦ వఱలెఁ దమిని. ౩౬
ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము.

అకంపనుఁడు హనుమలో యుద్ధము సేయుట.

ఉ. అంతట రాక్షసేంద్రుఁ డని ♦ నంగదుచేతను వజ్రదంష్ట్రీఁ డ
ట్లంతము నొందుటల్ విని కృ♦తాంజలియై తనముంగల నిల్చి కా
లాంతకురీతిగాఁ దగుబ్ర♦హస్తు బలాధిపుఁ గాంచి వేగదు
ర్దాంతపరాక్రముల్ ఘనత♦రంబగు లావును గల్గునారలు. ౧ 2041
క. అని దుర్ధర్షులునై తగు, దనుజులు సకలాస్త్రశస్త్ర♦ధర్ములు మెఱుఁగు శూ
రు నకంపను మున్నిడుకొని, దనుజులుగా కలిజనముల ♦ శత్రులఁ జంపఁగ. ౨
[2]చ. ఇతఁడు పరంతపుండు బల♦మెల్లను గాచెడివాఁడు సేనకుం
బతి; సమరప్రసిద్ధుఁడగు ♦ వారక యొప్పును కోపమందు నా
హితమును, సంగరప్రియ ను♦దెప్పుడు నీతనిఁ బొందియుండు సం
తతమును శత్రుకాననను♦దారుణహవ్యవహుండునై తగుఁ. ౩ 2048
క. దనుజుం డీతఁడు రాఘవు,లను, భూరిబలాఢ్యుఁ గపిబ♦లప్రభు సుగ్రీ
వునిని జయించి భయంకర,వనచరులను దక్కువారి ♦ వధియించు ననిఁగ. ౪
క. ఘనబలుఁడు శీఘ్రశౌర్యం,బునగు ప్రహస్తుండు రావ♦ణుని యానతిగై
కొని సన్నాహము గావిం,చెను సేనను వత్వరముగ ♦ జృంభించ్చత్రిఁగ. ౫
చ. దనుజవరేణ్యు లంతఁ దముఁ ♦ దద్బలనాథుఁడు దొంపలింప సా
ధననికురుంబముల్ బహువి♦ధంబులుగాఁ జెలువార వానిఁ గై

1 తృతీయతిథియందు వజ్రదంష్ట్రుఁడు వచ్చెనని తిలకుభిప్రాయము. 2 ఏష శాస్తా చ
గోప్తా చ సేతా చ యుధిసమ్మతః, భూతికామశ్చ మే నిత్యం నిత్యంచ సమరప్రియః-అనియా. దీని
యర్థము యిటఁ దోఁచును, పద్యమందలి విశేషణములు కల్పితములు కావని యెఱుంగునది.

కొని భయదాక్షము లెవ్వలయఁ ♦ గ్రూరతరంబుగఁ జూడనొప్పి యా
యనికిఁ బ్రయాణ మైరి; తగ ♦ నంత నకంపనుఁ డెంతొ వేడుకన్. ౭ 2046

చ పెనురథ మెక్కి నీరదము ♦ పెంపునఁ గాయము పెద్దదాచు నొ
ప్పు నినద మబ్బమట్లు తగ ♦ భాసురహాటకకుండలంబులున్
దనర ఘనద్యుతిన్ వపుఫు ♦ తద్దయు నీటును గుల్కుచుండ భీ
తిని గలిగించు రాక్షసులు ♦ తెంపునఁ జుట్టును గొల్చి రాఁగ వే
చనియెఁ; గదల్పలేరు సుర♦సత్తము లే నతనిన్ రణంబునన్. ౮ 2047

క. *కనుకని యకంపనుండని, దనుజేంద్రున కతని కాఖ్య ♦ ధరవర్ధిల్లెన్
వనజాప్తుని భంగిఁగ నా, దనుజులయంతరమునందుఁ ♦ దా భాసిల్లెన్. ౯

చ. అతఁ డనిసేయఁగోరి జవ ♦ మారఁగ నందఱఁ గూడిపోవఁగా
నతనిరథంబు లాగెడు మ♦హాశ్వము లప్డు తటాలునన్ గనెన్
వితతముగాఁగ దైన్యమును ♦ విక్రమసంపద సంగరంబునన్
స్తుతిఁ గను నాయకంపనుని ♦ సుందరవామమహాక్షి యత్తఱిన్. ౧౦ 2049

తే. అదరసాగె; వివర్ణమై ♦ యాననంబు
కనఁబడియెఁ; గంఠరవము గ♦ద్గదముగాఁగ
నయ్యె; నంతకుమున్ను స్వ♦చ్ఛాకృతిఁ దగు
పగ లపుడు రూక్షవాతసం♦భరిత మయ్యె. ౧౧ 2050

క. మృగములు పక్షులు క్రూరం, బుగను భయంకరముగాఁగ ♦ బోరనఁ గూసెన్
మృగరాజునకుం బలె గొ,ప్పగఁ దగు మూఁపులును వ్యాఘ్ర♦పౌరుషమలరన్.

చ. విలసిలు నాయకంపనుఁడు ♦ భీమములై తగు నానిమిత్తముల్
పొలయుట కాత్మ భీతిలక ♦ పోయె రణస్థలి; కట్లు రాక్షసా
వలి గొలువంగ యుద్ధమున ♦ వాంఛను బూని చెలంగి పోవ వా
రల పెనునాద మట్టి వన♦రాశిఁ గలంచున టొప్పె నంతయున్. ౧౩ 2052

క. వనచరుల పెనుబలం బా, ధ్వనికిన్ మిక్కిలియు భీతి ♦ వడి వృక్షములన్
ఘనగిరుల నాయుధములుగఁ, గొని నిల్చెను ననినొనర్పు ♦ కోరిక నంతన్.

సీ. రామునిమిత్తము ♦ రావణుకొఱకును దమప్రాణముల వీడఁ ♦ దలఁచియున్న
వనచరదనుజుల♦కును మహారౌద్రమౌ సంగరం బప్పుడు ♦ జరగె; నంత
వారలెల్లను భూరి♦బలవంతులును శూరు లద్రిసంకాశులు ♦ నై చెలంగు
దురుగాన వార లొం♦డొరులఁ జంపఁదలంచి; రతిబలవంతులై ♦ యలరునట్టి

తే. యిరుదెగలవారు రణమందు ♦ నేపుమీఱఁ, జేయుసింహస్వనావళి♦చేతఁ గోప
మునఁ బరస్పరదర్శన♦మున నొనర్చు, గర్జనంబులఁ గల్గిన ♦ గాఢరవము. ౧౫

క. వినఁబడియెన్ భయదంబుగఁ, గన నెట్టిఁగ నున్నయట్టి ♦ త్క్ష్మారజము సురా

---

* అకంపన స్తత స్తేషా మాదిత్య ఇవ తేజసా-అనిమా.

రినికరకీశపదాహతి, జనితంబయి సర్వ దిగ్వి♦జములందుఁ గదురున్. ౧౮॥

తే. భీమముగ నిండెఁ; గొండొక ♦ భూమి ధూళి
తనుగు కౌశేయమట్లు సి♦తప్రభఁదగు
రజము వ్యాపించి యుండుటఁ ♦ బ్రధనమందు
వారలొండొరుఁ గనఁజాల ♦ రైరి మఱియు. ౧౯॥ 2056

క. అని దుమ్ముఁ గ్రమ్మఁగా వర్మనికరము పతాకలు ధ్వజ♦రాజితురగముల్
గనఁబడకుండెను శస్త్రము, లనూనగీతిం జెనంగు ♦ నాభటతతికిన్. ౨౦॥

క. ఆసంకులసమరంబున, నీసున నార్చుచును నొరుల ♦ నేపునఁ జంపం
గా సత్వర మభిముఖముగఁ, బో నుఱకట్టుచును వేగ ♦ పోవుచు మఱియున్.

ఆ. మారుకొనుచునుండు ♦ మానవపతిబల
దనుజవరునిబలవి♦తానమందు
భటుల నిస్వనంబె ♦ చటులంబుగా వినఁ
బడియెఁ దోఁప దంతు ♦ వస్తు వెదియు. ౨౧॥ 2059

చ. కనఁబడకుండఁ జీఁకటులు ♦ గ్రమ్మటచేఁ దమవారొ యన్యులో
యని తెలియంగ నేరకయె ♦ యాకపిరాక్షసు లట్టి క్రుద్ధులై
వనచరరాక్షసావళిని ♦ బాహుబలంబునఁ గొట్టసాగి; రా
దనుజులు వానరుల్ మఱియుఁ ♦ దార్కొని చీఁకటియందుఁ జెల్లుగన్. ౨౨॥

క. పరులను దమవారలనుం, బరిమార్చుచు నాధరిత్రిఁ ♦ బటుసారులు నె
త్తురుకాలువలం దడుపుచుఁ, జరణక్షోభములచే ర♦జంబుగఁ జేయన్. ౨౩॥

క. కనఁబడియె భయంకరముగ;, ఘనగతి రక్తంబు పాఱఁ♦గా రజమెల్లన్
గనియె నదృశ్యత; నంతట, నని జరిగెడి ధాత్రి శవస♦మాకుల మయ్యెన్.

సీ. హరులును దానవుల్ ♦ తరువుల శక్తుల శిలలఁ బ్రాసముల గ♦దలను బరిఘ
ములఁ దోమరంబులఁ ♦ జెలఁగువిక్రమముల నన్యోన్యమును గెల్చు♦వాసలూని
ప్రహరించుకొనుచు బ♦వరము నొనర్చిరి పర్వతాకారులు ♦ భయదకర్ము
లగువానరులు పరి♦ఘాకారములగు బాహువులతోఁ జెనఁగుచు♦నొగిదనుజుల

తే. యమునిప్రోలికిఁ బంపి; రా♦యసురు లట్టి
క్రుద్ధులై ప్రాసతోమర♦కూటపాణు
లగుచు దారుణశస్త్రప్ర♦హారములను
గపులఁ జంపిరి కడఁక న♦క్కదనమందు. ౨౬॥ 2063

చ. దనుజచమూవిభుండగుచు ♦ దారుణవిక్రము డొప్పు నాయకం
పనుఁడు మహోగ్రహంబున సు♦పర్వభయంకరవిక్రమంబులన్
దనుజులు వానరావళిని ♦ దార్కొని చంపఁగఁ జూచి గారవిం
చెను; నవుడాకపీశ్వరులు ♦ చెచ్చెఱవైరులహాని పూన్కితోన్. ౨౭ 2064

చ. దనుజులచేతియాయుధవి♦తానము వీర్యము పొంగ లాగికొం
చును ఘనవృక్షముల్ వయిచి ♦ చూర్ణము సేయుచు జాలరువ్వుచున్
దనువులు ముద్దసేయుచును ♦ దారుణయుద్ధ మొనర్చి; రింతలో
వనచరవీరులై ప్రకట♦బాహుబలంబుల నొప్పువారలై. ౩౦ 2065

ఆ. అలరుచున్న కుముద♦నలులు మైందద్వివి,దులును గోప మడర ♦ ధూర్తదనుజ
వితతిపైకిఁ బొంగు♦వేడ్కలఁ బోయిరి; జవము లొప్పు ప్లవగ♦సైన్యపు లిటు.

క. సురరిపుసేనాముఖమున, కరిగి విలాసములతో మ♦హావృక్షములన్
దుర మొనరించుచు నానలు,వ్వురు దనుజుల గుంపులుగను ♦ బొరిపుచ్చి రటన్.

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౫౬ - వ సర్గము.

హనుమంతుఁ డకంపనుని జంపుట

తే. ఆయకంపనుఁ డావాన♦గాధినాథు, లట్లుచేసిన గొప్పకా♦ర్యమును గాంచి
యుద్ధమునఁదీవ్రకోపంబు♦నొందెనతఁడు, వైరికృతకార్యజనితతీ♦వ్రతరరుషను.

క. తనమేను దెలియకపుడే, ధనువ్వుఁ బలుమాఱు మీటి ♦ తనసారథికి
ట్లనియెను; బెక్కుకపీంద్రులు, మనదనుజులఁ బెక్కుమంది♦మార్కొనియనిలోన్.

క. పరలోకంబున కిప్పుడె, యరుగంగాఁ జేయుచుండ ♦ నగపడెడుఁగదా
త్వరగా నాస్థలి కేరున, యరదము పోనిమ్ము త్వరగ ♦ నల్లదె కంటే ౩ 2070

క. నాయెదుట సారథీ! గురు, కాయులు బలయుతులు కపులుః ♦ త్వరుహాగిరుతే
యాయుధములుగాఁ గైకొని, యే యలరుచునున్నవార ♦ లెంతయుఁగడఁకన్.

క. అని వినుతింగాంచిన యా, వనచరుల వధింపఁగోరు♦వాఁడను వారే
దనుజబలంబుల నంతం,బును బొందం జేయువారు ♦ పో తలపోయన్. ౫

చ. అని రథికోత్తముం డయిన♦సూట్టి యకంపనుఁ డప్డు వేగమొ
ప్ప నరుగుఘోటకంబులను ♦ బాగుగఁ బూన్చిన యారథంబు న
వ్వనచరు లున్నతావునకు ♦ వైళమ తోలఁగఁ బంచి క్రుద్ధుఁడై
సునిశితబాణజాలముల ♦ స్రుక్కఁగఁజేసె బలంబు పొంగఁగన్. ౬ 2073

క. *దనుజోత్తము కట్టెదుటన్, వనచరులు రణంబున నిలు♦వఁగఁ జాలరనం
గ నిఁకన్ మార్కొనరని చె,ప్పనేల? తద్బాణవితతి ♦ భగ్నబలులునై. ౭

క. పరుగెత్తి రంత అంతట;, మరుదాత్మజుఁ డురుబలుండు ♦ మానుగ వారిన్
బరునికిఁ జిక్కి మృతింగను, తరుణంబున నున్నవారిఁ ♦ దనబంధువులన్. ౮

క. కని వానిచెంత కేగెను;, వనచరయూథపులు వీర్య♦వంతులు ననికిన్

---

* కిం పున రోద్ధు మాహవే-అనియూ.

యూరువుల వేగమున కట ♦ నున్న ద్రుమము
లవనిఁ బడఁ గాళ్లఁద్రొక్కుళ్ల ♦ నవనిఁ బగుల. ౨౨ 2089

చ. అరులను జేరి ధీవిభవ ♦ మర్మి బలంబును గల్గునాతఁ డా
తరువున హస్తిసంతతిని ♦ దానిపయిందగువారి, స్యందనో
త్కరమును నందుఁ గ్రాలు రథి♦కవ్రజముల్ మఱియుల్ బదాతులన్
బోరిఁగొనెఁ; గ్రుద్ధసంయమని ♦ పోలిక నాతఁడు రాక్షసావళిన్. ౨౩ 2090

క. అనిమొనఁ జంపుచునుండం, గని యాతనిఁ జూచి యసుర♦కాండము పెనుభీ
తిని బాఱె; వీరుఁడగునా,దనుజుఁ డకంపనుఁడు పవన♦తనయుల్ శూరుల్.

క. దనుజభయావహుఁ గ్రోధం,బునఁ బైఁబడవచ్చువానిఁ ♦ బోలంగని సిం
హనినాదముఁ గావించెను, బెనుకోపం బడర; నంత ♦ వీర్యము పొంగన్. ౨౫

క. సునిశితతనుభేదనచణ, ఘనబాణచతుర్దశకముఁ ♦ గైకొనుచు నకం
పనుఁ డాగురువీర్యునిఁ బా,వని నొప్పించెను ధనుర్వి♦భవ మలరారన్. ౨౬

సీ. వీరుఁడౌ పావని ♦ వివిధబాణంబులు వర్షంబు తెఱఁగున ♦ వపువునందు
నాటఁగా వృక్షసం♦తతు లట్లు మొలిచినఁ గనఁబడు శిఖరీంద్రు♦కరణిఁ గానఁ
బడియెను; దీర్ఘకా♦యుఁడు మహావీర్యుండు ధైర్యశాలియునగు ♦ తపనసూను
సచివుండు హనుమ యా♦శరముల తాఁకునఁ బూచినట్టి యశోక♦భూజ మట్లు

తే. లరుణవర్ణుండు పొగలేని ♦ యగ్నికరణి, విమలతేజుండునై యప్డు ♦ వెల్గి; వేగ
మశోకవృక్షంబుఁ బెకలించి ♦ నెఱిదనుజుని,శిరముపగులంగ మోఁదెను♦జిత్రరీతి.

చ. దనుజవరుం డకంపనుఁడు ♦ దారుణకోపము నొంది యావరు
త్తనయుఁడు దివ్యచిత్తుఁ డిటు ♦ ధాత్రిరుహంబునఁ దన్నుఁ గొట్ట ను
ర్వినిబడి యప్పుడే యముని ♦ వీటికిఁ బోయెను; నిట్లు లాతఁ డా
యనిఁబడఁ గాంచి దానవులు ♦ నార్తిని దానవనాథు నెంచుచున్. ౩౦

క. క్షితి కంపంబున ద్రుమసం,తతులెల్లం గదలునటు వ్య♦థం బొందిరి; దు
ర్మతు లారాక్షసులు పరా,జితులై వనచరులు తఱుమఁ ♦ జెందినభీతిన్. ౩౧

ఆ. ఆయుధముల నెల్ల ♦ నందందె పడవైచి, పరుగువాఱి రాత్మ♦పత్తనమున;
కట్లుదనుజులపజ♦యమునొందితలవెండ్రు,కలొగి విరియఁబాఱఁ♦గఁదడఁబడుచు.

క. తనువులు స్వేదమయమ్ములు, గను జూపట్టంగ స్వీయ♦గౌరవ మెటకో
చన నూర్పులు విడుచుచుజవ,మునఁ బాఱిరి; మఱియువిజయ♦మునుబొందమికిన్.

తే. వగలఁ బొగులుచు మూఢులై ♦ తగఁ బరస్ప
రంబు బ్రహరించుకొనుచు భ♦యంబునఁ బలు
మాఱు వెనుకటిదిక్కును ♦ దేఱిచూచు
చును బురంబును జొచ్చిరి; ♦ దనుజు లట్లు. ౩౭ 2099

క. పురమున కరిగిన పిమ్మట, హరివీరులు ప్రబలులెల్ల ♦ నందాకచోటన్

సరిగాఁ జేరి మరుత్సుతుఁ, బరమవిధిఁ బూజసల్పి ♦ యలరిరి పిదపన్. ౩౫

క. బలశాలి హనుమ చిత్తం, బలరఁగ మీాసాయమున జ♦యంబు బది నాకుం
గలిగె నది వేఱుగా నను, పలుకులఁ దగినట్లు బదుల ♦ పలుకుచు వారిన్.

ఆ. గారవించి విజయ♦కలితు లావానరుల్, తనుబలంబుకొలఁది ♦ నసురవీర
చావు తేటపడఁగ ♦ సమధికనాదముల్, చేసి రాఘవునకు ♦ గాసిఁ జెంది. ౩౬

క. బలవంతులైన యాదనుజులు గూడఁ దపించి, గరళ♦సమానుఁ డనుగూలం
దలపడి చంపి భయంకరు, నలఘుపరాక్రముని దనుగ♦నాంతకు దనుజున్. ౩౭

క. అనిఁ జంపిన శ్రీవిష్ణువు, ననువున సేనాముఖంబు♦నందు సమరశూ
రిని జంపి వీరశోభం, గని యెంతయు వెలయుచుండెఁ ♦ గపిఁ దేజమునన్. ౩౮

చ. అనిలతనూజు నంబరము♦నందు వసించిన దేవతల్ ముదం
బునఁ గొనియాడి; రంత రఘు♦పుంగవుఁ డాబలశాలి లక్ష్మణుం
డనఘుఁడు నావిభీషణుఁడు ♦ నర్కసుతుండును గోనపుంగవ స
ర్వవనచరు లందఱుం బొగడి ♦ వర్ధిలఁ జేసిరి గౌరవంబునన్. ౩౯ 2105

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౫౭ - వ సర్గము.

—ప్రహస్తుని యుద్ధము.—

చ. అమరవిరోధినాథుఁడగు ♦ నాదశకంఠుఁ డకంపనుండు యు
ద్ధమున వధింపఁగాఁ బడుటఁ ♦ దా విని క్రోధము నొంది మోముదై
న్యము నిసుమంతఁ గాంచఁ దన♦యుండలి ప్రీతి చెలంగ నుగ్రబు
ద్ధినుహితులైన మంత్రులను ♦ దెప్పునఁ జూచెను శాంతినొందుచున్. ౧ 2106

క. దనుజేంద్రుఁ డంత నెమ్మన,మున కొంతకాలము విచారి♦మునఁ బుగ్రముగాఁ
గను సచివులతో నాలోచన సేసిన పిదప మంత్రి♦సంయుతుఁ డగుచున్. ౧౪

తే. పగటిపూర్వార్ధమున లేచి ♦ బలముల నెలు
వ్యూహములుగా నమర్చిరో ♦ యొప్పమీాఱ
నావిధముఁ జూచుటకుఁ బురి♦యందుఁ గలయఁ
దిరిగె, నాతఁడు రక్షోవి♦సరము లెల్ల. ౨౪ 2108

క. తనురక్షింపఁగ నొప్పుచు, ఘనసేనావ్యూహనివహ♦కలితం బగుచున్
గనదురుపతాకలును ధ్వజ, వినిచయములు మిగులఁ గాంచె♦ మెఱయు నగరమున్.

మ. కని రక్షోవిభుఁ డంత వానరులు లం♦కాపత్తనం బెల్లఁ ద
క్కనిరీతుల్ దగ నావరించుటను బిం♦కం బొప్పఁ గాఁ జూచి యా
పుని కావంతయు నోర్వ కియ్య దిటులో♦ప్పం జేయఁగా నోపటం
చును సిద్ధాంతము సేయువేళను బ్రహ♦స్తుఁడా యుద్ధవిద్యావిదుఁడ్. ౪౪ 2110

క. కని యిట్లను సంగరవిధ,మునఁ బండితుఁ డనఁగ నీవె ♦ ముఖ్యుఁడు లగుచున్
మనపగఱసేన లీపుర,మును నాకస్మికముగాఁగ ♦ ముట్టడిసలుపన్. ౫౪ 2111
క. దానిన్ విడిపింపఁగ రిపు,సేనలు పీడింపుచుండఁ ♦ జెచ్చెఱ దానిన్
మానునటు సేయు యుద్ధము, మానిన నన్యగతి నాదు ♦ మదిఁ దోఁపదునూ!.
క. నిను విడిచిన వేఱొకఁడి,పని దీర్చునటంచుఁ జెప్ప ♦ బాగౌనే; యీ
యనుపమకార్యభరంబున,కు నేను నాతమ్ముఁడైన ♦ కుంభశ్రవుఁడున్. ౬
తే. నాదు సేనాధిపతి వీవు ♦ నాతనూజుఁ
డైన యాయింద్రజిత్తు, మ♦హాబలుఁడగు
నానికుంభుఁడు తగుదుము ♦ గాని యొరులు
మోయఁగాఁ జాల రీభార♦మును దలంప. ౬౪ 2114
చ. కనుకనె నీవు సైన్యములఁ ♦ గ్రన్ననఁ జేకొని నీదునానతిం
గొని తిరుగంగ నాజ్ఞ యిడి ♦ కోఁతులు పెంపుననుండుచోటికిం
జని గెలుపొంది రాఁదగును; ♦ సంగర మీవటఁ జేయనేల? చ
య్యన నని సేయఁగా వెడలి♦నంతన చాలును గార్యసిద్ధియౌ. ౭ 2115
క. వనచరు లెంతయుఁ జపలులు, దనుజుల సింహధ్వనులనుఁ ♦ దారు వినినయం
తనె భీతిఁ బాఱి పోఁగల, రని సేయఁగ శిక్షనొంద ♦ నట్టివనచరుల్. ౭౪ 2116
క. అనయంబుఁ జంచలాత్ములు, కనుకన్ హరినాదము విని ♦ కరులు నిలువఁజా
లనియట్లు నీదు సింహ,ధ్వనివిని సైరింప వారు ♦ తగ రించుకయున్. ౮౪ 2117
క. దనుజోత్తమా! ప్రహస్తా, వనచరబల మట్లు భీతిఁ ♦ బరుగిడ రాముం
డును లక్ష్మణుతోడం బ్రభు, తను మానుచుఁ దన్వశంబు♦తా నొందుఁజుమీ.
[1]క. అనిమొన మనకుం గూడం, గనఁ గూడును హాని యట్లు♦గావున నద్దా
నిని జేయకుండుటే మే,లని పల్కెద వేమొ బవర ♦ మాపితి మేనిన్. ౧౦౪
[2]. సీ మనశత్రువులు యుద్ధ♦మును మాన రటుగాన మనకు నవార్యవ♦లన మరణము
కలుగుట నిజము, సం♦గర మొనరించినఁ బంచత గల్గునో ♦ మించువిజయ
మే కల్గునో నిశ్చ♦యింప సాధ్యముగాదు కావున మరణంబు ♦ కల్గుట యన
సందేహమే, యిట్లు ♦ జన్య మొనర్పక మానినరిపులచే ♦ మనకు విగత
తే. సంశయంబుగఁ గల్గెడు ♦ చావుకంటె
నని నొనర్చినచో సంశ♦యముగఁ గల్గు
మృతియె శ్రేయము కాన న♦ట్లేని మాని
యుంటకన్న శ్రేయంబగు ♦ యుద్ధ మిపుడు. ౧౧ 2120

---

1 నను యుద్ధే ఇత్యాది వ్యాఖ్య కిదిపద్యమని తెలియఁదగు 2 ఆపత్సంశయితా శ్రేయో నతు నిస్సంశయీకృతా-అనియూ. ఈశ్లోకార్ధభాగమునను వ్యాఖ్యాతలు వ్రాసినయర్థ మెల్ల నీసీసపద్యమునఁ జేర్పఁబడినదని గ్రహింపఁదగు.

క. దనుజులలో మేటులఁ జక్కనివిధమునఁ గూర్చి యుద్ధ♦కర్మంబున కా
యత్తన సంసిద్ధ మొనర్చిరి;, గన నవు డానగరమెల్లఁ ♦ గజయుతమువలెన్.

క. ఖరతరనానాయుధముల, ధరియించిన దనుజవీర♦తతిచే నిండెన్
దరుణమునం దప్పుడు కర్బురు లెల్లను వహ్నియందుఁ ♦ బూనిక మెఱయన్.

సీ. శాంతిహోమంబులఁ ♦ జక్కఁగాఁ జేయుటవలనను బ్రాహ్మణ♦వరుల గంధ
పుష్పాళిచే భక్తిఁ ♦ బూజించుటవలన నచ్చటిపవమానుఁ ♦ డాజ్యగంధ
సంయుక్తుఁడై పుష్ప♦సౌరభ యుతుఁడయి వీచె నప్పుడు చాల♦విజయమంత్ర
వరముల మంత్రింపఁ♦బడిన నానావిధపుష్పహారముల ను♦బ్బున రణంబు

తే. సేయ నుద్ధతులయియున్న ♦ జృంభదసుర
వరులు కైకొని దాల్చిరి ♦ సురవిరోధు
లంతఁ గత్తళములఁ దాల్చి ♦ యతులచాప
ములను గరములఁబట్టి యు♦జ్జ్వలగతులను ౨౩॥ 2133

చ. జవమున వచ్చి రావణుని ♦ సన్నిధిఁజేరి నమస్కరించి సై
న్యవిభుని నాప్రహస్తుని మ♦నంబుల నొప్పెడు భక్తిఁగొల్చి; రం
త విభునియాజ్ఞఁ గొంచు భట♦నాయకుఁ డప్పుడె భీమభేరికా
రవము నిగుడ్పఁజేసి రుచి♦రాజితశస్త్రము లొప్పుచుండఁగన్. ౨౪ 2134

తే. అతిమనోహరమై యొప్పు ♦ నరదమెక్క
స్యందనం బది జవనాశ్వ♦సహితమగుచు
శక్తియుతుఁడైన సారథి ♦ చక్కఁదోల
జలదగర్జనతుల్యని♦స్వనము పొలయు. ౨౫॥ 2135

చ. సరసిజవైరిమాడ్కిఁ గడు♦సంతస మిచ్చుచు నూర్యరీతిఁ దే
జరిలుచు, నేమియుం జెనక♦సాధ్యముకాని ఫణిధ్వజంబుచేఁ
బరఁగుచు మంచికప్పునను ♦ భాసిలుచున్ వరచక్రముల్ తగన్
నిరుపమభర్మజాలక వి♦నిర్మితిఁ గమ్రమునై స్వకాంతులన్
ధరఁగలనన్యవస్తువులఁ ♦ దాఁ బరిహాసము సేయునట్టులై. ౨౬ 2136

క. తనరఁగ నారథవర్యంబును నెక్కుచుఁ దమిని దనుజ♦భూపతి యాజ్ఞం
గొని పెనుసేనలు వెంటం, జనుదేరఁ బురంబునుండి ♦ సరగ వెడలెఁ దాన్.

క. భటనాథుఁ డిట్లు వెడలఁగఁ, బటుభేరీధ్వనులు వివిధ♦వాద్యధ్వనులుం
జటులతరశంఖరవములు, తటుకున ఘనగర్జనము వి♦ధంబునఁ బెలుచన్. ౨౭

*క. వననిధిఁ బొంగంజేసెడు, ననువున వినఁబడియె; భీక♦రాకారులు భీ
తిని నిచ్చరూపములు తగు,దనుజులు భయదారవముల ♦ దర్పముపొంగన్.

---

* పూరయ న్నివసాగరమ్-అనియూ.

తే. గాంచి నానాయుధముల ధ♦రించి ప్లవగ
బలము లనిసేయసిద్ధమై ♦ నిలిచె; నంత
వనచరులు పాదపాయుధములకై ♦ ఘనతరువులఁ
బెనుశిలలఁబట్టి లాగుట ♦ వితతరీతి. ౫౨ 2151

క. గురుతరమై తుములధ్వని, పరఁగెఁ; రాక్షసులు మిగుల ♦ భయదంబుగ సం
గరరంగమునం దార్వఁగ, హరివీరులు బొబ్బలిడఁగ ♦ నాయిరుదెగలున్. ౫౩

క. ప్రముదమ్ముగ నుండెను; వేగము గల్గి సముద్ధులగుచుఁ ♦ గలహమునఁ బరుల్
సమయము దొరకినఁ జంపంగ మదిఁబరస్పరముమిగులఁ♦గాంక్షఁ జెలఁగుచున్.

క. ఒండొరులను బిల్చుచు నుద్దండభుజావిక్రమముల ♦ దైవాఱెడు నా
చండాసురవానరుల యఖండధ్వని మిగుల రేఁగి ♦ కడువ్యాపించెన్. ౫౪

చ. కుమతి ప్రహస్తుఁడంతఁ దన♦కోర్కి జయింపఁగ నుండ వానరేం
ద్రమహితసేనఁ గూర్చి చని ♦ తామృతి నొందఁగఁ గోరి యగ్నిహో
త్రము శలభంబు చొచ్చెడువి♦ధంబునఁ బైపయి వేగమొప్ప యు
ద్ధమునకు వచ్చునాభటవి♦తానముఁ జొచ్చె నదృష్టహీనతన్. ౫౫ 2155

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౮ - వ సర్గము.

నీలుఁడు ప్రహస్తునిఁ బొలియించుట

క. [1]తరువాత నరిందముఁడగు, సరసిజబాంధవకులుండు ♦ జన్యములకు భీ
కరవిక్రముఁడు ప్రహస్తుం, డరుదెంచుట హితులవలన ♦ నాత్మఁ దెలియుటన్.

మ. బలవంతుండగు వైరిసిం గనుటచేఁ ♦ బల్గాఱు వక్త్రంబునం
దెల నవ్వొప్ప విభీషణుం గనుచు ని♦ట్లీరీతి దీర్ఘాకృతిన్
బలవీర్యంబులఁ బొల్చువాఁడనుచుఁ దోఁ♦పంజేయు వీఁడెవ్వఁడో
తెలియం జెప్పు మహాబలాన్వితుని నో♦ధీమద్వరా! [2]దోర్వరా!. ౧ 2157

చ. అనఁగ విభీషణుండు మను♦జాధిపువాక్కుల నాలకించి యి
ట్లనియెను; రాక్షసుం డితఁ డ♦హార్యబలుండగు రాక్షసేంద్రుసై
న్యనిచయనాయకుండగు ప్ర♦హస్తుఁడు లంకఁ జెలంగుసేనయం

---

1 తతః ప్రహస్తం నిర్యాంతం దృష్ట్వా భీమపరాక్రమమ్, ఉవాచ సస్మితం రామో విభీషణ మరిందమః-అనిమూ. ప్రహస్తః పూర్వద్వారా న్నిర్గతః, రామ స్తూత్తరద్వారి తిష్ఠతిస్మ, కథ మస్యానేకయోజనస్థపాక్షాత్కారః ఉచ్యతే,అ స్తసచనేన ప్రత్యక్షతుల్యేన-అనివ్యాఖ్య. దీనిననుస రించియే, హితులవలన నాత్మఁ దెలియుటన్-అని చెప్పఁబడినదని యూహింగి మన్నింపవలయు. 2 దోర్వరా=మహాభుజుఁడా యని యర్థము.

దు నితనిచెంతనుండుఁ జుము ♦ తోరపువేడ్కఁ బృథివనుభాగ మీ
దనుజుఁడు దోర్బలాఢ్యుఁడు ని♦తాంతము సత్త్వనిధుండు సూనుఁడుర్. ౩౫

సీ. విక్రమంబునఁ జాల♦విఖ్యాతిఁ గనినవాఁ డనియెను; మిగుల బ♦లాఢ్యమగుచు
నధికరోషము మదు♦లఁను మిక్కిలిగాఁగనా హ్వానునిఁ గాంచి♦యార్చుచున్న
యావానరబలంబు ♦ లతిభయంకరరూపుఁ డతిభీమవిక్రముఁ ♦ డతితరాంగుఁ
డునగు నా భటనాథుఁ♦డు పెనుసైన్యముఁగూడి యార్చుచురాఁగనే♦నంతజయ
గాంక్షించి వానర♦గణములపైఁబడుచున్నగాతనుఁ లప్పు ♦ వొప్పుమీరఁ బ్రముఁ

తే. *దాల్చియున్న ఖడ్గంబు లు♦దారశక్తు
లష్టిబాణశూలంబులు ♦ నష్టి ముసల
గదలుఁ బరిఘంబులుం బ్రాస♦గణము బహువి
ధంబులైన పరశ్వథ♦ధనువులెల్ల. ౩౬ 2159

క. తనరారుచుండె నంతయు;, వనచరవర్యులును యుద్ధ♦వాంఛలఁ బుష్పిం
చినతరువుల దీర్ఘములగు, పెనుశిలలను జుట్టుకొనుచుఁ ♦ బ్రీతిచెలంగన్. ౩౭

క. అని నిల్చిరట్లు వానర, దనుజులు పెక్కండ్రు స్పృశుల♦దర్పంబున మై
కొనువాంఛఁ బరస్పరమును, ఘనశరపాషాణవృష్టిఁ ♦ గల్పించు చొగిన్. ౩౮

క. పెనఁగుచునుండంగా న, య్యని ఘోరతరంబుగాఁగ ♦ నటఁ జూపట్టెన్;
దనుజులు పెక్కురు యుద్ధం, బున వానరయూథపతులఁ ♦ బొలియించిరొగిన్.

క. వనచరులను బౌరుషమున, దనుజులఁ బెక్కండ్రు యమునిఁ♦దర్శనమునకున్
బనిచిరి; రాక్షసులంతట, వనచరులం దాఁకి బలము ♦ వర్ధిలుచుండన్. ౪౦

సీ. శూలంబులం గ్రుమ్మి ♦ సొరిదిఁ గొందఱఁ జంపి రింకను గొందఱ♦నేచి చక్ర
ముల వధించిరి కీశ♦ముఖ్యులఁ గొందఱఁ బరిఘంబులం బూని♦మరణమొందఁ
జేసిరి కొందఱ ♦ ఛేదించిరి పరశ్వథంబులఁ గొంద ఱు♦న్నామశూల
ముఖసాధనంబుల ♦ మోములు పగులంగ దనువులఁ గోసిరి ♦ వెస ధరణిని
గొందఱు వనచరుల్ ♦ గూలిరి; కొందఱు శరముల దెబ్బల♦దండ మొప్పఁ

ఆ. దనువులందుఁ జెనఁగ ♦ దారుణరీతిగ, ఛిన్నహృదయులగుచుఁ ♦ జెన్నుమాని
చచ్చి రింకఁగొంద ♦ ఱుచ్ఛృఖ్ఖలముల ద్వి,ధాకృతాంగులగుచు♦ధరణిఁ బడిరి.

క. వనచరు లింకంగొందఱు, దనుజులు పార్శ్వమ్ములందు ♦ దారుణశూలా
ళిని జీల్ప మరణమొందిరి;, వనచరు లతికోపులగుచు ♦ బాహుబలములన్.

క. నలుఁగడలం దిరుగుచు దను,జులఁ బ్రోగుగఁజేసి యార్చి ♦ త్రోణిజతతిన్
బలుకొండశిఖరములచే, నిలఁ గూల్చిరి మోఁది మోఁది ♦ రోదినవృన్కిన్.

తే. వజ్రములరీతిఁ దాఁకు ని♦ర్భరకరములఁ
గరతలంబులఁ బిడికిళ్లఁ ♦ గడఁగి పొడువఁ

* ఖడ్గశక్త్యష్టిబాణాశ్చ-అనియూ. అష్టియనునది యొకానొక యాయుధము.

బలితదశనేత్రులయి యు♦ద్ధతదనుజులు
నోట నల్లను గ్రక్కుచు ♦ నొచ్చినొచ్చి. ౧౬ 2167

క. ధరణిఁ బడి; రంత నాసం, గరమునఁ గపిదనుజులెల్లఁ ♦ గడునొచ్చిన యా
తరుణమున నార్తరవములఁ, గరము జయంబలర సింహ♦గర్జనములనున్.  ౧౭

క. ఒనరించుచుండి రయ్యా, ధ్వను లెల్లం దుములములుగ♦ధరణిఁ బరఁగె; నా
దనుజులు కపులును గోపం, బున నిక్కుచు ఘోరసమర♦మున నేర్పుతగన్.

క. కనులం ద్రిప్పుచు భయమును, గన కతికోపులయి యుద్ధ♦కార్యంబులఁ దా
రొనరిచి; రంత నరాంతక, దనుజుండును గుంభహనుఁడు ♦ దర్పము పొంగన్.

తే. నైజదర్పముగల మహా♦నాదుఁ డాన
మున్నతుండు ననందగు ♦ చున్నవీరు
లాప్రహస్తునిమంత్రు, లా ♦ హరిబలములఁ
జంపి రెంతయుఁ బూన్కి ని♦ష్కరుణులగుచు. ౧౯ 2171

చ. నలువురు వారు వేగము ఘ♦నంబగు దర్పముపొంగఁ దాఁకచున్
విలయము వానరావళికి ♦ వే సమకూర్చుచు నొప్పియుంట ని
మ్ముల ద్వివిదుండు గాంచి బల♦మున్ గరువంబును భీషణంబుగా
వెలయ నరాంతకాఖ్యుఁడగు ♦ వీరుని నొక్కని దాఁకి యుద్ధతిన్. ౨౦ 2172

క. ధరశిఖరంబున మోఁదుచు, మరణము బొందించె; రిపువి♦మర్దనచణుఁడై
కరలాఘవమున మెఱసెడు, హరిపతి దుర్ముఖుఁడు గొప్ప ♦ యవనీరుహమున్.

క. కరములఁ బెకల్చి మార్కొని, సురవైరిసమున్నతుఁడును ♦ శూరుని జముమం
దిరమున కనిపెను; దేజ, స్స్ఫురితుఁడు వేగముననలరు ♦ శూరుఁడుఘనుఁడున్.

క. వనచరతల్లజుఁడునునౌ, వనధిగభీరుండు జాంబ♦వంతుఁడు కోపం
బున రేఁగి మహానాదుని, ఘనవక్షముఁ బెద్దశిలను ♦ గరము పగుల్చెన్. ౨౨

క. తారుం డంతట గురుధర, ణీరుహమునఁ గుంభహనుల ♦ నిర్భరబలు దు
ర్వారబలున్ మార్కొని శిర, మారసి మోఁదంగ నని గ♦తాసుం డయ్యెన్.

చ. అరదముమీఁదనుండిన ప్ర♦హస్తుఁడు తద్విధమెల్లఁ గాంచి స
త్వరముగఁ జాపవర్యమును ♦ దాల్చి యనూయను వానరాళితోఁ
గరము దురం బొనర్చె నతి♦గాఢముగా; బలయుగ్మమందు నొ
క్కరివయి నొక్కరుండు వడి♦గాఁబడి మార్కొని పోరుచుండఁగన్. ౨౩ 2177

క. ఆవర్తమువలెఁ గన్పడు, నావరయుద్ధంబునందు ♦ నారయ నిది యిం
తౌ వర్ణింపఁగ ననఁగా, నేవిధమునఁ దగని కడలి ♦ యేపుమెఱయఁగన్. ౨౪

క. ఉప్పొంగునపుడు కల్గెడు, చప్పుడువలె సిస్వనంబు ♦ సైన్యయుగమునం
దప్పుడు గల్గెఁ బ్రహస్తుం, డుప్పతిలెడు కౌతుకమున ♦ నొప్పుచు నంతన్. ౨౫

క. విలుకాండ్ర మేటివై తగు, బలాధిపతి యంతఁ గడఁది♦బవరంబున నా
బలువింటి లాగు పటుశర,ముల ముంచెను నీలు; బాణ♦ము లవి బుజువులై.

క. చాలఁగఁ గోపించిన పెను, వ్యాళంబులఁ బోలి పటుజ♦వంబున నరిగా
నీలుని దాఁకి మహోద్ధతి, నేలం దగఁ జొచ్చె మేన ♦ నిల్వక యంతన్. ౩౮

చ. ఘనతరవీర్యశాలి కపి♦కాంతుఁడు నీలుఁడు వీతిహోత్రుఁడో
యనునటు మండుచున్నవిశి♦ఖావళి తాఁకిన నాగ్రహించి చ
య్యన నొకవృక్షముం బెఱికి ♦ యట్టె తనున్ వధియింపవచ్చు నా
దనుజుని దుష్ప్రధర్షుని ని♦తాంతబలంబునఁ గొట్టె నుద్ధతిన్. ౩౯ 2192

క. దనుజేంద్రుఁ డాప్రహస్తుఁడు, వనచరపతిసంప్రయుక్త♦వరతరుహతుఁడై
మనమునఁ గోపంబందుచు, నినదం బడరంగఁ బ్లవగ♦నికరేశ్వరుపై. ౪౦ 2193

క. శరవర్షము గురియించెను;, దరుచరవీరుండు ప్రబల♦దర్పుఁడు నీలుం
డగివైచు ఘోరబాణో,త్కరమును వారింప శక్తి♦గల్గమి నంతన్. ౪౧ 2194

క. కనుయుగము మూసికొని యో,ర్పునఁ నుండెను;వృషభరాజు♦పూనిక వేగం
బున వచ్చి తగ్గు శరదృతు,వున నొప్పెడు వృష్టినోర్చు ♦ పోలికమెఱయన్.

క. దనుజప్రహితదురాసద, ఘనశరభయకృత్సువృష్టిఁ ♦ గనులఁ దెఱవ కొ
య్యన నోర్చియుండె; నీలుం, డనుపమబలుఁ డొట నోర్వ ♦ కాశరహతికిన్.

చ. మనమునఁ గోపమూని యొక♦త్సారుహవర్యముచే మనోజవం
బునఁ బరుగెత్తి నాదనుజ♦పుంగవుగుఱ్ఱములన్ వధించె; నం
త నతఁడు భూరిబాహుబల♦దర్పసముగ్రుఁడు గాన వేగమా
దనుజునిచాప ముద్ధతిని ♦ దాఁగొని రెండుగఁ ద్రుంచివైచుచున్. ౪౪ 2197

తే. సింహనాదంబుఁ బల్మఱు ♦ సేసె; నంత
దనుజసేనాధిపతి తన♦ధనువు విఱుగ
దారుణంబగు ముసలాయు♦ధమును దాల్చి
యరదముననుండి దుమికె న♦త్యాగ్రహమున. ౪౫ 2198

*సీ. వేగంబునం దగి ♦ విపులబలంబున సింహశార్దూలముల్ ♦ చెలఁగునట్లు
సింహశార్దూలవి♦చేష్టితంబుల నొప్పి విక్రాంతసంతత♦విజయులగుచు
నని వెనుదీయక ♦ యమరేంద్రవృత్రాసురాభులై వీరులై ♦ యలరుచున్న
బలపతు లిర్వురుఁ ♦ బలువిధంబుల జాతవైరులై రక్తమ♦వ్వారిగాఁగ

తే. నవయవంబులఁ దడుపంగ ♦ నట్టిమత్త
కరులపోలిక మార్కొని ♦ కఠినదంష్ట్ర
లను గడుం గాయములుపడఁ♦గను బలుమఱు
నొరయుచుం గీర్తిఁ బొందెడు ♦ నూహలొప్ప. ౪౬ 2199

---

* సింహశార్దూలసదృశౌ సింహశార్దూలచేష్టితౌ-అనిమూ.

క. తలపడి పోరుచునుండిరి;, బలమున నుద్యుక్తిఁ దగుచు ♦ బవగమ్మున ని
మ్ముల నాదనుజోత్తముఁడు ము,సలమును గొని కపిలలాట♦సరణి నడంచెన్.

క. దానన్ స్రవించె రక్తము, వానరవరుఁ డంత రక్త♦దిగ్ధప్లుతమై
మేను తగంగాఁ గోపముఁ, బూని మహాతరువుఁ గైకొ♦బూని బలమునన్. ౯౦

క. అరివక్షంబున వైచెను;, సురవైరియు నరకుగొనక ♦ సొంపిత నాభీ
కరముసలంబునుగొని యా, హరివీరునిపైకిఁ బాపె ♦ నధికబలమునన్. ౯౧

*క. తరువాత మహావేగుఁడు, హరివీరుఁడు నీలుఁ డుగ్ర♦నాగు వేగమునన్
బరుగెత్తివచ్చి వధియిం,చురతిం దగునా ప్రహస్తు ♦ సొంపునఁ గనుచున్. ౯౨

క. పెనుశిల నొకదానిం గొని,యెను;మతియును యుద్ధకాంక్ష♦యెంతయుఁ దగ నే
పున ముసలంబును గైకొని, యనిచేయుచుఁ దన్నుఁ జంప ♦ నమరెంచు నరిన్.

క. కని వేగమ యాపెనుశిల, దనుజుని తలపైన వైచె; ♦ దప్పక యుగ్రుం
డును భటపతియా నీలుం, డనూనగతి వైవఁ బడిన ♦ యా శిలయదియున్.

క. తలపైనఁ బడఁగ దానం, దల యప్పుడు శకలములుగ ♦ నాకుణరీతిన్
గలిగించుచుఁ బగిలెను; నా,బలనాయకుఁ డంతఁ గాంచె ♦ బలములు చెలఁగన్.

తే. ఇంద్రియంబులు నశియింప ♦ నిల గతాసు
వగుచు విచ్ఛిన్నమూలను♦హాద్రుమంబు
పగిది వేగమ గూలెను; ♦ భగ్నమయిన
యాప్రహస్తునితలనుండి ♦ యు రక్తతిఁ గడు. ౯౯ 2207

క. తనువుననుండియుఁ బర్వత,మునుండి నిర్ఝరము తీవ్ర♦ముగఁ బొరిమిభం
గిని రక్తము పాఱెను; నా,వనచరపతి యాప్రహస్తు ♦ వధయించంగన్. ౯౬

క. వనచరులు చూచుచుండిరి, దనుజవిభూ రక్తమునఁ దడిన ♦ యపూర్వము చూ
డనురాక యుప్రకంప్యం, బునునయి యుండియును మోహ♦మును వీడి కడున్.

[1]క. పురమునకుం జనఁ దిరిగెను;, సురరిపువీరోత్తముఁడు ♦ క్షోభింబడఁగాఁ
ద్వరగా నీ రనకట్టకు, నరిగి తగం దాఁకి నిల్వ ♦ కప్పుడె సాఁగుచున్. ౯౮

క. వెనుకకు మరలువిధంబున, దనుజులు వారెల్ల నిల్వఁ♦దగు శక్తిహీనులై
మిని బాఱి;రిట్టు లావా,హినిపతి హతుఁ డౌట సుభటు ♦ లెంతయు నార్తిన్.

తే. ఉద్యమంబులఁ బాసి మ♦హోగ్రశక్తి
నలరుదానవపతిచెంత ♦ కరిగి పలుకఁ
జాల కప్పుడు మూఁగల♦చంద మొప్పు
నుండి [2]తీవ్రశుగబ్ధిని ♦ నొగి మునింగి. ౯౯ 2212

---

* ఈ యుగ్రవేగం సంరబ్ధ మాపతంతం మహాకపిః, తతః స్వాంత్రేకస్య జగ్రాహ మహావేగో మహాశిలామ్-అనియూ. 1 సేతుబంధం సమాసాద్య విశీర్ణం సలిలం యథా-అనియూ. 2 తీవ్రశుగబ్ధిని-శుక్+అబ్ధి-శోకసాగర మనియర్థము.

క. విరహితసంజ్ఞులవలె నుం,డిరి; యంతట కపివిభుండు ♦ నీలుఁడు జయమున్
గరముం గొన్నమహాబలుఁ, డరాతివిధ్వంసనంబు ♦ నవ్విధిఁ జేయన్. ౬౦౫

క. వనచరవర్యులు తమి న,ప్పునికయి వినుతింప మిగులఁ ♦ బ్రమదంబున నా
మనుజవిభూత్తములం గనఁ, జని వారలచెంతనుండె ♦ సఫలాత్ముండై.

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

రావణుని ప్రథమయుద్ధము.

చ. [1]వనచరసైన్యనాయకుఁడు ♦ బాహుబలంబుమెయిం బ్రహస్తునిన్
దనుజభటాధిపుం గలనఁ ♦ దాఁ బొలియించి చెలంగ భీమసా
ధనములఁ దాల్చి యంబుధివి♦ధంబున వేగమునం జెలంగునా
దనుజమహేంద్రుసైన్యము వి♦తాకున లంకకుఁ బాఱె నార్తిమై. ౧ 2215

సీ. దనుజవీరులు చని ♦ తమపతికిం బ్రహస్తుఁడు వాహినీపతి♦క్షోణిఁ బడుట
నీలునిచే నని ♦ సోలుచుఁ జెప్పంగ వారలపల్కులు ♦ వరుసవినుచు
[2]బలవంతులౌ శత్రు♦వుల నాశ్రయించుట విధియయ్యెఁ గాలుని♦వీటికరుగఁ
దగుతఱి గావున ♦ దారుణకోపంబుఁ బూనె; నారావణుఁ ♦ డానిలింప

తే. పతిసమానుఁడు సేనాధి♦పతి హతుఁడగు
టను గదున్ విని శోకంబు♦నను మునింగి
యంతఁ గోపాన్వితస్వాంత ♦ మమరఁ జెంత
నలరు రాక్షసభటనాయ♦కులను గాంచి. ౨ 2216

క. సురపతి సురభటవీరులఁ, బరికించి వచించుమాడ్కిఁ ♦ బలికెన్; మనకుం
బరుఁడగు రామునిపట్లను, ద్వరపడక యుపేక్షఁ బూన♦వచ్చునె చెపుఁడీ. ౩

క. శతమఖుబలముం గూడిన, జతనంబునఁ జెండఁజాలు ♦ శౌర్యమహితు నా
దితిజచమూపుఁ బ్రహస్తుని, మతంగజభటాన్వితముగ ♦ మ్రందించి రనిన్.

క. కనుకన్ వనచరులని త,క్కినవారి నుపేక్షచేతఁ ♦ గ్రిందుపఱుపకుం
డనుగూడ, దింక నేనో, మనమున నోర్వంగఁజాల ♦ మార్తురకడిమిన్. ౪

క. వెనుక న్మందుం జూడక, చని వైరులఁ జంపుచున్ వి♦జయముం గొనఁగా
ననికిం బోయెద నల్వురు, ఘనబలులం జంపుచుం ద్రు ♦ గానఁ దలంపన్. ౫

---

1 గతసర్గాంతమునఁ జెప్పఁబడిన విషయమే మరల నిటఁ జెప్పఁబడినది. ఇది ప్రాచీనులగు మహాకవులయాచార మని యెఱుంగవలయు ఇట్లు చెప్పుట నిరర్థకము మాత్రము గాదు. ప్రకృత కథాబీజభూతము గాన నిది పునరుక్తి గాదని గ్రహించుట సహజము. 2 ఇది వ్యాఖ్యాభిప్రాయమునకుఁ దెనుఁగు.

దగునో నా రామును♦త్తరవాక్యమును [1]శక్రసదృశవిక్రముఁడై న♦సరసమతి వి
భీషణుం డాదృతి ♦ విని మహాత్ములును రక్షఃపుంగవులునయి ♦ క్రాలువారి

తే. బలములకొలంది చెప్పంగఁ ♦ దలఁచి యనియె;
నల్లదిగొ భూపవర్య! బా♦లార్కుఁ బోలి
యరుణవక్త్రంబుచే నొప్పి ♦ హాస్తిమూఁపు
నందుఁ గూర్చుండి తచ్ఛిరం ♦ బదరునట్లు ౧౩½ 2230

క. తనుభారంబున నొప్పెడు, దనుజు నకంపనునిగాఁగఁ ♦ దలఁపు; మదిగొ స్యం
దనమెక్కి మృగపతిధ్వజ,మును శక్రధనుస్సమాన♦మునగుధనువునున్. ౧౪½

క. అలరఁగ గుణమును లాగుచు, వెలసెడు నుగ్రంపు దంత♦వితతిఁ గరివలెన్
వెలుఁగుచునున్న యతం డి,మ్ముల విధివరములనుగన్న ♦ ముఖ్యుఁడుసుమ్మీ!. ౧౫

ఆ. ఇంద్రజిత్తనంగ ♦ నిలఁ బ్రసిద్ధుండగు;, వింధ్యశిఖరివోలె ♦ విస్తృతదేహుఁ
డస్తగిరివిధమున ♦ నన్యుల తేజంబుఁ, దగ్గునట్లు సేయు ♦ ధైర్యమలర. ౧౫

క. అలరు మహేంద్రగిరీంద్రము,వలె నిశ్చలుఁ డతిరథుండుఁ ♦ బలశాలి యొకం
డలఘురథ మెక్కి చాపం, బలరుచుఁ గైఁదాల్చి విస్తృ♦తాకృతి దానిన్.౧౫½

క. సారించుచు నున్నాఁడే, శ్రీరామా! విపులతనువుఁ ♦ జెందిన యతఁడే
భూరిబలుం డతికాయుఁడు, చేరువ నల్లదిగొ ప్రబల♦సేనాన్వితుఁడై.౧౬ 2235

క. తరుణార్కునిచందంబున, నరుణాక్షుండగుచు గంట ♦ లధికంబుగ ని
ష్ఠురనాదము సేయఁగ నొ, కరి నెక్కి ఖరధ్వనుల్ త♦గంగ నఱచుచున్. ౧౬½

క. అరుదెంచుచున్నవాఁడే, ధరణీశ! మహాత్ముఁ డతుల♦దర్పుండు మహో
దరుఁ డీతఁడు సుమ్మీ! బం,గరుసొమ్ములు చిత్రములుగఁ ♦ గ్రాలుచునుండన్.

తే. సంధ్యయందలి యంబుద♦సహితశిఖరి
వలెఁ బ్రకాశించు ఘోటక♦వరము నెక్కి
కాంతులొప్పెడు ప్రాసంబు ♦ కరమునందు
నలరు వీఁడు [2]పిశాచాఖ్యుఁ ♦ డశనిజవుఁడు. ౧౭ 2238

సీ. విద్యుత్ప్రభంబయి ♦ వెలయుచుఁ [3]గింకరవజ్రవేగంబున ♦ వఱలువాఁడి
శూలంబు గరమునఁ ♦ దాలిచి గిరితుల్యవృషభంబుపై నెక్కి ♦ వేగవచ్చు
నీతండు కీర్తిచే ♦ నెసఁగెడు త్రిశిరుండు, జలదతుల్యాంగుఁడై ♦ బలువుగలిగి
యతివిశాలంబయి ♦ యందమై వక్షంబు వెలయఁగా ఫణిరాజ♦లలితకేత

తే. నము చెలంగ సన్నద్ధుఁడై ♦ నారినట్టి, కర్ణములదాఁక లాగి, ని♦కామలీల
మరల నద్దాని విడుచుచు♦మనలఁగనెడు,వీఁడుకుంభుఁడు భూపాల♦విబుధరాజ!.

1 విభీషణ శ్శక్రసమానవీర్యః-అనిమూ. 2 పిశాచోఽశనితుల్యవేగః-అనిమూ. 3 విద్యుత్ప్రభం ంకరవజ్రవేగం-అనిమూ, కింకరవజ్రవేగమ్-వజ్రవేగా దప్యధిక మిత్యర్థః-అనివ్యాఖ్య.

చ. కనకము వజ్రముల్ పొదుగఁ♦గా విలసిల్లుచు ధూమయుక్తమో
యనునటు లొప్పు సత్పరిఘ ♦ మట్టి కరంబునఁ బూని ఘోరశ
ర్మనిచయ మద్భుతంబుగ న♦మానుషశౌర్యముచే నొనర్చు నీ
దనుజబలప్రధానుఁడగు ♦ దానవుఁ డౌను నికుంభుఁ డోవిభూ!. ౨౦ 2240

చ. ధనువు శరాళి ఖడ్గములు ♦ దారుణరీతి వెలుంగ డెక్కె ను
య్యన వెలయంగ నొప్పు రథ♦మందు ముదంబునఁ గూరుచుండి స్వం
దన మది యగ్నిరీతిఁ దగ ♦ దారుణరూపముసం జెలంగు నీ
ఘనుఁడు నరాంతకుం డగును ♦ క్ష్మాపతివర్య! మహేంద్రవిక్రమా!. ౨౧ 2241

తే. అరులు కనఁబడమిని భూధ♦రాగ్రములను
శత్రువులుగాఁ దలంచి భు♦జప్రతాప
మలరఁ బోరాడుచుండు న♦రాంతకుండు:
చూడు మల్లదిగో కను♦చూపునందు. ౨౨ 2242

సీ. పలువిధములు ఘోర♦ములునైన రూపముల్ గల్గు శార్దూలోష్ట్ర♦కరిహయమృగ
ముఖములుతగ నేత్ర♦ములువివృత్తంబులై వెలయుభూతములుత♦న్నలమిఁగొలువ
నలరునీతఁడె దేవ♦కుల దర్పహంతయా రావణుండు హితుక♦ద ప్రతిమము
నాత్మశలాకము ♦ శుభకరంబునునగు జెలిగొడు గీతని♦దివ్యగతము

తే. నందు వెలయుచునున్నదీ♦యమరనైరి, గుణతరస్వాంతుఁ డెల్లర♦తోవరు లాగఁ
గొలువ భూతాళితోడను ♦ గూడియున్న, యట్టిరుద్రు నిజగిదిగ ♦ నలరువాఁడు.

చ. ఘనమకుటంబుఁ దాల్చి రుచిఁ ♦ గ్రాలెడుకుండలముల్ శ్రవస్సులం
దు నటన మట్టి చేయు రుచి♦తో ముఖమెంతయు నొప్పుచుండఁ జ
క్కనితుహినాద్రి వింధ్యగిరి♦కాంతులఁ బోలిక భీమరూపముల్
దనరఁ జెలంగువాఁ డితఁడు; ♦ దానవవీరుఁడు నుమ్ము భూవరా!. ౨౪ 2244

క. శతమఖసమవర్తులయుద్ధతి నొంచినవాఁడు తీక్ష్ణ♦ధాముని వగిదిన్
క్షితిఁగ్రాలువాఁడు కనుమా, క్షితిపాలమహేంద్ర ముని స♦ శ్రీరాఘవుఁడున్.

క. అరిహంత నవ్విభీషణుఁ, బరికించి వచించె నిట్లు ♦ బళి రే! దనుజే
శ్వరుఁ డితం డురుతేజస్స్ఫురితుండు ప్రతాపశాలి ♦ శోభిలుఁ గాంతిన్. ౨౬

చ. ఖరకరునట్లు కాంతుల ని♦కాయము వెల్గుచుఁ దేజిమాషరా
కరుడుగ నొప్పుఁ దేజమున ♦ నావృతమై తగు సింహపఙ్క్తి
తరుణమునందుఁ గన్పడు ని♦తాంతము స్పష్టముగాఁగ; రాక్షసే
శ్వరుఁడగు వీని దేహము వి♦భాసిలునట్లుగ దేవదానవో
త్కరమున నేరి దేహమును ♦ గ్రాలదు కాంతివమగ్రమై తగన్. ౨౭ 2247

క. ఈతనిభటవరులెల్ల న,వాతేజులు పర్వతముల ♦ యాకృతిగలవా
రాతతగిరులం గొనియేం, ఘాతలి యుద్ధంబునేయ ♦ నెంచినమేటుల్. ౨౮

ఆ. దీప్తములగు బాణ♦దీధితు ల్వెలయంగ, వానిఁ దాల్చియున్న♦వారు; భీమ
తేజుఁడైన యితఁడు ♦ దీప్యమానభయంక,రప్రతాపదనుజ♦రాజి గొలువ.

క. అతితీక్ష్ణదేహభూత, ప్రతతియుతుండైన యముని♦భంగి విలసిలెన్
శతధృతివరమున నీదు,ర్మతి నాదృక్పథమునందు ♦ మానుగఁ బడియెన్.

క. కనుఁగొను మిదిగో భూజా,తను దొంగిలి నాకుఁ గల్గఁ ♦ దాఁ జేసిన యి
ప్పెనుక్రోధమ్మును సేసీ, తనిపై వెడలించువాఁడ ♦ దారుణభంగిన్. ౩౧

చ. అనియిటు వీర్యవంతుఁడగు ♦ నారఘురాముఁడు పల్కి లక్ష్మణుం
డనుచరుఁడై చెలంగఁగ మ♦హావిశిఖంబును లాగి యెత్తి ని
ల్చెను సమరాంగణంబునను ♦ జెందిన వేడుక; నంతరావణుం
డనుపమవిక్రమాఢ్యులగు ♦ నాసురవర్యులఁ గాంచి యిట్లనున్. ౩౨-౩౪ 2252

సీ. జంకునొందక మీరు ♦ చక్కఁగా నగరంపు ద్వారంబులందు, నం♦తర్గతమ్ము
లగుపురద్వారమ్ము♦లందుఁ దత్పార్శ్వంబులందు సుభటులుండు ♦ నట్లు గట్టి
నట్టి చర్యాభవ♦నాళియందును నిల్చి చక్కఁగాఁ గాపాడఁ ♦ జాలియుండుఁ;
డిప్పుడు నన్నుఁగూడి ♦ యీరీతి మీరెల్ల వచ్చియుంటను జూచి ♦ వనచరేంద్రు
లిప్పట్టణంబున ♦ నెవ్వరు లేకున్న చిత్ర మిద్దానిని ♦ జిత్తములను

ఆ. నెఱిఁగి దుష్ప్రసహమ♦యే యయ్యు జనశూన్య
మైన లంకఁ జొచ్చి ♦ యతిజవమునఁ
బాడు సేసి పాఱ♦వైతురు కంధిలో
ననుచుఁ బరిజనులకు ♦ నాజ్ఞయొసఁగి. ౩౫ 2253

చ. తను నిటుగూడి వచ్చిన సు♦పర్వుల వారల వీడుకొల్ప నా
దనుజులు స్వాజ్ఞ నౌదలఁ ♦ దాల్చి చనన్ మఱి రావణుండు చ
య్యనఁ బెనుచేప పూర్ణమగు ♦ నబ్ధిజలంబు గలంచుభంగి న
వ్వనచరసాగరౌఘము, న♦వారితరీతి నలంపఁ జొచ్చెఁ దాన్. ౩౬ 2254

సుగ్రీవుఁడు రావణుమార్కొని మూర్ఛిల్లుట.

మ. దనుజేంద్రుం డిటు తీక్ష్ణబాణధను వు♦ద్యచ్ఛక్తిమైఁ దాల్చి చ
య్యన యుద్ధంబును జేయఁ బైఁబడుచు రా ♦ నత్యంతకోపంబునం
గని సుగ్రీవుఁడు భూరిభూమిధరశృం♦గం బొండుఁ జేలాగి యా
తనిపైకిం జని మార్కొనెన్; మఱియునున్ ♦ దర్పంబుమై నాతఁడున్. ౩౭

క. తరువితతియుక్తసానూ,త్కరములఁ దగునాశిఖరముఁ ♦ గ్రవ్యాదునిపై
బరవసము మీఱవైచె వి,సరి జవమున; రావణుండు ♦ చక్కఁగ దానిన్.

క. తనపైఁ గడరఁ దటాలునఁ, గని హాటకపుంఖశరని♦కరమున్ భేదిం
చెను దాని; నిట్లు తరువిత,తినిగూడిన సానువులను ♦ దీప్తమ్ముగుచున్. ౩౮

రనయుని నీచుని నీదను,జుని నేనే చంపువాఁడఁ ♦ జుము శ్రీరామా!. ౪౭
క. అనుమతి నిమ్మా! నీదగు, ననుజ్ఞ లేకుండఁ బోవ ♦ నర్హముగాదం
చని వినయంబునఁ బల్కిన, యనుజుని వాక్యములవిని మ♦హామతిగానన్.
*క. గురుకాంతి సత్యశౌర్యము, పరఁగంగా నొప్పురామ♦భద్రుండను సో
దర! పొమ్ము నీచుఁడని నీ, యరి నెంచక యత్నపరుఁడ♦వై పోవఁదగున్. ౪౮
క. శరమొండు గూర్చునట్లుగ, నరికిం గన్పడుచు మఱొక♦యస్త్రముఁ గూర్చున్
గురువీర్యుం డగుటన్ సం,గరమునఁ జిత్రప్రతాప♦కలితుండగుఁ జూ!. ౪౮
[1]ఆ. ఈతఁ డలిగెనేని ♦ యెల్లలోకంబు లొ,క్కటిగఁ జేరి యితని ♦ కడిమిఁకోర్వఁ
జాల వించుకయును ♦ సందియం బేలేదు, గానఁ బొరపడకయె ♦ దానవపతి.
క. దనుజునియందలి లోపము,లను మఱి నీలోపగణము♦లను నరయుము; నీ
కును గల్గువానిఁ బరునకుఁ, గనఁబఱుపక హెచ్చరికను ♦ గల్గి సతతమున్. ౪౯
క. ధనువున నిన్నున్ జాగ్ర,త్తను గాచికొనుము; యటంచు ♦ దాశరథి వచిం
చిన [2]లక్ష్మణుఁ డారాముని, గని కౌఁగిటఁ జేర్చుకొని త♦గన్ వలగొనియెన్.
క. తనివార మ్రొక్కి యుద్ధం,బునకుం జనె; నేన్గుతుండ♦ములకు సమములౌ
ఘనబాహువులందగు రా,ముని తమ్ముఁడు దీప్తచాప♦ముల భీమముగన్. ౫౦
క. కరముల ధరించి బాణో,త్కరముల వర్షంబుగాఁగ ♦ త్ర్యాస్థలముపయిం
గరమడలి భిన్నులై పడు, హరివీరులపైని గురిసి ♦ యార్చుదశముఖున్. ౫౧
క. కనుఁగొనియె; మహాతేజం,బునఁ దగుహనుమంతుఁ డనిల♦పుత్త్రుం డట్ల
య్యనికిన్ లక్ష్మణురాకను, గని నేనుండంగనేల ♦ కష్ట మితనికిన్. ౫౨ 2278
క. అనియెంచి రావణునిబా,ణనికరమును నిలిపి, దనుజ♦నాథునిపైకిం
జనియెన్ ద్వరగా; సన్మతి, యనిలాత్మజుఁ డతనిరథము ♦ నటఁ జేరి తగన్.
చ. తనయపసవ్యబాహువు ని♦తాంతము పైకినిగుడ్చి దానవేం
ద్రుని వదలించుచుం బలికె ♦ రూక్షముగా; సురదైత్యసంతతిన్
ఘనతరయక్షరాక్షసని♦కాయముచే సురగాయకాళిచే
తను నని జావకుండను వి♦ధాత్రువరంబును గాంచినావుగా. ౫౪, 2280
[3]క. వనచరులవలన సాధ్వస,ము నీకు నిటఁగల్గు; హస్త♦మును నిదిగో వ్రే
ళ్లను నైదిటఁదగుదానిన్, నినుఁ జంపఁగ నెత్తినాఁడ ♦ నేనిపు డదియున్.
క. నినుఁ జంపి నీశరీరం,బునఁ జిరకాలముగ వాస♦మును జేసెడు జీ

---

* తమబ్రవీన్మహాతేజా రామ స్సత్యపరాక్రమః-అనియు. 1 త్రైలోక్యేనాపి సంక్రుద్ధో దుష్ప్రసహ్యో న సంశయః-అనియు. ఇచట రామునినోట రావణునిం బొగడించి మహాకవి వాల్మీకి తనచాతుర్యమును వెల్లడించెను మహాపురుషులు శత్రువునుగూడ గుణమున్నఁ బొగడుదురనుట యిట గ్రహింపఁ దగినది. 2 రాఘవస్య వచ శ్శ్రుత్వా పరిష్వ జ్యాభిపూజ్య చ-అనియు. 3 ఏష మే దక్షిణో బాహుః పంచశాఖ స్సముత్థితః-అనియు.

వునిఁ బైకిఁ బంపఁగల పన, దనుజేంద్రుఁ డంత భయ♦దర్పుఁడు పూన్కిన్.
చ. అనిలజువాక్యముల్ వినుచు ♦ నాగ్రహయుక్తి సురక్తనేత్రుఁడై
యనియె మరుత్తనూజుఁ గని ♦ యోరి! కపీ! యిఁక శంకలేక వే
గ నను గరప్రహారమున ♦ గాసిలఁ జేయుము శాశ్వతంపుఁగీ
ర్తిని గపికోట్టి రావణు న♦తిస్థిరశౌర్యముఁ బూని యంచు మే
దిని గడియింపు మంతట మ♦దిం దలపోయుచు నీదుదర్పమున్. ౫౭౪ 2283
క. నిను నశియింపఁ జేసెద;, నన వాయుకుమారుఁ డైన ♦ హనుమయు దనుజే
శునిపల్కులు విని రావణ, నిను మును నేఁ గొట్టినాఁడ ♦ విక్రమమలరన్. ౫౮
క. నాపౌరుషంబు నెఱుఁగఁగ, నీపట్టిని నక్షుఁ దలఁపు ♦ మిపుడని మదికిం
జూపట్టునట్లు పలికిన, నాపావనిపలుకులకు మ♦హాతేజుం డై. ౫౯ 2285
క. దనుజేశ్వరుండు కోపం,బును దాల్చి పరాక్రమంబు ♦ పొంగఁ గరతలం
బునఁ జఱచె; దానఁబలుమఱు,మనమునఁజలనంబునొంది♦మరుదాత్మజుఁడున్.
క. మతివిభవంబును నెంతయు, నతులితతేజంబు వెలయు♦నట్టిఁడు గానన్
స్థితి నట్లొక్కముహూర్తం,బు తగంగని స్థైర్యమూని ♦ పొంగెడుక్రుధచేన్.
చ. కరతలసంప్రహారమునఁ ♦ గర్బురనాథుని నొంచె; నంత నా
సురరిపుపాలకుండు కడు♦శూరుఁడు భూరిబలుండునైన య
మ్మరుదధిపాత్మజుండును న♦మానుషశక్తిని దన్నుఁ గొట్టఁగా
ధరణి చలింపఁగా గిరివి♦ధంబునఁ దద్దయుఁ జంచలించెఁ దాన్. ౬౪ 2288
చ. అనిమొన నిట్టు లాదనుజుఁ ♦ డాహనుమంతునిహస్తతాడనం
బునఁ జలియించుటం గని క♦వుల్ మునిసిద్ధసురాసురుల్ ముదం
బున రొదసేసి; రాపిదప ♦ భూరితరంబగు తేజ మొప్పునా
దనుజవరుండు తెప్పిఱిలి ♦ తత్పవనాత్మజుఁ గాంచి యిట్లనున్. ౬౮ 2289
*క. వనచరవర! నీవీర్యం,బును మెచ్చఁగవచ్చు శత్రు♦వుగనుండితివై
నను మెచ్చువాఁడ బళిరే, యన; హనుమయు నిట్లుపలికె ♦ నాతనితోడన్.
తే. ఇస్సిరో! నాదువీర్యమిం ♦ కేమి పలుక
నిద్ది యుండిన లేకున్న ♦ నేమి యిఁకను
బ్రదికియున్నాఁడవే యేల ♦ పలుకు మిప్డు;
డొక్కమాఱు దురాత్మ! నీ♦వుద్యమమున. ౭౪ 2291
క. ననుఁ బ్రహరింపుము నీవే, నిను వినుతించుకొనదేల ♦ నే నంతట ము
ష్టిని నిన్నుఁ బొడిచి యమపుర,మున కనిపెద; ననిన దనుజ♦ముఖ్యుం డంతన్.
చ. హనుమవచించుమాటలకు ♦ నాగ్రహ మూనుచునుండెఁ బౌరుషం
బునఁ దగు రావణుండు క్రుధఁ ♦ బొంగుచు నేత్రము లెఱ్ఱవాఱఁగాఁ

* సాధు వానరవీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః-అనియున్.

దనకుడిచేతిముష్టిని ని♦తాంతజవంబున, వైరిఁబొమ్ము నొ
య్యనఁ బొడిచెన్; బృథూరమున ♦ నాతని వ్రేటుపడం గపీంద్రుఁడున్. ౯౨

క. పలుమఱుఁ జలియించె; మహా,బలుఁ డాపవనాత్మజుండు ♦ బడలికచే మూ
ర్ఛిలుటం గని యతిరథుఁడో,పలాశనేశుండు పవను♦పట్టిని ననిలోన్. ౯౩ 2294

తే. చంపరామి నెఱింగి యీ♦శత్రువింక
మూర్ఛఁ దేఱిన బహుకష్ట♦ములు గలుగును
గాన వేగంబ చనుటమే♦లౌనటంచు
నరద మెక్కి నీలునిపైకి ♦ నరిగెనంత. ౯౪ 2295

మహాస్రగ్ధర:—

దనుజేంద్రుం డుగ్రరూపా♦తతబలయుతుఁడై ♦ దర్పముప్పొంగుచుండం
గను భీమవ్యాళరీతిం ♦ గనఁబడి రుచులం ♦ గ్రాలుచున్ వైరిమర్త్యా
ఘునికృంతస్ఫారశక్తిం ♦ గననగుశరముల్ ♦ గాడఁగానేసి నీలున్
ఘనదర్పున్ వాహినీశున్ ♦ గనలనొనరిచెన్ ♦ గాఢదీప్తుల్ చెలంగన్. ౨౧

సీ. హరిచమూపతి నీలుఁ ♦ డట్లు బాణాళిచే శ్రమమొంది యొకచేత ♦ శత్రుబాణ
ములను హరించుచుఁ♦జెలఁగి వేఱొకచేతఁ బర్వతాగ్రముఁ గొని♦బరవసమున
దానవుపై వైచె; ♦ మానితతేజుఁడై మతిమదగ్ర్యుండగు ♦ మరుదధిపతి
తనయుండు సంజ్ఞను ♦ దాఁగని యనిచేయుకాంక్షతో నంతటఁ♦గాంచియొకట

తే. నీలుతోడఁ బోరాడెడు ♦ నిఖిలదనుజ
పతినిగని తప్పిపోయెనే ♦ యితఁ డనుక్రుధ
వెలయ నాతనితోడ నో♦రులపయిఁ జని
నట్టివానిపై కడరుట ♦ యహితమనుచు. ౨౮ 2297

క. నిను మార్కొనమానితి ననిౢయనియెన్; గురుతేజుఁడైన♦యసురేంద్రుఁడు నీ
లునిచే వైవంబడు నా,ఘనశృంగముఁ దీక్ష్ణసప్త♦కాండమ్ములచేన్. ౨౯ 2298

క. తునియలుగాఁ జేసెను మే,దిని బడియెను నదియు; భటప♦తియుఁ బరవీరా
ళిని జంపువాఁడునుం గా,వున నీలుఁడు తచ్ఛిఖరము ♦ భూరిశరములన్. ౨౪

క. ధరపై శకలములై పడ, నురుతరకోపమునఁ గాంచి ♦ యుగ్రులయమునం
బరఁగు ధనంజయువలె నా,తరుణంబునఁ జూడనగుచుఁ ♦ దద్దయుఁ గడఁకన్.

క. ఇనుమద్దులఁ జంద్రలఁ బూ,చినమామిడిచెట్ల వివిధ♦చిత్రతరమహీ
జనికరముల రావణుపైఁ, దనశక్తియు వెలయ వైచెఁ ♦ దద్యుద్ధమునన్. ౨౨

చ. తరువుల వానినెల్లఁ దన♦దర్పము పొంగఁగ రావణుండు భీ
కరశరవృష్టిచే బదులు♦గా వడిఁ ద్రుంచి హుతాశనాత్మజున్
గరము భయంకరమ్ములగు ♦ కాండములం బరఁగించి నొంచె; న

మూర్ఛమునంగియుంటఁ ♦ బోలఁ గన్గొని సమ
రోత్సుకంబు పొంగు♦చుండ మెఱసి. ౯౧ 2318

క. ఘనమట్లుగ మ్రోఁగెడు సృం,దనమున లక్ష్మణునిపైకిఁ ♦ దాఁ జనియె జవం
బున; నిట్లు లక్ష్మణుని చెం,తను జేరుచు నడుమనున్న ♦ తపనజముఖులన్. ౯౨

క. వారించి యనికి నడుమన్, దా రాజిల్లుచును మిగుల ♦ ధరణి వడంకన్
నారిని లాగుచు ధనువును,ఘోరముగా మెఱయఁజేసెఁ ♦ గ్రోధం బలరన్. ౯౩

చ. ధనువు మహాప్రమాణమును ♦ దద్దయు మ్రోఁగఁగఁ జేయు రావణుం
గని గురుసత్త్వుఁడైన రఘు♦కాంతుని తమ్ముఁడు లక్ష్మణుండు ప
ల్కె నిటులు [1]రాక్షసేంద్ర! విను ♦ కీశగణంబులతోడ యుద్ధముం
బొనరుప నీ వనర్హుఁడవు ♦ పొందుగ నాపయి కేగుదెమ్మికన్. ౯౪ 23.6

క. అన దనుజేంద్రుఁడు భీకర, మనూనమును నౌరవంబు♦నగు లక్ష్మణుప
ల్కును ఘోరగుణధ్వనియును, విని యుద్ధముసేయనున్న ♦ వీరునినతనిన్.

తే. తారసించి కోపంబున ♦ దారుణార,వంబుతో నిట్లుపల్కె; నో♦బాలక! మృతి
నందఁగోరెడు విపరీత♦మైన బుద్ధి, గల్గువాఁడవు నీవిష్టి ♦ గాన నిచట. ౯౫

తే. భాగ్యవశమున నాదృష్టి♦పథమునందుఁ
బడితి వీఁక నాశరాళిసం♦పర్కమునను
గనలుచుం బోవఁగలవు య♦మునినగరికి
నీక్షణంబుననే యని ♦ యేపుమీఱ. ౯౬ 2319

క. పలుకుచు నున్నతసితదం,ష్ట్రిలనొప్పుచు నార్చుచున్న ♦ సమదనురారిం
బలుకుల నదలించుచు నిటు,పలికెన్ సౌమిత్రి దనుజ♦పాలక! వినుమా!. ౯౭

చ. గురుతరసత్త్వభావులగు ♦ కోవిదు లివ్విధి నిస్వనంబుచే
యరు సుము; నీవు పాపమతు♦లందు వరిష్ఠుఁడవౌట నిప్పుడి
క్కరణి నుతించుకొంటివి; విటఁ ♦ గర్బురనాయక! [2]నిర్జనాటవిం
బరసతి భిక్షువేషమునఁ ♦ బాపమతిం గొని తెచ్చినావుగా. ౯౮ 2321

ఆ. అట్టి నీబలంబు ♦ నరిభయకృత్ప్రతా,పమును బౌరుషంబు ♦ బాగుగాఁగ
నాత్మ నెఱుఁగు దిప్పు ♦ డంబకములఁ జాప,మును ధరించి వచ్చి♦తిని గడంక.

క. అనిసేయంగను దమ్మా, నిను వినుతించుకొననేల ♦ నీవే యని రా
మునితమ్ముఁ డాఁడఁ గోపం,బున రావణుఁ డతనిపై [3]సు♦పుంఖశరములన్.

---

1 అభ్యేహి మామేవ నిశాచరేంద్ర నవానరాం స్త్వం ప్రతియోద్ధు మర్హసి-అనిమూ. 2 తప విజనే యతివేషేణ సీతా మపహృతవతః ప్రతాపమ్-అనివ్యాఖ్య. జానామివీర్యమ్-అనుమూలమున కిట్లువ్యాఖ్యచేయఁబడినది. ఇట్టియర్థము చెప్పకున్న జానామి-అనుపదము వ్యర్థమగు. కాఁబట్టి వ్యాఖ్యాతల యభిప్రాయము వ్యర్థమనువారిపు డిట నేమియర్థము చెప్పెదురో. 3 శరాన్ సుపుంఖాన్-అనిమూ.

తే. వైచె నేడింటి నంత న♦వ్వాఁడిమగఁడు
కనకచిత్రపుంఖమ్ములై ♦ కడునిశాత
ములగు మొనలొప్పు సాయకం♦బులను వాని
వడిగ ఖండించె లక్ష్మణు♦ఁ డనము మెఱసి. ౯౯ 2324

క. శరముల విభిన్నతనువుఁ, బరఁగెడు గుహఫణుల బోలి ♦ నాశమ ధరపైఁ
దొరుగంగఁ గాంచి లంకే,శ్వరుఁ డాగ్రహ మొందిమఱియు♦ వాఁడిశరములన్.

క. పరఁగించె; లక్ష్మణుండును, శరతతులను వింటఁ దొడిగి ♦ సరభసముగ భీ
కరబాణవృష్టిఁ గురిసెను;, సురారి యపుడెల్ల యేయు♦సునిశితశరముల్. ౧౦౦॥

సీ. అర్ధచంద్రాకృతి ♦ నలరుచు ఖురపట్లు గ్రాలుచు నుత్తమ♦కర్ణికార
మట్లు ధారలనొప్పు ♦ నట్టిబాణంబులఖండించుచుండెను♦గాని యించు
కంతైనఁ గలఁగక ♦ యాలక్ష్మణుండుం డెనుకొఁ గంతటఁ ♦ దానువైచి
నట్టిబాణాళుల ♦ నన్నిటి నాతండు ఖండించి వైచుటఁ ♦ గాంచి యతని
శరలాఘవమున నా♦శ్చర్యమొందుచు మఱియును దీక్ష్ణబాణంబు♦లను సుమిత్ర

తే. తనయుపై వైచెఁ లక్ష్మణుం♦డును దనుజను, ననిఁ వధించుటకై వాఁడి♦మొనలుగలిగి
*వజ్రకులిశంబులను బోలె♦ నఖిలి యగ్ని,వలె వెలుంగుచునున్నట్టి♦ బాణతతుల.

క. ధనువునఁ గూర్చి ప్రయోగిం,చెను; రాక్షసరాజు నద్వి♦శిఖముల ఖండిం
చెను నట్లు వానిఁ ద్రుంచుచుఁ,దనకుం బరమేష్ఠి మున్ను♦ వయ నొసఁగంగన్.

క. వెలయుచుఁ దనచెంగట ను,జ్జ్వలకాలానలసమాన♦భావళి తగఁగాఁ
జెలఁగెడు నొకబాణవరం,బు లక్ష్మణుని ఫాలభాగ♦మున నాటంగన్. ౧౦౪

తే. వైచె, నాలక్ష్మణుండు త♦ద్బాణపీడి
తుఁడయి హస్తంబునుండి జా♦ఱెడుశరాస
నమును నొకభంగి ధరియించి ♦ విమలశక్తి
తగ్గఁ జలియించి మూర్ఛిలి ♦ ధైర్యమూని. ౧౦౪॥ 2330

తే. మరల నేరీతినో కేలి ♦ యరిధనువ్వుఁ
ద్రుంచె; నీరీతిఁ జాపంబు ♦ త్రుంగనున్న
వైరి రావణు నిశితాగ్ర♦బాణములను
మూఁట బరఁగించి నొప్పించె ♦ గోటు మెఱయ. ౧౦౫॥ 2331

చ. దనుజమహేంద్రుఁ డాశరవి♦తానముచేతను నొచ్చి చంచలిం
చి నియతిమాని మూర్ఛిలి వి♦చిత్రముగా నటులో వ్యతిం దగం
గని సముదగ్రశక్తియయి ♦ గ్రాలుచు దేవవిరోధియైన యా
దనుజుఁడు ఛిన్నచాపుఁడయి ♦ దారుణబాణనికృత్తగాత్రుఁడై. ౧౦౬॥ 2332

క. ఒడలెల్లన్ మేదమ్మునఁ, దడియన్ రుధిరావసిక్త♦తనుఁడై యనిలోఁ

* మహేంద్రవజ్రాశనితుల్యవేగాన్-అనియూ.

గడఁకన్ మెఱయుచు విధి మును, కడుఁగూరిమిఁదనకునీయఁ♦గాఁదనచెంతన్.

క. తనరారుశక్తిఁ గైకొని,యెను; రాక్షసలోకపతి య♦హీనగతుల నొ
ప్పినదాని విగతధూమం,బునఁ దగు హుతవహునిరీతిఁ ♦ బొలిచెడుదానిన్.

చ. వనచరవాహినీతతికి ♦ వారకభీతిని గొల్పుదాని నా
ఘనతరశక్తి శీఘ్రముగఁ ♦ గైకొని లక్ష్మణుపైనవైచె; నా
యనుపమశక్తియుం దనను ♦ నంతము నొందఁగఁ జేయవచ్చుటం
గని హుతవీతిహోత్రసమ♦కాంతిని గ్రాలుచు భీతిదంబులై
కనఁబడుబాణముల్ వయిచి ♦ గాఢబలంబునఁ గొట్టెఁ గొట్టినన్. ౧౦౯

సీ. వదలక యాశక్తి ♦ వచ్చి లక్ష్మణువిశాలంబైన వక్షస్స్థ♦లంబుఁ జొచ్చె
నంత మహాశక్తి♦యుతుఁడై రఘువీరుఁ డగు లక్ష్మణుండు మ♦హాత్తరమగు
నాసాధనంబుచే ♦ హతినొంది మఱిమఱి ప్రజ్వలించెను; నంత♦రాక్షసేంద్రుఁ
డట్లు విహ్వలుఁడైన ♦ యాలక్ష్మణుంగని జవమున వచ్చి హ♦స్తముల బల్మి

ఆ. నతనిఁ బట్టుకొనియె; ♦ నారావణుఁడు ధైర్య
మున మహత్తరుఁడయి ♦ తనరుతుహిన
శిఖరినైన నెత్తఁ ♦ జెల్లిన బలశాలి
యైన నగును మును ప♦మానుషగతి. ౧౧౦ 2336

సీ. *అం దేక దేశమై ♦ యలరు కైలాసంబుఁ గదలించియున్నాఁడు ♦ గాననట్టి
సాగరాఘావతం♦సంబయి గంభీరమైన పాల్కడలిని ♦ నాత్మశక్తిఁ
గలఁచిన మందర♦త్మాధరంబును దాను మును జయించిన దేవ♦ముఖ్యులెల్ల
బట్టితెచ్చిరి గాన ♦ బాహువులను బూని యెత్తంగఁ జాలును ♦ నెల్లకులశి
ఖరులలో మేటియై ♦ క్రాలు మేరువునైన నెత్తంగఁ జాలు న♦దెట్టు లనిన
వాయువే యాగిరి♦వరశిఖరమ్మును గడలిదా కుక్షిఁ లం♦కనుగ వైచెఁ
గనుక నాతనిజయిం♦చినవాఁడు గావున నవలీల నెత్తనౌ ♦ ననుపమాన
పరిమాణమై మహా♦త్తరమయి పొల్చెడు నాజగత్త్రయమును ♦ నైన నెత్తఁ
జాలు హిరణ్యాక్షుఁ♦డోలిఁ దద్భాగమౌ పుడమిని జంకలో ♦ నిడుకొనియెను
గనుక నీతం డెత్తఁ♦గను జాలు సురలతోఁ గలిసియే యున్నను ♦ గాని రాము
తమ్ముఁడౌ లక్ష్మణుఁ ♦ దగురామునందు నాల్గవభాగమై పొల్చు♦ఘనుని నెత్తఁ
జాలఁడు భుజముల♦సమరాంగణమునందు నపుడు లక్ష్మణుఁడు బ్ర♦హ్మాదయవలన

ఆ దనుజు నొందినట్టి ♦ తచ్ఛక్తి ఱొమ్మున, గాడఁగాఁ దలంపఁ♦గను దరంబు

---

* హిమవాన్మందరో మేరు స్త్రైలోక్యంవా సహామరైః, శక్యం భుజాభ్యా ముద్ధర్తుం నసంఖ్యే భరతానుజం. శక్త్యా బ్రాహ్మ్యాపి సౌమిత్రి స్తాడితస్తు స్తనాంతరే, విష్ణో రచింత్యం స్వం భాగ మాత్మానం ప్రత్యనుస్మరత్ -అనియూ. ఈశ్లోకద్వయమునకు వ్యాఖ్యాతలు నిర్వచించిన యర్థ మిటసీసమాలికయందుఁ జేర్పఁబడినదని గ్రహింపవలయు.

ధనువు సంగ్రహించెఁ ♦ దాశరథియు నంతఁ, బతితవీరవర్య♦పటల మగుట.

క. మనముల భీతిలి యుద్ధం,బున నిల్వక కపులు పాఱ♦పోవుచునుండం
గని తాను రావణునిపై,కిని నడ రెను; నంత హనుమ♦కృతకృత్యుండై. ౧౨౪

క. శ్రీరామునిపరిసరమును, జేరి వచించెన్ దురంబు ♦ సేయఁగ నావీఁ
పారోహించి విరోధిని, మారుకొనం దగునటన్న ♦ క్ష్మాపతి యంతన్. ౧౨౫

చ. హనుమ వచించినట్టి పలు ♦ కాదృతిమై వినుచున్ బలాఢ్యుఁడై
తనరెడువైనతేయుని ము♦దంబున మాధవుఁ డెక్కునట్లు చ
క్కనిగతి భూరివిక్రమము ♦ గ్రాలఁగఁ బొల్చెడు రాఘవుండు త
ద్వనచరవర్యునెక్కి రథ♦వర్యమునందగు వైరిఁ గాంచెఁ దాన్. ౧౨౬ 2350

చ. నిరుపమతేజుఁడైన ధర♦ణీపతి రావణుఁ గాంచి క్రుద్ధుఁడై
శరతతిఁ గార్ముకంబుఁగొని ♦ చయ్యన విష్ణువు పూన్కిమై బలిన్
దురమున మార్కొనం దలఁచి ♦ తోరపువేడుకఁ బోవునట్లు భీ
కరతరవజ్రనాదసమ♦గాఢగుణధ్వని పెల్లుమీఱఁగన్. ౧౨౭ 2351

క. దనుజుని మార్కొన నడరెను;, మనుజేంద్రుండంత దనుజ♦మండను గని యి
ట్లనియెన్ గభీరవాక్యం,బున; నిలునిలు మోనిశాట♦పుంగవ; యింకన్. ౧౨౮

క. విను మింతటియప్రియ మీ,వు నాకు నొనరించి యెటకుఁ ♦ బోయి విముక్తిం
గనఁగలవు? శక్ర, యమ, రవి, వనజాసనవహ్నికృత్తి♦వాసులకడకున్. ౧౩౦౹

క. చనినన్ దశదిశలకుఁ బో,యిన నైనను నిపుడు నాదు♦దృష్టిఁబడితి కా
వున నింక నెచటికైనం, జనఁ జాలవు మృతియెదక్క ♦ శరణము గలదే ౧౩౧

చ. దనుజగణేశ! యేనినిట ♦ దారుణశక్తిని గొట్టినాఁడవో
యనుపమశౌర్యుఁ డిట్టిస ♦యంబున నీతఁడె నీకుఁజాలఁ జిం
తను గలిగింపఁ గోరి కడు♦దర్పము పొంగఁగ నీకు నీసుతాం
గనలకు మృత్యువై యిదె త♦గం జనుదేఁగలఁ డాజిసేయఁగన్. ౧౩౨ 2355

క, నేనన నతఁడే సుమ్మీ, [దానవ! లక్ష్మణుని మిగుల ♦ దర్పంబున నేఁ
బూని ప్రహరించితి ననుచుఁ,బూనకుమా గర్వ, మతని ♦ పొంగడచితిజూ.

క. అని నీచేఁ బ్రహరింపం, గనుబడుదునొ? యనెదవేమొ] ♦ కర్బుర నీచెం
తను గన్పడు నేనే సు,మ్మని నద్భుతదర్శనులయి ♦ యతులబలులునై. ౧౩౩౹

తే. మఱి జనస్థానవాసులై ♦ మహిమ వెలసి
యుత్తమాయుధములఁ దాల్చి ♦ యొప్పునాచ
తుర్దశసహస్రకర్బుర♦ధూర్తుల నొగి
బాణముల రూపుమాపిన ♦ వాఁడఁ బేర్మి. ౧౩౩ 2358

చ. అనియెడు రామువాక్కుల సు♦రారివిభుం డవు డాలకించి ము
న్ననిఁ దనుఁ గొట్టి వే మరల ♦ నాతని మ్రోయుచునున్న భూరివీ

ప్యుని బవనాత్మజున్నఁ గని ♦ యోర్వక క్రోధము మీఱఁగా నయం
బునఁ దగువహ్నిఁబోలు శర♦ముల్ గడుఁదీక్ష్ణము లేసి నొంచెఁ దాన్. ౧౩౪

క. దనుజాంబకతాడితుఁ డయ్యును బావని నైజతేజ ♦ మొక్కటఁ గుఱఁగునం
గనువాఁడుగాన నింకను, ననూన తేజమున వెలిఁగె ♦ నద్భుతరీతిన్. ౧౩౫

చ. గురుతర తేజుఁడైన నృప♦కుంజరుఁ డారఘురాముఁ డప్పు డా
సురశరతాడితాంగుఁడయి ♦ స్రుక్కక యుండిన నాంజనేయు నా
దరమునఁ గాంచి రావణుని♦దర్పము నోర్వక యాగ్రహించెఁ; భూ
వరుఁ డరివీరుస్యందనము ♦ బాగుగ డగ్గఱి ఘోటకంబులన్. ౧౩౬ 2361

ఆ. చక్రములను ధ్వజము ♦ ఛత్రంబు గుఱ్ఱా
కలను సారథిని ద♦గంగ మెఱయు
వజ్రశూలఖడ్గ♦బాణముఖ్యాయుధ
ములను జక్కఁగాంచి ♦ వెలయుశక్తి. ౧౩౭ 2362

క. శితపుంఖసాయకంబుల, గతిత్వరి యలిగినట్లు♦గాఁ ద్రెంచి మహో
న్నతిశక్తిఁ ద్రుంచె వానిని;, శితముఖుఁ డతివీర్యుఁ డగుచు ♦ [1]శతకోటిఁ దగన్.

క. మేరునగోత్తమపక్షము, లాగూథిగఁ ద్రుంచునట్టు ♦ లారాముఁడు దు
ర్వారమహావజ్రాశని, సారలసచ్ఛరముచే వి♦శాలంబగు దాన్. ౧౩౮ 2364

ఆ. బలముగలిగి చక్క ♦ నలరు రావణుభుజాం
తరమునొంచె బలము ♦ దరుదుపాప;
నెవఁడు తనతలపయిఁ ♦ బడిఁగాని యశనియోఁ
గాని పడినభయము ♦ గనఁడొ సుంత. ౧౩౯ 2365

[2]సీ. చలియింపఁడో యట్టి♦సాంద్రమహీపతిభావంబు గల్గు రా♦వణుఁడు రాము
బాణతాడితుఁడయి ♦ బాధలకోర్వక యాస్రుఁడై చలియించె; ♦ నతులవీర్య
మున నొప్పియుండియు♦ధనువు కరంబున నుండి వేవిడిచె, న♦త్యుత్తమమతి(ముగఁ
యగు రామచంద్రుఁడ♦ట్లా రావణుఁడు మూర్ఛనందుచుండుటఁ గాంచి ♦ యద్భుత

ఆ. ప్రబలునర్ధచంద్ర♦బాణముఁ గొని దాని, వర్కవర్ణమైన ♦ యసురసంఘ
పతికిరీట మట్టి ♦ పలుశకలములుగాఁ, బడఁగ నేసి గౌర♦వము నడంచె. ౧౪౦

చ. ధనువును జాఱగా విడిచి ♦ ధామయుతంబగు నత్కిరీటముల్
గనుఁగొనుచుండ భూమిఁబడఁ♦గా విషహీనమహాహిపోల్కి శాం
తనిఖిలహేతియై శుచివి♦ధంబున నప్రభుఁడైన సూర్యరీ
తిని దనకాంతివీడి గత♦ధీవిభవుండగు రావణాసురున్. ౧౪౧ 2367

చ. కనుఁగొని దిక్కు లేని యుఁ♦గర్బురనాథునిఁ దాని గావ నొ
ప్పును గద యన్నబుద్ధిఁ గొని ♦ పోలపరించెను; రావణా! భయం

---

1 శతకోటి—అనఁగా వజ్రము. 2 నాటి ఛపాల రాజా-అనియూ. రాజా అయ్యనరాజభోజ్య
స్థితి-అనివార్యత్వ.

బును గలిగించుకార్యములఁ ♦ బూన్కి నొనర్చితి వంతెకాక నా
కు నధికమిత్రభూతులయి ♦ కూర్మి నొసంగెడు మేటివీరులన్. ౧౮౨ 2368

క. పలువురఁ జంపితి, దానన్, బలుశ్రమమునుం బడితి వనుచు ♦ భావించి శరం
బుల నిను మృత్యువశమ్మున, కలఘుబలం బలరనుండి ♦ రైన నసుపఁ జూ!.

సీ. విడిచితిఁ గర్బుర♦వితతవిభూ! నీవు సంగరమొనరించి ♦ చాలబడలి
యున్నాఁడ వేను ని♦న్నొప్పితిఁ బోనంగఁ బొమ్మింక లంకకుఁ ♦ బోయి నుంత
విశ్రాంతినిం బొంది ♦ విగతశ్రముండవై సరథుండవై బలు♦చాప మూని
రమ్ము నీ వాసంగ♦రంబున నేఁ జూపుబలము-చూచెదుగాక ♦ యలఘుదృష్టి

ఆ. ననుచుఁ బలికె; నిట్లు♦హతచాపహయసూతుఁ,డై శరార్దితుఁడయి ♦ హతకిరీట
దర్పహర్షుఁడగుచు ♦ ధరణీశువాక్కుల, వినుచు లజ్జ వేగ ♦ చనియెఁ బురికి.

చ. చని యిటు లంకఁజొచ్చె బల♦శాలి *సురాసురవైరి రావణుం
డనఘుఁడు రాముఁ డంత నిట♦నయ్యనుజన్ముని జేరి సంగరం
బునఁ బడియున్న యాప్లవగ♦పుంగశరీరములంటియున్న సా
ధనములఁ దీసివైచునటు ♦ తానొనరించెఁ బ్రయత్న మేర్పడన్. ౧౮౫

చ. సురరిపువైన రావణుఁడు ♦ శూరత దక్కి పరాజితుండునై
యరుగుట కాసురాసురమ♦హర్షులు దిక్కులు సర్వవర్యముల్
సరిదధిపస్థభూతతతి♦త్స్వాజలవాసి సమస్తజీవులున్
బరమముదంబునుం గనుచు ♦ భాసిలి రాన్నృపుశక్తి కెంతయున్. ౧౮౬

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము.

{ కుంభకర్ణుని మేలుకొలుపఁగా నాతండు రావణుని దూఱుట. దాన నాతఁడు కోపింపఁ గుంభకర్ణుండు యుద్ధమునకు వచ్చుట }

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ దాశరథిప్రహితాంబకార్దితాం
గనిచయుఁడై పురంబునకు ♦ గాసిలిపోయి విభగ్నదర్పుఁడై
మనమునఁ జంచలించె; నతి♦మానుషవిక్రముఁడైన రాముచే
తను బరిభావమందుటకుఁ ♦ దద్దయుఁ గుందె మహార్తి పైకొనన్. ౧ 2373

క. కరి సింహముచేతం బలె, గరుడునిచే సర్పమట్లు♦గాఁ బీడితుఁడై
సురవైరి యడలె; మఱియును, సరసిజభవదండములకు ♦ సాటియనగుచున్.

తే. చంచలలరీతి మెఱయుచు ♦ మించురాము
శరములఁ దలంచి వెతఁగుందె; ♦ శాతకుంభ

---

* మహాబలే దానవదేవశత్రౌ-అనియు.

దనముఁడగు కుంభకర్ణుం,డు సరసిజాత్మజుఁడు మును ద♦నుక శపియింపఁగ.

క. తనశౌర్యము దూలఁగ ని,ద్రను బొందియె యున్నవాఁ డ♦తని మేల్కొలుపుం
డనె నిట్లు మహాబలుఁ డా,దనుజుండు ప్రహస్తుఁడనిసి♦దా నృతిఁ గనుటన్.

తే. తాఁ బరాజితుఁడగుటయుఁ ♦ దలఁచి కుంభ
కర్ణుఁ డతిభీమబలుఁడయి ♦ క్రాలుచుంట
నెంచి యిట్లనిపల్కె మీ♦రేగి లోని
ద్వారములయందు యత్నంబుఁ ♦ దగునొనర్ప. ౧౪ 2390

క. వనచరు లెక్కకయుండఁగ, గను బ్రాకారంబు లెక్కి ♦ కా వుండంగాఁ
జను; నిద్రాపరవశుఁడై, దనుజవరుం గుంభకర్ణుఁ ♦ దగ బోధింపన్. ౧౫ 2391

చ. వనటల నేనుఁ గుంది పలు♦భంగుల బాధల నొందుచుండ నా
యనుజుఁడు కాలసంహాతము♦హామతియై యెటువంటి చింతయై
నను గన కిట్టి హాయిగ ది♦నంబులు నిద్రను బొందుచున్నవాఁ
డని మఱియున్ వచించె నితఁ ♦ డన్వహ మిట్టులె చేయు నక్కటా.౧౬ 2392

తే. *ఒక్కపుడు నవమాసము ♦ లొక్కతఱిని
నాఱునెల లొక్కసమయంబు♦నందు నేడు
నెల లదొక్కవు డెనిమిది♦నెలలు గాఁగ
నియతిలే కెప్డు గనుచుండు ♦ నిద్రనివుడు. ౧౭ 2393

సీ. ఆతఁ డీసంగర ♦ మారంభమగుటకు మును నవమదినంబు♦నను దగంగఁ
దత్పూర్వదినమందుఁ ♦ దా సభామండపమున నె యాలోచన♦మును నొనర్చి
నిదురపోయినవాఁడు ♦ గద కాన నీతని సులువుగా మీరు మే♦ల్కొలుపవచ్చు
గురుబలశాలియా♦కుంభకర్ణునిక్షిప్రముగ మేలుకొనఁ జేయుఁ♦డు గురుభుజుఁడు

తే. దనుజముఖ్యుండునగు నాదు♦ననుజుఁ డతఁడు
సంగరంబున వే వన♦చరుల రామ
లక్ష్మణుల సంహరింపఁగ♦లఁడు నిజంబు
ధ్వజవరంబట్లు రాక్షస♦వర్యుఁ డయియు. ౧౮ 2394

ఆ. గ్రామ్యసుఖరతుండు♦గా నిద్రఁబోవుచు, నున్నవాఁడు; చూడ ♦ నుగ్రతరము
గాఁగనున్నయట్టి ♦ కలనునందును రాము, వలన నపజయంబు ♦ గలిగె నాకు.

క. కనుకనె యాతని బోధిం,చిన నించుకయైన మదికిఁ ♦ జింతగలుగ; దో
దనుజవరులార! యీతఱి, ననుజుని లేపంగఁ దగునొ ♦ యని యడుగుదురేన్.

క. కలిగెను వ్యసనం బిట్టులు, గలనున సాయంబుసేయుఁ♦గాఁ జాలండే

* నవమష్ట్సప్తచాష్టౌచ మాసాన్ స్వపితి రాక్షసః-అనియూ. ఇట గోవిందరాజులు పూర్వాపరకాండోక్తభంగిని విరుద్ధము గాకుండ సమాధానమును జెప్పుచు నొక పెద్దవ్యాఖ్య వ్రాసిరి.అది తెనుఁగున చేర్ప ననువుగానిది కానఁ జేర్పలేదని యెఱుంగవలయు,

నిల నింద్రసమానుండై, యలరెడు నాయనుజాతోడ ♦ నగుపని యేమో.

చ. అని దనుజేంద్రుఁ డాడ విని ♦ యాగ్రహలాలసను న్నట్లు మేలుకో
ల్పను దగునీయకాలమున ♦ భావ్యమహాత్మ్య నటంచు వ్యాకులం
బును గని కుంభకర్ణుగృహ♦మున్ గనఁబోయిరి; రాక్షసేంద్రునా
జ్ఞను గొని వాటి మాంసమును ♦ బలుఁగ మెక్కుచు నల్లగ్రాగుచున్. ౨౩౪

సీ. కుంభకర్ణుఁడు మేలు♦కొన్నఁ దృప్తుడు గాని క్షుద్బాధనాపంగఁ ♦ గోరి విమల
గంధమాల్యములు భ♦క్ష్యంబులు గైకొని సర్వాంబులనుగూర్చి ♦ జనిరి; గొప్ప
బలములఁ దగు రాక్ష♦సులు నాగ గుహగత వ్యాగంబుగల్గి, యం♦తటను యోజ
నాయతంబయి, రమ్య♦మై కుంభకర్ణుని మేని గంధిన ♦ మేటిచంద

తే. నాదిపరిమళములు సొగు♦నట్లు పొలయు
గుహావలెం బొల్చియున్న యా♦ క్రూరదనుజ
సద్మమున కేగి యతని ని♦శ్వాసములును
వినుకరుణ నెట్టఁబడుచు ని♦ష్ప్రథి నాశిల. ౨౩౫ 2399

క. చని యాగేహముఁ జొచ్చిరి; దనుజులు వారట్లు బహువి♦ధంబుల శుభవ
స్తునికరభాసురమై కాంచనకుట్టిమములఁ జెలంగి ♦ దాగుతరంబై. ౨౩౬

చ. కనఁబడుదానిఁ జొచ్చి యట ♦ గాఢనుషుప్తిని బొంది భీతికృ
త్తనుఁ దగుచున్ బరుండి తగు♦దాసవసింహునిఁ గాంచి; రంత ని
ద్రను గనునట్టి వేళల ని♦తాంతమునుం దగ నావికారముల్
గనఁబడ నిద్రఁబొందుచును ♦ త్ర్యాస్థలిఁ గూలిన శైలమట్లు గన్. ౨౩౭ 2401

ఆ. నిద్రనుండి లేప ♦ నేరనిరీతిఁగా, నున్న యతనిఁ జేరి ♦ యొక్కరీతి
నంద యోకటఁ గూడి♦యట్టి మేల్కొలుపఁగా, సాగి రంత సమర♦సమితియందు.

క. తనువెల్ల నూర్ధ్వరోమాళిని దగఁగా నూర్పులను లలిన్ విడిచెడు పా
మును బోలి మహాశ్వాసము, లను భీతిని గొలుపుచున్న ♦ లయుపతిత్యుల్ఘన్.

తే. పందుకొనియు భయంబుఁ బా♦ల్పడఁగఁ జేయు
నాకృతిం దగ భయదనా♦సాంతరములు
తనరఁ బాతాళవిపులాస్య♦మునఁ జెలంగి
శయ్యఁ దాఁకంగ సవయవ♦సమితి మిగుల. ౨౪౦ 2404

సీ. శయనించి మున్ను దాఁ♦గి యువల నుంచిన మేదో రుధిరముల ♦ మేటివాస
నలు గుబాళింపఁ గ♦నకమయాంగదములఁ దాలిచి మకుటంబు ♦ తల ధరించి
పగతురఁ జెండు న♦న్నలుని రాక్షససింహుఁ గుంభకర్ణునిగనుఁ♦గొనుచునుండి;
రంత భీకరసత్త్వ♦లగు రాక్షసులు వాని ముందట సంతృప్తి ♦ నొందఁ జేయఁ

* శే ఈ తం విశ్వతం సుప్తం-అనియూ. విశ్వతమ నిద్రాకాలికవికారయుక్తమ-అనివ్యాఖ్య.

తే. జాలుమాంసములను మేరు♦శైలమంత
యెత్తుగాఁ బోసి రాతని♦యెదుట మఱియు
మృగమహిషసూకరమ్ముల ♦ వగుపలలము
లను మనోజ్ఞాన్నముల రాసు♦లనుగ నునిచి. ౩౨ 2405

క. సురరిపు లాతనిముందట, మరలను బహువిధమనోజ్ఞ♦మద్యము రక్తం
బరుదుగ నించినకడవల, సురారివరు ముందు నునిచి♦చొక్కఁపుఁబూన్కిన్. ౩౩

తే. ఆపరంతపుతనువున ♦ నమలరుచిర, చందన మలంది పరిమళ♦చారుపుష్ప
హారములు వైచి బహువిధ♦హారిగంధ, ములను నాతనిఁ గ్రేసేసి♦రెలమిమీఱ.

చ. దనుజులు శత్రుహంతయయి ♦ తద్దయు నొప్పెడువానికిన్ సుగం
ధనిచయధూపముల్ వయిచి ♦ దారతనిన్ నుతియించి, పల్మఱున్
ఘనములరీతిగా నఱచి ♦ క్రమ్మశశాంకుని బింబమట్లు లో
ప్పిన గురుశంఖవారములు ♦ ప్రీతిగ నొత్తిరి పెక్కురీతులన్. ౩౫ 2408

ఆ. అంద ఱొక్కపెట్ట ♦ నార్చి రాతఁడు మేలు, కొనమి కాగ్రహించి ♦ ఘననినాద
ముల నొనర్చి రెగిరి ♦ రలఘుభుజాస్ఫాల, నములఁ జేసి; రసుర♦నాథు నతని.

క. కరములఁ బట్టి కదల్చిరి, సురారిమేల్కొలుపువేడ్క ♦ శుంభద్ధ్వనులం
బరిపరిఁ గావించిరి; త, త్తరుణంబునఁ బఱులెల్ల ♦ దారుణరీతిన్. ౩౭ 2410

క. ధర భేరీపణవమహా, త్తరనిస్వనములను గర్జి♦తధ్వనుల భుజా
త్కార మప్పళించురవముల, నురుతరసింహధ్వనులను ♦ నొక్కటి వినుచున్. ౩౮

తే. దెసలకుం బ్రీతిఁ బాఱి సా♦ధ్వసము వదల
కుండుటన్ వ్యోమమున కేగి♦యును భయంబు
వాయమిన్ వేగ నేలపైఁ ♦ బడియె; మిగుల
శ్రమమునొంది కావించిన ♦ శబ్దములకు. ౩౯ 2412

క. అతిశయనిద్రం బొందిన, దితిజవరుం డించుకేని ♦ తెప్పిఱిలమిఁ గాం
చి తగ మహత్తరకాయుని, నతనిం గని యసురవర్యు ♦ లంద ఱొకటిగాన్.

తే. ఇనుపగుదియల రోఁకళ్ల ♦ నెల్లగదలఁ, గరములం బట్టుకొని; రుద♦గ్రతరరూపు
లైనవారద్రిశృంగాళి♦నట్టె ముసల, ములను గదలను భూరుహ♦ములను బూని.

సీ. ప్రహరింపసాగిరి ♦ పటుహస్తతలములముద్గరసంతతి ♦ ముష్టులను ద
గంగ భూస్థలిమీఁద ♦ గాఢసుప్తిం జెందునాతని గొట్టి రా♦యసురు లెంతొ
బలవంతులయ్యుఁ గుం♦భకర్ణునిశ్వాసవాతముచే నిల్వ ♦ వశముగామి
నతనిమోఁకులకుఁ దప్పి; ♦ రంత భయంకరవిక్రములగువార ♦ లీక్రమమున

తే. నెంతయత్నమొనర్చిన ♦ సుంతయైన
నతఁడు మేల్కొనునూచన ♦ లగపడమిని

వగచి యందులకై మఱి ♦ తగినయత్న
ములనొనర్పఁగఁ బూనిరి యు♦క్తగతులను. ౮౧ 2415

క. దనుజులు పదివేవురు చుట్టును దమకు సహాయులయి క♦దుర్వర్తిల నా
తనిచుట్టు మృదంగంబుల, ఘనభేరీపణవశంఖ♦గణముల నుఱియుచ్ ౮౨

ఆ. ఏకకాలమందె ♦ యెల్లకుంభంబుల, మ్రోఁగఁ జేసి; గంభ ♦ రాతునయను
లగుచుఁ గొటుకవలె ♦ నాకృతిగల్గినై, ... యూసునాగ ♦ ప్రాక్కరీతి. ౮౩

చ. దనుజవరేణ్యుఁ గొట్టుచు ని♦తాంతము నార్చుచు మేలుకొల్పినన్
గనుఁగన విప్పఁడయ్యె; నిటు ♦ గట్టిప్రయత్నము చేసి కుంభక
ర్ణుని నిసుమంత లేవుటకు ♦ నోఁచక యింకను దానినట్టి మిం
చినయతిఘోరయత్నములఁ ♦ జెచ్చెఱఁ జేయఁగఁ బూని రొక్కటన్. ౮౪

క. కరిఘోటకోష్ట్రసంతతి, ఖరముల నెక్కించి త్రొక్కఁ♦గాఁ జేసిరి భీ
కరదండకశాంకుశముల, నురుగతులను వానిఁ గొట్టి ♦ యొక్కటఁ గునన్. ౮౫

క. భేరీశంఖమృదంగము, లీరనమున మ్రోఁగఁ జేసి ♦ రెంతో బలములన్;
వారట్టభుజస్తంభము, లారీతి సుహేంధనమ్ము ♦ లట్లీముసలముల్. ౮౬ 2420

క. పెనుముద్గరములు గైకొని, యనూనబలము లెప్పింగ ♦ నతని నడచి; రా
ధ్వని గురుతరమై లంకా,వనసర్వతముఖ్యవివిధ♦భాగములందున్. ౮౭ 2421

క. చెలరేఁగి నిండి నగరము, పలువిధముల మాఱుమ్రోసెఁ ♦ బరమనుష్యున్
వెలసెడు నా దనుజుఁడు కన్నులవిప్పక నిద్రఁబోయె ♦ నగాత్మనభంగిన్. ౮౮

తే. వేయిభేరులఁ గాంచన♦విమలదండ,ములను గొట్టిరి వారెల్ల♦ మొక్కలముగ
నొక్కటిగఁజేరి చుట్టును ♦ బిక్కటిల్లి, యేకకాలంబునందు స♦హీనశక్తి. ౮౯

క. ఏకార్యము లొనరించిన, నాకర్బురవరుఁడు బ్రహ్మ♦వగుశాపముచే
నాకటికనిద్రఁ జెందుచు, నాకరణిఁ బఱుండె నుంచ♦ నైనఁ గదలకే. ౯౦ 2424

చ. కనుఁగొని వాని రాక్షసులు ♦ గాఢపరాక్రము లెల్లఁ బూర్వమే
మనమునఁ గల్గుకోపమును ♦ మండుచునుండిన వారలత్తఱిన్
జెనుక్రుధఁ బూని యాతనిని ♦ భీమగతుల్ దగ లేప ముష్టులం
గొని ప్రహరించి విక్రమ ము♦కుంఠితసాహస మవ్వ చూపుచున్. ౯౧ 2425

క. చెలఁగిరి కొందఱు నిస్వనములఁ జేసిరి మిగులశౌర్య♦మున భేరుల ని
మ్ముల వాయించిరి కేశంబులఁ బెఱికిరి కొంద ఱసుర♦వుంగవు చెవులన్. ౯౨

తే. పంక్తబలిమిని గొఱికిరి ♦ పరఁగఁ బోసి
రతని చెవులందునుం గుంభ♦శతజలముల
నప్పటికినైన భూరిని♦ద్రాభియుక్త
చిత్తుఁడై యుంటఁ గదలికఁ ♦ జెందఁడయ్యె. ౯౩ 2427

క. బలవంతులు దనుజులు గుదియల నమ్మటలన్ గ్రహించి ♦ యాతనివక్ష

ష్ఠ నెలమున నితరాంగమ్ములఁ, దలయందును మోది రతుల♦దర్పస్ఫూర్తిన్. ౨౪

సీ. త్రాళ్లచేఁ జర్మబం♦ధనములచేతను గడుదృఢంబుగఁ గట్టఁ♦బడినయట్టి
బలుశతఘ్నులచేత ♦ నలఘుకాయుండెంతఁ గొట్టఁగాఁబడినను ♦ గొంచెమేని
మేలుకొనండయ్యె; ♦ మేటిగజంబుల వేయింటి నతనిపై ♦ నాయసురులు
త్రొలిత్రొక్కంజేసి♦గోలినిట్టులుత్రొక్క నతఁడు మేల్కానియెన♦య్యవియుఁ జిన్న

తే. పురుగు లంగంబుపయిఁ బ్రాఁకి ♦ పోవునట్టు
లాత్మలోపలఁ దలఁచె న♦య్యసురులు తను
మేలుకొనజేయవై చెడు ♦ మేటిపర్వ
తముల శృంగంబులను వృక్ష♦తతుల నెల్ల. ౨౫ 2429

క. కరముల గ్రహించి కొట్టిన, నరకుగొనక నిద్రయుడిగి ♦ నసుధికమగుచు
త్పరిపీడితుఁడై సాంగో,త్కరము విఱుచుకొనుచు లేచెఁ ♦ దటుకున గర్ణ.

తే భుజగములయట్లు నిడుదలై ♦ భూధ్రశిఖర
ములవిధంబునఁ బలువున ♦ వెలసి శిఖరి
శృంగసారంబులై వెల♦సెడు స్వబాహు
వులను గడుఁజాఁచి బడబను ♦ బోలుముఖము. ౨౭ 2431

తే. వివృతిఁ గనఁజేసి భయదమా ♦ విధము తోఁప
నావులించెను; దత్కాల♦మందు నాగ
భువనసమవక్త్ర మది తల♦పోసి చూడ
నలరు సావర్ణి మేరుశృం♦గాగ్రసీమ. ౨౮ 2432

క. సరసిజబాంధవుబింబం, బరుదుగఁ జూపట్టురీతి ♦ నలరారె; మహా
త్తరబలుఁ డాతఁడు వక్త్రము, సరిగా వివృతం బొనర్చి ♦ సరభసవృత్తిన్. ౨౯

తే. ఆవులించుచు లేచె న♦య్యదనున గిరి,నుండి వాయువువీడిన ♦ ట్లొప్పె నతని
దీర్ఘనిశ్వాసపవనుండు ♦ తీవ్రవేగ,మునను విసరెను, నిదుర లే♦చునపు డతఁడు.

క. నిరుపమకలాపభూషిత, శరీరుఁడై యుండెఁ గానఁ ♦ జంచత్తను వ
త్తరుణమున వృష్టి గురియుచుఁ, గరము బలాకావృతంబు♦గా జలదంబుల్.

క. వెలసెడుతీరునఁ జక్కఁగ, నలరారెను; మండుచున్న ♦ హవ్యవహుని య
ట్టులు క్రూరములై మెఱుపుల,వలెఁ జలియించుచును దనుజ♦వరునేత్రంబుల్.

క. శనిభూసుతు లనుపేరులఁ, దనరుమహాగ్రహములట్లు ♦ దారుణబాధల్
గనఁజేయుచు నొరులకు భీ,తిని గొల్పుచువెలసె; నంత ♦ దితిజులు పూన్కిన్.

సీ. బహువిధములయిన ♦ భక్ష్యములను వరాహంబుల మహిషాళి ♦ నతని కర్ప
ణముసేయ దనుజాధి♦నాథుఁ డాగురుబలుఁ డవ్వాని భక్షించె; ♦ నమరనాథు
పగవాఁడుగాఁదగి ♦ పలలాశనవరుండు నగుకుంభకర్ణుఁ డ♦య్యదనునందుఁ
బలలంబు మెక్కి యాఁ♦కలి నెడఁబాపుచు దప్పిచే నెత్తురుఁ ♦ ద్రాగుచు మఱి

తే. బానలకొలంది మెదడును ♦ వారుణిఁ గమిఁ
ద్రాగె; భయమున నొకచోట ♦ దాఁగియున్న
దనుజు లప్పు డాతండును ♦ కనివినొంది
నట్టులెఱుఁగుచుఁ జెంతకు ♦ నరుగుదెంచి. ౧౪॥ 2438

క. శిరములను వాంచి మ్రొక్కుచుఁ, బరివేష్టించి రఘువరునిఁ ♦ బలాళినుండ్రై
సురవైరియైన యతఁడు ని,దురఁ బుబ్బానఁ గొంతవిప్పి ♦ ఛోదన వానిన్. ౧౫॥

తే. మాయచుండుటఁ గలఁతను ♦ బూనియున్న
నయనములఁ జూపు నిగుడించి ♦ నాల్గుదెసల
దనుజులను నెల్లవారిఁ దాఁ ♦ గనియె; దనుజ
వర్యుఁ డాకుంభకర్ణుఁ డ♦వ్వారి నెల్ల. ౧౬. 2440

క. మనమలర నూఱడించుచుఁ, దను మేల్కొల్పంగ నాకు ♦ దార్కొనుటకు నే
పనియో యను నాశ్చర్యం,బును గని యుట్టనియె వారిఁ♦బొలుపుగఁ గనుచున్.

క. నను లేపందగు కారణ, మన నేదో యిట్టిదా ప్రయత్నంబున, రా
జునకున్ గుశలంబే కద, నను జేరున కేభయంబు ♦ నగుబడుగా నే. ౧౮ 2442

ఆ. అట్లుగాకయున్న ♦ నన్యులనుండి భయంబు గలిగియున్న ♦ నగు నిజంబు
దాని నణఁచుకొఱకె ♦ నేనింత వేగను, నిదుర లేపఁబడితి♦ని నిటఁ బూన్కి. ౧౯

చ. దనుజవరేణ్య సాధ్వస ము♦దారబలంబునఁ ద్రోసిపుచ్చు నిం
ద్రునినయినం గరం బలిగి ♦ త్రుంచెద నగ్ని నశింపఁ జేయుదున్;
నను గురువైన యాదనుజ♦నాథునకుఁ డిప్పుడు నప్పు కారణం
బున నిదురించుచో నరుని ♦ బూనిక మేల్కొలుపంగఁ బూను నే. ౨౦॥ 2444

క. కనుకన్ నన్నున్ మేల్కొ,ల్పిన కారణ మున్న దున్న♦విధమునఁ జెప్పం
జను; నంచు మహాబలుఁ డా,దనుజవరుం డనిన వినుచుఁ ♦ నగువిసయమునన్.

తే. అసురనాథునిమంత్రి యూ♦పాక్షుఁ డనియెఁ
గరయుగంబును జోడించి; ♦ కర్బురేంద్ర!
యమరతతినుండి మాకు నే♦యాపనునందు
నుంతయే భయ మబ్బదు ♦ నుమ్ము నిజము. ౨౨॥ 2446

క. మనుజులవలనన మాకిపు, డనూనభయ మంకురించి ♦ యయ్యది బాధిం
పను బూనియున్న; దోదను,జనిశరపుంగవ! వచింతు ♦ సత్యము వినుమీ!. ౨౩

చ. మనుజులనుండి మాకిపుడ♦మానుషవిక్రమ! సంభవించె లం
కను గల సర్వదానవులఁ ♦ గాఱియ పెట్టుచునున్న భీతి యే
దనుజులనుండిగాని సుర♦దానవ దేవగణంబునుండి గా
ని నిజ మదెప్పుడిప్పుగిది ♦ నిర్భరరీతిని గల్గ లేదునూ!. ౨౪ 2448

క. గిరితుల్యాకారులు వన,చరులెల్లను లంకచుట్టు ♦ గౌర్యమ్ములఁ బొ

ల్చిరి నిల్చి రథ్యముగ రఘు,వరుఁడును సీతాపహారణ♦పరితప్తుండై. ౭౪౹ 2449

తే. తుములభయమును మాకిట్టు ♦ లమరవైరి
పుంగవా! కల్గఁజేసె; ము ♦ న్నంగనార్థ
మరుగుదెంచిన యొకవన♦చరునిచేతఁ
బురవరంబిద్ది దగ్ధమై ♦ పొడ వడంగె. ౭౫౹ 2450

క. అనుచరబలములతో నా,తనిచే నక్షుండు తెగియె; ♦ దనుజాళికి నె
ల్లను రాజు దేవకంటకుఁ, డనిహతవిక్రముఁడు నీదు♦నన్నయు ననిలోన్. ౭౬౹

క. సరసిజబాంధవతేజ, స్ఫురణంబునఁ బొల్చురామ♦భూమీశునిచే
నరయ మృతప్రాయుఁడుగా, దురమున విడువంగఁబడియెఁ ♦ దోఁపదు పలుకన్.

చ. దనుజగణాధినేతకును ♦ దానవదైత్యులు దేవతల్ దురం
బునఁ గడుశక్తి నే పనిని♦బూని యొనర్పఁగఁ జాలకుండి రా
పని నిపు డారఘూత్తముఁడు ♦ బాగుగఁజేసెను బ్రాణసంశయం
బున దశకంఠునిన్ వదలెఁ ♦ బో యనిచెప్పినఁ గుంభకర్ణుఁడున్. ౭౮ 2453

క. తనయన్న రావణాసురుఁ, డనిని బరాజయము నొందె ♦ నని యెఱుఁగు యూపా
క్షునిమాటల విని కోపం,బునఁ గన్నులు త్రిప్పి పలుకఁ ♦ బూనె నియతిమై.

క. ఓయూపాక్షా! యిపుడే, యాయుటవిచరాళి నెల్ల ♦ నాలక్ష్మణునిం
బాయనిశక్తిని రఘుభూ,నాయకు ననిఁ ద్రుంచి యవల ♦ నాయగ్రజునిన్.

క. కనియెదఁ; గపిశోణితమాం,సనికరమునఁ దృప్తిచేయఁ ♦ జాలుదు దనుజా
ళిని, రామలక్ష్మణుల న,ల్లను నేనే త్రాగువాఁడ ♦ లలితప్రీతిన్. ౮౧ 2456

క. *అని యిట్లు గర్వరోషము,లను దోషము వృద్ధిగాఁగ ♦ లలిఁబల్కెడు నా
తనిపల్కులవిని కరయుగ, మును మోడ్చి మహోదరుండు♦మునుకొనుప్రీతిన్.

క. దనుజతతిముఖ్యుఁడయి తా, ఘనశక్తిం దనరువాఁడు ♦ గావునఁ బలికెన్;
దనుజేంద్ర! మహాబాహూ!, చని రావణుఁ గాంచి తద్వ♦చనమును వినుచున్.

తే. గుణములను దోషముల మదిఁ ♦ గోర్కి వివిధ
విధములను జక్కఁ దర్కించి ♦ విమతులనట
మీఁదను జయింపవచ్చు స♦మీకమందు;
నను మహోదరుపల్కుల ♦ నపుడు వినుచు. ౮౩ 2459

క. గురుబలమున వరతేజ, స్ఫురణంబునఁ బరఁగుదనుజ♦పుంగవుఁ డంతన్
సురరిపులు తన్నుఁ గొలువఁగ, నరుగం దలపోసె నన్న♦యంతికమునకున్.

క. దనుజులు భయంకరములగు, కనులును బౌరుషము మిగులఁ♦గలుగుదనుజనా
థునిఁ గుంభకర్ణు మేల్కొ,ల్పి నితాంతజవంబు మీఱఁ♦బృథుమోదమునన్.

* సగర్వితం రోషవివృద్ధదోషమ్-అనిమా.

త నతఁడు తీవ్రతేజుఁడు ఘ♦నద్యుతి రాముని గాంచి భూపతీ!
యనఘ! ననుఁ సభాస్థలికి ♦ సాదృతిఁ బిల్వఁగ బంచినాఁడుగా. ౨౦౩ 2564

క. పని యేమొ తెల్పుఁ డన విని, జనపతి యాభిక్షువుఁ గని ♦ చక్కని ప్రీతిం
గనఁబఱచి పల్కె; భూసుర!, శునకముఁ బ్రహరించి తేల?♦చోద్యము గాదే.

తే. ఏమి యపకృతి నీకు నీ♦యిది యొనర్చె
నండమునఁ గొట్టఁ దగినట్లు; ♦ దారుణమగు
క్రోధమే ప్రాణహారమగుఁ ♦ గ్రోధ మెన్న
మిత్రముగఁ గానఁబడెడు న♦మిత్ర మగును. ౨౦౫ 2566

సీ. అతితీక్ష్ణమగు ఖడ్గ ♦ మనఁ గ్రోధమే సుమీ సకలంబు ముచ్చిలఁ♦జాలుఁగ్రోధ
మరయఁ దపంబులు ♦ యజ్ఞదానంబులు భక్తిఁ జేసిన నవ్వి ♦ భస్మములగుఁ
గ్రోధంబునం గానఁ ♦ గ్రోధంబు విడనాడఁ గాఁదగు నింద్రియ♦గణము చాల
దుష్టమౌ నదియును ♦ దొందఱగాఁ బోఱు నశ్వమ్ములట్లు ధై♦ర్యమున నరుఁడు

తే. తాను సారథికృత్యంబుఁ ♦ దగను జేయ,నింద్రియములకుఁ గన్పడు♦నట్టివస్తు
వద్దికని పెట్టి మెలఁకువ ♦ నవనిదేవ!,మనసుచే వాక్కునం గర్మ♦మునను దృష్టి.

క. కని పెట్టి చక్క నడుపం, జనునతనికి శ్రేయ ముబ్బు ♦ శత్రువు కనరాఁ
డనుమానింపం బగు దా,నినిఁ గాంచఁగ లేఁడు ధరణి ♦ నిర్జరవర్యా!. ౨౦౭ 2568

తే. క్రోధదారుణఖడ్గంబుఁ ♦ గొనని వాఁడు
కరమునం దాల్చి వధియించు ♦ గనఁబడినది
యెల్ల దురనుష్ఠితంబగు ♦ నెవని చిత్త
మంతకంటె విరోధి యీ♦యవని లేఁడు. ౨౦౮ 2569

క. మనుజుఁడు వినీతవినయుం, డనఁబరఁగినఁ బ్రకృతి యతని ♦ నాకర్షించున్
విను మాచ్ఛాదించినఁ బ్రకృతిని నది కార్యంబులందుఁ ♦ దేఁకువ నొందున్.

తే. మార్పు నొందదు దాఁచిన♦మాత్రమునను
యని రఘూద్వహుఁ డాడిన ♦ మనుజులకును
గష్టమిడు కర్మములఁ జేయఁ ♦ గడఁగని పతి
పలుకు లాలించి యాద్విజ♦ప్రవరుఁ డెంచి. ౨౧౦ 2571

క. రామునితో నిట్లనియెన్, భూమీశా! కోపకలిత♦బుద్ధిని నేనే
యీమాడ్కిఁ గొట్టితిని విను, మోమాన్యా! కారణంబు♦నొగి నెఱిఁగింతున్.

సీ. భిక్షార్థ మిప్పూట ♦ వీధులఁ దిరుగుచు నుంటినే సత్తతి ♦ నొక్కభిక్షు
మేని నా కొదవద♦య్యెను వీథినిలుచున్న యీశ్వానమును గాంచి♦యేగుమవల
నంటిని స్వేచ్ఛగా ♦ నరుగుచు నీకుక్క దారి కడ్డంబుగాఁ ♦ దాను నిలిచి
యుండె నాఁకలిగొని ♦ యుండినవాఁడను గానఁ గ్రోధంబున ♦ నేను దీని

తే. గొట్టినాఁడను రాజేంద్ర! ♦ క్రూరకర్మ
మిద్ది యపరాధి నేఁ గాన ♦ నెంచి శిక్ష

నాకు విధియింపుమా దండ♦నమును బొంది
నరకభయముక్తిఁ గందు భూ♦నాథచంద్ర!. ౩౦½ 2573

చ. అన విని యాసభం గలుగు♦నట్టి మహాత్ముల నేమి ప్రాచితం
బని రఘురాముఁ డాధృతిని ♦ నందఱిఁ బ్రశ్న మొనర్చి యెట్టిదం
డన మిపు డీయఁగాఁ దగు మ♦నంబున నెన్నుఁడి యర్హశిక్ష చే
సినఁ బ్రజ లెల్ల రక్షితులు ♦ చెచ్చెఱఁ బల్కుఁడటన్న నాసభన్. ౩౨ 2574

ఆ. అంగిరసుఁడు, కుత్సుఁ, ♦ డాభృగు కాశ్యపు, లవ్వసిష్ఠుఁ డింక ♦ నర్హధర్మ
పాఠకులగు మంత్రి♦వర్యులు పౌరులు, నింకఁ గలుగు పండి♦తేంద్రు లెల్ల.

చ. మనమున నెంచి యెంచి పలు♦మాఱులు చక్కఁగ నిశ్చయించి యి
ట్లనిరి వధింపఁగాఁ దగఁ డి♦లామరుఁ డంచు మహాత్ము లెల్లఁ జె
ప్పిన వినియుందు మేము పృథి♦వీవర! క్షత్రియధర్మ మిట్టులే
తనరును నాఁగ రాముఁ డిది ♦ తథ్యము గావున నెంచి పల్కుఁడీ!. ౩౪½ 2576

క. అనినన్ మును లారసి యి,ట్లనిరి మహీపాలకుండె ♦ యర్హుఁడు దండిం
పను నీవు విశేషించియు, ఘనబుద్ధివి త్రిజగములకుఁ ♦ గర్తవు నీవే. ౩౫½

క. అనువుగ దండింపను నీ, వనూనశక్తిం జెలంగు ♦ వరయంగ సనా
తనుఁడవు విష్ణువు నీవే, యని పలుకుచు నుండ శ్వాన ♦ మవు డిట్లనియెన్.

చ. ధరణిప! తృప్తి నొంది సత♦తంబును నాయెడఁ బ్రీతి నొందు దే?
వర మొకఁ డీయఁగా దగు ధ్రు♦వంబుగ నాకుఁ బ్రతిజ్ఞ చేసి తీ
పురుకరుణాఢ్య! యేమి వల♦యుం బని చెప్పుము దానిఁ దీర్తు నే
నరసి యటంచు దానికయి ♦ యాధృతి వేఁడగ నెంచితిం జుమీ!. ౩౬½

*క. దేవాగారపతిత్వం, బీవిప్రున కిమ్ము చాలు ♦ నిదియే వరమా
భూవల్లభ! నాకు ననం,గా విని శ్రీరాఘవుండు ♦ హ్లాదివిజునకున్. ౩౭½

సీ. కౌలాధిపత్యంబు ♦ కఠినశిక్షగఁ గోరి శునకంబు చెప్పిన♦చొప్పున నవు
డభిషేక మొనరించి ♦ యావిప్రు గజమూర్ధమున నెక్కఁ జేసి చ♦క్కనివిధులను
బూజింపఁగా మంత్రి♦పుంగవు లాశ్చర్యకలితులై యిట్లని ♦ పలికి రపుడు
వర మిద్ది కుక్క కో♦ధరణీశ! యిచ్చితి రిదిశాప మెట్లొ న♦హీనతేజ!

తే. యనఁగ విని రామచంద్రుఁ డి♦ట్లనియె మనము
దీనికారణ మెఱుఁగము ♦ శ్వాన మెఱుఁగు
దాని నడిగెద నంచని ♦ తాను బ్రశ్న
మొప్పఁగాఁ జేయ, నిట్లని ♦ చెప్పె నదియు. ౪౨ 2581

క. నరవర! నేఁ గులపతినై, చిరకాలం బుంటి నచట ♦ శిష్టాన్నం బా
దరమునఁ దినుచున్ సురభూ,సురపూజలయందుఁ జాల ♦ శుభచిత్తుఁడనై. ౪౩

* ప్రయచ్ఛ బ్రాహ్మణ స్యాస్య కౌలపత్యం నరాధిప-అనిమూ.

తే. ద్రవ్యమును బంచి పెట్టుచుఁ ♦ దగినరీతి, దేవతాద్రవ్యరక్షణం ♦ బావిధమునఁ
గాచుచుఁ శీలవినయముల్ ♦ గ్రాలుచుండ, సర్వసత్వహితుండనై ♦ సంచరించి.
క. చిరకాలము నివసింతి భూవర! యధమాధము మటంచుఁ ♦ బలుకం దగుదు
స్తరమైన యీయవస్థను, గరము విచారమునఁ బొందఁ ♦ గల్గితి నిచటన్. ౪౪
సీ. నావలెనే ద్విజ♦నాథుఁ డీతఁడు క్రోధసంయుతుం డచ్చటఁ ♦ జనఁగవలయు
నెవఁడు క్రోధం బూని ♦ యెవుడు నృశంసుఁడై యపగతధర్ముఁడై ♦ యనుపలబ్ధ
విద్యుఁడై యుండు నా♦విప్రుండు పదునాల్గు జన్మంబులందు దు♦స్తరతరాఘ
కూపంబునం బడి ♦ కుందును గావునఁ గొలపత్యం బ దే♦కాలమందు
తే. నిష్టపడకుండుసుజనుల ♦ కెల్ల నెవఁడు
నరకమునను సపుత్రబాం♦ధవయుతముగ
గడుగఁ గోరునో దేవతా♦యతనపతిగఁ
జేయఁదగు వానిఁ గరుణాఢ్య! ♦ శ్రీరఘువర. ౪౫ 2585
క. ధేనువ్రాతంబులవియు, భూనిర్జరవిత్తపైనఁ ♦ బూనుపదగుఁ జు
మ్మీ నేఁ జెప్పినయధికృతి; భూనాథా! క్షితిసురస్వ♦ముల్ సురధనముల్. ౪౬
క. వనితాబాలద్రవ్యం,బు నెవ్వఁడేఁ దొంగిలింపఁ ♦ బూను నతఁడు మి
త్రనిచయయుతుఁడై నాశం,బును గను, సురభూసురస్వ♦ముల్ రఘునాథా!
క. పరికింపక కైకొను నాయనుఁ డొందును వీచి యనెడు ♦ నరకంబును దు
స్తరమైనదాని; మది నే,సురభూసురవిత్తరాశి ♦ నులువని కొనఁగన్. ౪౮
క. తలఁచునో యాతఁడు ఘోరం, బగునరకంబైన నరక♦మందుం బడు; భూ
పలలామా! యనుశునకపుఁ,బలుకులు విని విస్మయమునఁ ♦ బార్థివపతియున్.
తే. నేత్రయుగ్మము వికసింప ♦ నెమ్మిఁ బొదలె
శ్వాన మారామచంద్రునా♦జ్ఞను శిరంబు
నందుఁ దాలిచి వేడంబు ♦ నరుగఁ జనియె
వచ్చినట్టులె; కుక్కయు ♦ వనముల కగ. ౫౦ 2590
క. తనజాతిని స్మరియించును, జనపము మాత్రముననపయ♦శంబుఁ గనుచుఁ గా
శిని నివసించెను బ్రాకృతము, కెంతయు మాత్రయందుఁ♦బొగులొదవంగన్.

అధికపాఠము, రెండవ సర్గము సంపూర్ణము.

---

3 - సర్గము.

గృధ్రోలూకోపాఖ్యానము.

క. తరువాత నొకవనంబున, నిరతసుఖం బబ్బుచోట ♦ నివసించె మనో
హరగృధ్రోలూకంబులు, ధరణీధరనికటమందుఁ ♦ దద్వన మలరన్. ౧ 2592

చ. తరునికరంబు రమ్యముగఁ ♦ దద్వనసీమ వెలుంగుచుండు ద
స్తరనది యొండు సంతతము ♦ చక్కఁగఁ బాఱుచునుండు సింహముల్
గురుతరభల్లుకంబులును ♦ గుంపులుగాఁ దగు వ్యాఘ్రసంతతుల్
కరము భయంకరంబులయి ♦ క్రాలుచునుండుఁ జెలంగుఁ బక్షులున్. ౨ 2593

చ. పికములు కూయఁ దుమ్మెదలు ♦ పెంపు దలిర్పఁగ ఝంకృతుల్ మనో
జ్ఞకముగ సల్ప గూబయును ♦ జక్కనిగృధ్రము చాలవర్షముల్
సకలసుఖంబు లిచ్చుటకుఁ ♦ జాలిన యావనమందు నుండఁగా
నొకదినమందుఁ బాపమతి ♦ నొప్పెడు గృధ్రములూకసద్మమున్. ౩౪ 2594

చ. తనదని వాదులాడుటకుఁ ♦ జార్కొనె; నయ్యది పుండరీకలో
చనుఁ డఖిలేశ్వరుండు రఘు♦సత్తముఁ డయ్యెడనుండు నచ్చటం
జని యిది దేనిదో యనుచుఁ ♦ జక్కఁగఁ జెప్పకొనంగ నాతఁ డొ
ప్పినగతిఁ దీర్చు నీతగవు ♦ వేగమ పోవుద మంచు నత్తఱిన్. ౮ 2595

చ. మనముల నిశ్చయించుకొని ♦ మండెడుకోపము నీర్ష్యయుం దగన్
జని రఘురామచంద్రుఁ గని ♦ స్వాంతము లాకులతం గనంగ నా
తనిచరణారవిందములఁ ♦ దాఁకి నమస్కృతి సల్పి యొార్వలే
మిని నితరేతరంబు మది ♦ మించెడుక్రోధరసంబు పొంగఁగన్. ౬ 2596

క. నిలుచుండె; నంత గృధ్రము, పలికెన్ దేవాసురులకుఁ ♦ బతి వీవె ఖగం
బులమగు మాకుం జెప్పఁగ,వలెనే ప్రభు వీవె యనుచు ♦ వసుధానాథా!. ౭

క. గురుశుక్రులకంటె మతి,స్ఫురణంబున శ్రేష్ఠుఁడవుగ ♦ శోభిలుదువు నీ
వరయఁగ నెల్లరవగు నం,తరముల నెఱుఁగంగఁ జాలు ♦ దక్షుఁడవు సుమీ.

సీ. కాంతిచే శశిమించఁ♦గాఁ జాలుదువు నీవు సూర్యచందంబునఁ ♦ జూడరాని
యట్టితేజంబున ♦ నలరుచునుందువు గౌరవంబున హిమ♦క్ష్మాధరమున
కెనయగుదువు సంద్ర♦మును బోలుగాంభీర్యములరులోకేశుల♦యందు యముని
చందంబునం జండ♦శాసనుండవు నీవు శమమున నిలతోడ ♦ సముఁడ వరయ

ఆ. ననిలుసాటిచేయ ♦ నర్హుఁడ వతిజవ
మునను సత్వయోగ♦మున గురుఁడవు
యశముగల్గువాఁడ ♦ వతిదుర్జయుఁడ వీవె
విజయశాలి వగుచు ♦ వెలయు దీవు. ౧౦ 2599

క. అనుపమశాస్త్రాభిజ్ఞుఁడ, వనూనబలశాలి వీవ ♦ యగుదువు రామా!
మనవి యొనర్చెద దీనిన్, వినవలయు మహీనుహేంద్ర! ♦ వినుతగుణాఢ్యా!.

చ. నిలయము నేను గట్టుకొన ♦ నిర్భయరీతి నులూక మిద్ది యి
మ్ముల గురుబాహువీర్యమున ♦ భూపవరా! హరియించె దాని నా

కలవియె పోర నీవె యిపు ♦ డాలయమార్తను శిక్ష చేయుమా
చెలఁగెడు సత్కృపాఘ్యుఁడవు ♦ చెప్పఁగ నేర నిఁకేమి యంచనన్. ౧౩ 2601

క. విని యిట్లనియె నులూకం, బనఘా! శశిసూర్యవజ్రి ♦ యమధనదులనుం
డి నరేశుఁడు పుట్టెనుగా, మనుజత్వ మెనుపుంతె దేవ ♦ మయుఁడ వగుదునా!

క. నారాయణుఁడవు నీవనఁ,గా రాజిల్లుదువు చాలఁ ♦ గా సౌమ్యత నీ
చారుముఖంబునఁ జెప్పెడు, నారయ సోమాంశభవుఁడ ♦ వౌటఁ దెలుపుచున్.

తే. కోప మొందఁగ దండింపఁ ♦ గూర్మి నీయఁ
శాపభయముల మాన్పంగఁ ♦ బ్రభుఁడ వీవె
దాతనయి మార్తవగుచు ను ♦ ద్దామగోప్త
వగుచు నింద్రుఁడవయి నీవె ♦ యలరు దెవుడు. ౧౬ 2604

క. భూతవ్రాతంబులవే, యేతత్త్రైనం బెలంప ♦ నెంచిన నిల నే
రీతిన్ శక్యముగాకయె, భూతలనాథ! తేజమునను ♦ బోలుతు శుచి యనన్.

క. లోకము వెలుఁగొం జేయుట, నాకసులా పువివిధంబు ♦ నారయఁ గను దో
భూకాంత! ధనదతుల్యుఁడ, వోకను నధికుండవో మ ♦ హోన్నతిఁ గనఁగన్.

క. ధనపతిచెంతనె పద్మయుఁ, దనగున్ నీయందు సిరిస ♦ తంబును వెలయున్
ధనదుఁడు కోపంబున నొ,ప్పును గోపము లేక నీవు ♦ పొల్తు ధనదతన్. ౧౯

తే. సర్వభూతసముండవు ♦ స్థావరములు
చరములగుభూతముల్ నిన్ను ♦ సముఁడ వనుచుఁ
దలఁచు శత్రువునందు మి ♦ త్రులనయి నొక
విధముగా నీదుదృష్టియు ♦ వెలయుఁ జుమ్ము. ౨౦ 2608

సీ. ధర్మంబుచేత ని ♦ త్యంబు శాసింతువు వ్యవహారమందుఁ ద ♦ ప్పదు గద విధి
యెవనివైఁ గోపింతు ♦ మృత్యు వాతనివంకఁ బరుగిడుచుండును ♦ బార్థివేంద్ర!
కావున యముఁ డనఁ ♦ గాఁ గీర్తి నొందుదు వమితవిక్రముఁడవే ♦ యాదు వీవు
మనుజశ్రేష్ఠ మనుపది ♦ యను శేష నీయందుఁ గరుణారసముఁ జూపఁ ♦ గాఁదగె నని

ఆ. పలుకవచ్చు; భూత ♦ ములయందు తమిగల్గి
యలరు దీవు శరణ ♦ మనఁగ లేక
దుర్బలుండు నగుచుఁ ♦ దోఁచుమానవునకు
బలము ప్రభువె కాఁడె ♦ లలితశీల!. ౨౨ 2609

క. నయనవిహీనున కీవే, నయనము గతిలేనియట్టి ♦ నరునకు గతినీ
వె యగుదు మా కెల్లను నుతి,నియతా! నాథుండ వీవె ♦ నృపతివరేణ్యా!. ౨౩

చ. వినుము మఱి నీవు నాదయిన ♦ విన్నప మో జనపాల! గృధ్ర మొ
ప్పనివిధి నాదుగేహమును ♦ బల్మిని జొచ్చిన దంతెకాక నా
కనిశము బాధఁ గూర్చెడి, మ ♦ హాగుణ! దేవమనుష్యులందు నీ
వె నియతశాస్త్రవాదు వని ♦ యేమియుఁ బల్కకయున్న రాముఁడున్. ౨౪

క. విని దానివాక్యములు చయ్యన మంత్రులఁ బిల్వఁబంచె ♦ నంత జయంతుం
డును ధృష్టియు సిద్ధార్థుం, డనుమంత్రియు విజయనాముఁ♦డగు సచివుండున్.

తే. ధర్మపాలుఁడు రాష్ట్రివ♦ర్ధనుఁ డశోకుఁ
డాసుమంత్రుండు ననువార ♦ లర్కవంశ
సత్తముండగు రాముని ♦ సచివు లతని
జనకునకుఁ గూడ వారలే ♦ సచివు లెపుడు. ౨౬ 2613

తే. నీతియుక్తులు గురుమతుల్ ♦ నిఖిలశాస్త్ర
కోవిదులు ప్రీతియుక్తులు ♦ కులఘను లిల
మంత్రనయకోవిదులు గాన ♦ త్యాగవరుండు
వారలను బిల్వఁబంచి పు♦ష్పకము నాత్మ. ౨౭ 2614

క. తలఁపఁగ నది రాఁగా వారలతో నద్దాని నెక్కి ♦ రయమునఁ జని కా
నలనున్న యానివాసము, నులువుగఁ గని వాని నడిగె ♦ సుస్మిత మొప్పన్. ౨౮

తే. గృధ్రమా! యీగృహంబు నీ ♦ వెన్నియేండ్ల
క్రిందటం గట్టితివి శంక ♦ డెందమందుఁ
గల్గకుండ వచింపుమా ♦ కారణంబు
నెఱుఁగుదేఁ దత్త్వముగ నంచు ♦ నృపుఁడు పలుక. 30 2616

క. విని గ్రద్ద యిట్లు పలికెన్, జననాథా! ధరణి మనుజ♦సంతతిజననం
బును గాంచి యాక్రమించిన, దినంబునుండియె గృహంబి♦దియిచటనలరున్.

చ. అనిన నులూక మిట్లను గృ♦హం బిది పాదపసంఘశోభితా
వని తగ నద్ది యాదిగను ♦ భవ్యముగా నలరారు రాఘవా!
యన విని రాముఁ డాసభను ♦ నంతటఁ గాంచి నిజంబు గన్గొనన్
మనమున నెంచి యిట్లనియె ♦ మంజులవాఙ్మహిమంబు గన్పడన్. 33 2618

చ. *అనిశము వృద్ధు లుండని స♦దా సభ యెట్టులు? ధర్మమున్ వచిం
పనియెడ వృద్ధు లౌదు రెటు? ♦ పావనసత్యవిహీనమైనచో
ననఁబడు నెట్లు ధర్మమని? ♦ యద్దియు వ్యాజము గల్గునట్లు చె
ప్పిన నది సత్య మెట్లగును? ♦ బృథ్వని గీర్తిని గాంచు నెవ్విధిన్?. 34 2619

తే. సభ్యు లెవ్వరు విషయంబుఁ ♦ జక్క నెఱిఁగి
యూరకుందురో తెలిసిన ♦ దొక్కయింత
యైనఁ బల్కక వారెల్ల ♦ ననృతవాదు
లనఁగఁ బరఁగుదు రని పెద్ద ♦ లనఁగ వినమె?. 35 2620

తే. విషయ మెఱుఁగఁగఁ బ్రశ్నించు♦విధ మెఱింగి
పల్కకుండునో క్రుధచేత ♦ భయముచేతఁ

* న సా సభా యత్ర న సంతి వృద్ధాః వృద్ధా న తే యే న వదంతి ధర్మమ్, నాఽసౌ ధ
ర్మోయత్ర న సత్య మస్తి న త త్సత్యం యచ్ఛలే నానువిద్ధమ్-అనిమూ.

క. దనుజులు వారు ప్రజేశునిఁ, గని క్రోధావిష్టులైరి ♦ కడుజవ మొప్పం
గను వారు బ్రహ్మమార్కొనఁ, గను బరుగిడి; రంతనార్చెఁ♦గమలభవుండున్.

క. ఆరవ మది వికృతంబై, ఘోరంబై పరఁగె నట్టి ♦ కూయి వినుచు నే
వా రిరువురు హరియొద్దకుఁ, జేరిరి మర్దింప బాహు♦చేష్టలు వెలయన్. ౫౦

క. హరి చక్రప్రహరణమున, మరణము నొందించె నప్డు ♦ మధుకైటభులన్
దరువాత వారిమేద, స్ఫురణంబున వెలయఁజేసె ♦ క్షోణిని నెల్లన్. ౫౧

తే. మరల శ్రీహరి లోకైక♦ధరణుఁ డంతఁ, జక్క శోధించి మేదినీ♦స్థలము నెల్ల
వృక్షసంపూర్ణమగునట్లు ♦ వెలయఁ జేసె, నోషధులుసర్వసస్యంబు♦లొక్కరీతి.

క. ధరణిని వేర్వేఱుగ నా,తరుణంబున నుద్భవించె ♦ దానవమేద
స్స్ఫురణంబున జనియించుటఁ, బరఁగెన్ మేదిని యనంగఁ♦బ్రథితయశమునన్.

క. కనుక నులూకగృహంబే, యని తోఁచెడు నాదుమదికి ♦ నరయఁగ గృధ్రో
క్తినిఁ బట్టి తలఁచినన్ గృ,ధ్రని కేతన మిద్ది కాదు ♦ తథ్య మ్మిదియా. ౫౨

క. కావున గ్రద్దకు దండన,మే వలయున్ బాపబుద్ధి ♦ నిది పరగృహమున్
జేవం గైకొనియెను నొరు, జీవనహానిగను బీడఁ ♦ జేయు సతంబున్. ౫౫

ఆ. దుర్వినీతమగుచుఁ ♦ దోఁచినరీతిగా, సంచరించు న నెడు ♦ సమయమందు
నంతరిక్షసీమ ♦ నావిర్భవించెఁ జ,క్కఁగను వార్త యొకటి ♦ కడుజవమున.

క. ధరణీశా! వధియింపకు, పరమతపోబలముచేత ♦ భాసిల్లు మునీ
శ్వరుశాపయుక్తిఁ గ్రాలెను, నరవరుఁ డీతండు తొలిజ♦ననమునఁ జుమ్మీ!.

క. గౌతమముని శాపంబున, నీతం డొగి దగ్ధుఁడయ్యె ♦ హితకాంక్షి యగున్
సీతానాథా! శూరుం, డీతఁడు సత్యైకవాది♦యే యగుఁ జుమ్మీ. ౫౬

ఆ. బ్రహ్మదత్తుఁ డనఁగఁ ♦ బరఁగును బరిశుద్ధ
వర్తనుండు రామ ♦ బ్రాహ్మణుండు
మునుపు త్రోవఁ జొవు♦చును భోజనముఁ గోరి
యితనియిల్లు చేరి ♦ యిట్లు పలికె. ౫౭ 2642

క. శతవర్షంబులు చక్కఁగ, హితభుక్తిం గూర్పవలయు ♦ నృపసత్తమ! నా
క్షితిపతి పాద్యం బర్ఘ్యం, బతనికి భక్తిని నొసంగి ♦ యాదర మొప్పన్. ౫౮

చ. మనమున కింపుఁ గూర్పఁదగు ♦ మాంసము నాదినభుక్తికై ముదం
బును గలిగించునంచు ముని♦ముఖ్యునకున్ సమకూర్చె; నంత నా
మునిపతి క్రుద్ధుఁడై యపుడె ♦ భూపతి కార్తిద శాప మిచ్చె; నం
త నతఁడు బ్రాహ్మణోత్తముని ♦ దారుణచిత్తునిఁ గాంచి యిట్లనున్. ౬౦

తే. వలదు వల దిట్టి శాపంబు ♦ బ్రహ్మహాని
ధర్మవేత్తవు తెలియక ♦ తప్పు చేసి

నాఁడ నయయుంచి సద్వ్రతా! ♦ నాకు శాప
మెపుడు తీరునొ చెప్పుమా ♦ యింతె చాలు ౬౧ 2645
క. అనఘా! దారుణశాపం, బని చెప్పం దగును దీని ♦ నారసి మోక్షం
బును జెప్పుమా! మహాత్మా!, యన నజ్ఞానమునఁ జేసె ♦ నట్లని మునియున్.
చ. మనమున నెంచి రాజుఁ గని ♦ క్ష్మాపతివంశకులంబునందుఁ దా
జననము నొందు రాముఁ డను ♦ సద్వ్రత మొప్పు మహాత్ముఁ డర్కవం
శనిధిని బ్రోవఁగాఁ దగిన ♦ శౌర్యఘనుండును బుండరీకలో
చనుఁడు మనోజ్ఞరూపగుణ♦శాలి యతండు స్పృశించు నెత్తఱిన్. ౬౩
తే. అపుడు నీపాపములు పాయు ♦ నట్టిసమయ
మింకమీఁదట రాఁగల ♦ దెలమిఁ గనుదు
వంచు నాకాశవాణి యి♦ట్లలరఁ బలుక
రాముఁ డాగృధ్రము స్పృశించె ♦ రమ్యపాణి ౬౪ 2648
సీ. గృధ్రరూపము మాని ♦ క్షితిపతిరూపుఁడై భవ్యగంధానులే♦పనము లలర
దివ్యరూపంబునఁ ♦ దేజరిల్లుచుఁ గనకాంబరాభరణంబు ♦ లధికరుచుల
నొసఁగుచు నుండఁగా ♦ ననవృతమూర్తియై శ్రీరామచంద్రుని ♦ జేరి పలికె
రామచంద్రా! సుధ♦ర్మజ్ఞ! సాధుస్వాంత! నీప్రసాదంబున ♦ నెమ్మి నాకుఁ
తే. గలిగె ఘోరాకృతిం దగి♦విలయకారి, నరకమై తోఁచు నీజన♦నమును బాయఁ
గల్గితిని శాపమోక్షంబు♦ గల్గఁ జేసి, తీవు సుఖమును గంటి నో♦యినకులేశ!.

అధికపాఠము, మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - సర్గము.

శ్రీరామునికడకు మహర్షులు చనుదెంచుట.

క. జనపతియు లక్ష్మణుండును, మనమునఁ గల చింతతోడ ♦ మాటలఁ గాలం
బును బుచ్చఁగ వాసంతికీ, చనుదెంచెను రాత్రి యట్టి ♦ చాలసుఖదమై. ౧
క. శీతోష్ణము లధికముగా, నాతఱిఁ గల్గకయె యుండె ♦ నంతఁ బ్రభాతం
బాతతకర్మారంభము, ఖ్యాతము చనుదెంచె స్వచ్ఛ♦మై పావనమై. ౧½ 2651
క. తొలిపగటికృత్యముల నిమ్ములఁ దీరిచి యారఘూత్త♦ముండు సభకుఁ బౌ
రుల కెల్ల దర్శనం బిడి, యలరింపఁగ వచ్చె నట్టి♦యవసరమందున్. ౨ 2652
క. చనుదెంచి సుమిత్రుండిట్లని పల్కెన్ ద్వారమందు ♦ నడ్డపఱుప ని
ల్చినవారు భార్గవచ్యవనుని ముందిడుకొనుచు సన్ము♦నులు రాజేంద్రా!. ౩½
మ. నిను దర్శింపఁగఁ గోరి యాతురమునన్ ♦ నీచెంతకున్ బుచ్చి రీ
సను మాయల్ యమునాతరంగిణికిఁ జెం♦తం గాపురంబుండు వా
రని తోఁచెన్ ద్వరఁ బూనినా రనెడువా♦క్యంబుల్ చెవిన్ సోఁక ధ
ర్మనితాంతస్థిరుఁడైన రాముఁ డనియెన్ ♦ మౌనుల్ త్వరన్ రాఁదగున్. ౪

తే. భార్గవప్రముఖద్విజ♦వరులఁ ద్వరగఁ
బిలుచుకొని రమ్ము నా నతం ♦ డలగుచుఁ జని
ద్వారపాలుని కాజ్ఞను ♦ బలుక నతఁడు
శిరమునం దాల్చి యపుడు దో♦సిలిని బట్టి. ౯ 2655

సీ. ధర్మమూర్తులఁ దపో♦ధనులను మానుల రాముచెంతకును జే♦ర్పంగ వారు
స్వీయ తేజంబునఁ ♦ జెలువారుచును శతసంఖ్యగా శ్రీరాము♦సభకుఁ బోయి
రామహాత్ములు సుతీ♦ర్థాంబుసత్కృతపూర్ణకలశముల్ రాజిల్లు ♦ కరము లొప్ప
ఫలముల వరమూల♦ములఁ గానుకగాఁ బెట్టి యాశీర్వదింపఁగా ♦ నారఘుపతి
తే. వాని గ్రహియించి ప్రీతిచే ♦ వఱలి వారి
కిట్లు వచియించె నోమహా♦ర్షీశులార!
యాసనము లివె మీకర్హ♦మై తనరెడుఁ
గూరుచుండుఁడు నాదగు♦కోర్కి దీర్ప. ౧౦ 2656

చ. అను రఘురామువాక్యముల మ♦హాదృతి మీఱఁగ నాలకించి యా
మునివరులెల్ల హేమమణి♦భూషితమానిగణార్హపీఠరా
జిని దమిఁ గూరుచుండ రఘు♦శేఖరుఁ డట్లుపవిష్టులైన యా
మునులను గాంచి హస్తములు ♦ మోడ్చి సుభక్తిని బల్కె నీవిధిన్. ౧౧

ఉ. మీ రరుదెంచినట్టి పని ♦ మేలుగఁ దెల్పుఁడు శంకలేక నేఁ
గోరికఁ జేయువాఁడఁ దమ♦కుం గల కార్యము లేను జేయువాం
ఛారతిఁ బూనియుందుఁ గద ♦ సంతత శర్మము మీకుఁ గూర్ప నే
నారయుచుండు రాజ్య మిది ♦ యంతయు నాదగు జీవితంబునున్. ౧౨ 2658

తే. మీకుఁగా వినియోగింతు ♦ మేదినీసు
రార్థమే గద? యీరాజ్య ♦ మరయ నృపుల
కలరు సత్యముగా దీని ♦ ననుమతింపుఁ
డనఁగ విని మంచి దిది మంచి ♦ దనుచుఁ బలికి. ౧౩ 2659

సీ. యమునాతటంబున ♦ నలరు నామునివరు లమితమోదంబున ♦ నాత్మవశ్యు
లగుట నిట్లని పల్కి; ♦ రవనీశ! సర్వంబు మాకుఁ గల్గెను మఱి ♦ యేకడ నిటు
లుండదు రాజ్య మి♦ట్లాదవవు సుఖసంపదలు; బలశాలురా ♦ ధరణిపతులు
చాలమంది గతించి ♦ రోలిఁ గార్యవుగౌరవముఁ బట్టి యిట్టిశ♦పథము వారు
తే. చేసియున్నట్లువినలేదు ♦ భూసురర్షి, గౌరవము పేర్మిఁ గారణం ♦ బారయకయె
ప్రతిన నీరీతిఁ జేసితి ♦ వతిశయముగు, శక్తిగలవాఁడ వగుట నో♦క్ష్మాపతీంద్ర!.
క. ఒనరింతు వెట్టికార్యం,బు నైన నేసంశయంబు ♦ బూనక పెనుభీ
తిని బొంది యున్న మముఁ జక్కనిరీతిం బ్రోవఁదగుదు♦గా శ్రీరామా!. ౧౫

అఱువదవ సర్గము సంపూర్ణము.

## ౫౧ - వ సర్గము.

చ్యవనుఁడు రామునకు లవణాసురునివృత్తాంతమును దెల్పుట.

చ. అని మునులాడ నారఘుకులాగ్రణి మీకిటు భీతిఁ గల్గఁ జే
సిన పని యేదొ తెల్పుఁడన శ్రీపతితుల్యుఁడు రామమూర్తి చె
ప్పిన విని భార్గవుం డనియెఁ బ్రీతి దగన్; వినుఁ డింతభీతి పు
ట్టినయలకారణంబును గడించి విచారము దేశ మొందఁ జే
సినదగు హేతువుం దెలియఁ జెప్పెదఁ జక్కఁగ శ్రీరఘూత్తమా. ౨ 2662

చ. కృతయుగమందు మున్ను పృథివీశ్వర! దోర్బలశాలి లోలకున్
సుతుఁడయి జ్యేష్ఠుఁడై వెలసె సూరశిఖామణియౌ మధుండు న
మ్రతుఁడును జ్ఞాననిధియై సుశాంతియునై పరిరక్షకుఁడై చెలంగె దే
వతలు మహాత్ముఁడం చతఁడు భక్తిని బ్రీతిని నిల్పె వారిపై. ౩ 2663

చ. అనుపమవీర్యసంపదల నాతఁడు పొల్చియు ధర్మతత్పరుం
డను యశమొంది యీశ్వరుని నాత్మను నిల్పి శరత్తు లెన్నియో
చనునటు సాంద్రభక్తి దగ సాధుతపం బొనరించె; నాతపం
బునకును బ్రీతుఁడై పరశివుండును నిచ్చె వరంబు లీయఁగన్. ౪ 2664

క. దనుజునిపైఁ గలమోహం, బున నద్భుతమౌ వరంబు భూతేశుఁ డొసం
గెను విను మది యెట్లనఁగాఁ, దనశూలమునుండి యొకయుదాత్తాయుధమున్.

క. జనియింపఁ జేసె శూలం, బన నదియున్ ఖ్యాతి నొందె నద్భుతవీర్యం
బును సాంద్రతేజముం దగఁ, గ నద్ది చెలువారె మహిమ గల్గు హారుండున్.

తే. అతని కద్దాని నిచ్చి యిట్లనియెఁ బ్రీతి
యలర, మత్ప్రీతికరమగు నట్టిధర్మ
మిద్ది యొనరించితివి ధాత్రి నెసఁగె నతుల
మగుచు దీనికిఁ బ్రమదంబు నందినాఁడ. ౭ 2667

క. కనుకన్ శూల మొసంగెద, ననుత్తమం బౌచు నిద్ది యలరారెడు నో
దనుజవరా! త్రిదశుల వి, ప్రనికరముం గాంచి నీవు పగఁ బూనకుమీ. ౮

ఆ. ఎంతదాఁక నుందు వీరీతి నందాఁక, నీవశమున నుండు నీవరాయు
ధంబు తప్పదేని దానవ! యారీతి, నాశ మొందఁగలవు నామహాజ్ఞ. ౯

క. పరుఁ డెవఁడు గాని వినుతి,జ్వరుఁడై యుద్ధంబు చేయ వచ్చునొ వానిం
బరిమార్చి శూల మది నీ, కరమున భాసిల్లఁగలదు క్రమ్మఱ దనుజా!. ౧౦

చ. అని యిటు లావురాంతకుఁ డహార్యకృపన్ వర మీయ దానిఁ బొం
దినమధుదానవేశ్వరుఁడు దేవపతిం గని మ్రొక్కి భక్తిని
ట్లనియెను శూల మిద్దియె మదన్వయజాతుల కెల్ల వశ్యమై
తనర ననుగ్రహింపుఁడు సతంబును దేవవిభుండ వివేకా?. ౧౧ 2671

చ. అనుటయు భూతనాయకుఁడు ♦ హారిగుచిం దగుశంకరుండు లో
కనికరనాయకుం డనియెఁ ♦ గా దిటు మామకసత్కృపైకపా
త్రుని నినుఁ జిన్నపుచ్చుటయుఁ ♦ దోఁపదు యుక్తమటంచుఁ గాన నీ
వనుకొనునట్లు గాక ఫల♦సుంధగఁ జేసెద నీదుకోరికల్. ౧౩౪ 2672

క. విను నీతనయున కొకనికి, యనూనశూల మిది వశ్య♦మగు నని వైవం
గను జాలు; నీతనూజా,తునికరమున శూల మిద్ది ♦ తోఁచునొ పెలుచన్.౧౪౪

ఆ. అంతదనుక నాతఁ ♦ డఖిలభూతానధ్యుఁడై చరింపఁగల్గు ♦ ననిన మధుఁడు
వరము నిట్లు శంభు♦కరుణ నత్యద్భుత,మును గ్రహించి గేహ♦మునకు వచ్చి.

క. తనుకాంతి వెల్గఁజేయుచు, ననిశము సంతోషపరన♦శాత్ముం డగుచుం
డెను గుంభీనసి తత్సతి, యనూనసౌభాగ్యయుక్త ♦ యగు రఘుభూపా! ౧౬౪

సీ. మాల్యవంతుండను♦మహితాత్మపుత్రియా ననలయన్ భామిని♦యలరు నామె
విశ్వావసునిసతి ♦ విశ్వమంగళరూపఁ గుంభీనసిని గాంచెఁ ♦ గూఁతు నామె
రావణునకుఁ జెల్లె♦లై వన్నె కెక్క నావనిత నె మధువను♦వాఁడు లంక
నుండి రావణుఁ డింట ♦ నుండనితఱిఁ గొనిపోయె నాతరుణికిఁ ♦ బుట్టె దాను

తే. నాకృతిం దాల్చి వీర్యశౌ♦ర్యములు తనరఁ
బొల్చె లవణాహ్వయంబుతో ♦ భువనగర్హి
తాచరణమున దుర్బుద్ధి♦యై సతంబు
పాపకృత్యములను జేయఁ ♦ బాలుపడియె. ౧౭ 2676

చ. తనయుఁడు దుర్వినీతుఁడయి ♦ దారుణకృత్యము లొప్పఁ జేయఁగాఁ
గని పటుకోప మొందియు ని♦కామము శోకమునం దపించియుం
దనయుని నేమియుం బలుకఁ ♦ డా మది నెంచక యూరకుండె; నం
త నతఁడు రాజ్యమున్ వదలి ♦ దర్పకనాశకశూలహార్తలన్. ౧౮ 2677

తే. సుతునకున్ దెల్పి కరమున♦శూలముండు, దనుక నేశత్రుబాధలు♦డాఁకవనుచు
వరము గలదని తెల్పి తా♦వరుణలోక,మున వసించెను;లవణుఁ డం♦త నిజశక్తి.

క. హరుశూలాయుధమహిమన్, గురుతరబలశాలి యయ్యుఁ ♦ గొంకక దుర్బు
ద్ధిరతుండై త్రిజగంబులఁ, బరితాపము నొందఁజేయుఁ ♦ బల్కు లిఁకేలా?.

క. తరుణులను విశేషించియె, పరితాపం బందఁజేయు ♦ బ్రహ్మామునుల నా
తురమొందఁ జేయునాతని, గరువము శూలంపుశక్తి ♦ గ్రాలు నిటువలెన్.౨౧౪

క. అని తెల్పి వింటివి గదా?, మనుజోత్తము! లవణదనుజ♦మాట యిఁకన్ మా
కును దిక్కు నీవె పూర్వము, మునివరు లర్త్యార్తు లగుచు ♦ భూపాలకులన్.

క. శరణము వేఁడిరి వీరా!, ధరణీశుం డొక్కఁడైన ♦ దర్పంబున నా
సురవైరి బాధ మాన్పెడు, వరునం బల్కినదిలేదు ♦ వరగుణసాంద్రా!. ౨౩

చ. సురరిపునాయకుం డగుచు ♦ శూరుఁడునై తగు రావణుండు సో

నలరుశత్రుఘ్నుఁ డీయిరువ ♦ రందు నెవ్వఁ
డతనిఁ బోలియించు ననవిని ♦ యాభరతుఁడు.

మ. దనుజుం జంపుదు నే మదంశ మతఁడౌ ♦ ధాత్రీశ్వరా! యంచుఁ జ
క్కనిధైర్యంబును శౌర్యముం బొదల ని♦క్కంబై నరీతిన్ వచిం
చిన శత్రుఘ్నుఁడు హేమపీఠగతుఁడై ♦ చేమోడ్పుతో లేచి యి
ట్లను ధీరుండయి పొల్చు నీతఁడు నయో♦ధ్యన్ ధర్మచిత్తంబునన్. ౧౦౪

క. వనములకు మీరు పోయిన, జనముల నలరించునట్టి♦చందంబున నే
లెనుగాన నీదుసేవను, మనమునఁ గలతాప మడఁచి ♦ మనుధర్మమునన్. ౧౧౪

క. పరిపాలించెను గావున, భరతుఁడు కృతకృత్యుఁడయ్యె ♦ బహుదుఃఖములన్
ధరణీశ! నిన్నుఁ దలఁచుచు, ధరణిన్ శయనించి మిగులఁ ♦ దాపం బందెన్.

క. నందిగ్రామమ్మున మును, కందములను మూలములను ♦ గాదిలిమోదం
బందినగతి భక్షించుచుఁ, గుందుచు నీరాక నతముఁ ♦ గోరి జటియునై.

తే. నారచీరలు ధరియించి ♦ కోరి నీదు
సేవ యొనరించె భరతుండు; ♦ సేవకుఁడను
నేను నుండఁగ మరల నీ♦మానితాత్ముఁ
బంపఁ గష్టములం బొందుఁ ♦ బార్థివేంద్ర! ౧౪౪ 2696

చ. అన విని రాఘవుం డనియె ♦ నట్లగు నో ప్రియసోదరా! మదా
జ్ఞను గొని కార్యసిద్ధిఁ గను ♦ చయ్యన నామధుదానవేంద్రుప
త్తనమున రాజ్యమేలు, మిదె ♦ దానికి ని న్నభిషిక్తుఁ జేసెదం
జను; భరతుండు నిచ్చటనె ♦ చక్కనిశర్మము లొందు చుండెడిన్. ౧౬౪

సీ. శూరుఁడ వౌదువు ♦ సొరిది విద్యావంతుఁడవు సమర్థుఁడవు క♦డంగి పోర
వలఁతివి; రాజ దె♦వ్వఁడు శత్రుఁబోలియించి మఱొకరాజునునిల్పు♦మదినిగొనక
యుండునో నరకంబు♦నొందునాతఁడు; గానఁ బాపనిశ్చయుఁడయి♦పరఁగులవణుఁ
జంపి యారాజ్యము ♦ నింపుగా ధర్మంబుఁ దప్పక పాలింపు ♦ ధైర్యమూని

ఆ. యుత్తరంబు దీని ♦ కొకరీతిఁ బల్కకు, *చిన్నవారు పెద్ద ♦ లన్నమాట
తప్పకుండవలయు ♦ నెప్పటి కని వసిష్ఠాదియుక్తిఁ జేసె ♦ నధిపు నతని. ౨౧

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

లవణాసురుం జంపు నుపాయము రాముఁడు శత్రుఘ్ననకుం దెల్పుట.

చ. అని యిటు రాఘవుండు ప్రియ♦మారఁగ రాజును దన్నుఁ జేయ నె
మ్మనమున సిగ్గు నొంది యను♦మానము నొందుచు వీర్యమొప్పు నా

---

* బాలేన పూర్వజస్యాజ్ఞా కర్తవ్యా నాత్ర సంశయః-అనిమూ.

యనఘుఁడు లక్ష్మణానుజుఁ డ♦హార్యబలుం డిటు పల్కె మెల్లఁగా
జనవర యిం దధర్మము ప్ర♦సంగు నటంచును దోఁచె నిత్తఱిన్. ౧౪ 2699

తే. జ్యేష్ఠు లుండఁగ ధరణిఁ గ♦నిష్ఠులకును
రాజ్య మొసఁగ నెలిమం ♦ రాని యున్న;
దోషహేతుక! మీయది ♦ యుగ్ర శాస
నము గదా? చేయఁదగియె యుం♦... నెవుడు. ౨౪ 2700

క. దురతిక్రమమై తగు నో, ధరణీశ్వర! శాసనంబు ♦ తావకముగదా?
పరవీరదర్పహరణా!, నను నీ వింక వేడ♦వారమువలనన్. ౩౪ 2701

క. వినియుంటి ధర్మపద్ధతి, జనవర! మధ్యముఁ డెఱుంగుఁ ♦ జక్కఁగ లవణున్
జనదూమకుఁ జంపుదు నే, నని నసిమోన్ గాదె దాని ♦ నగునే? త్రోయన్.

సీ. బదులు పల్కితినేని ♦ పరముదుర్గతి గల్గు జ్యేష్ఠుండు నీచెంతఁ ♦ జెప్పియుండ
దానికి బదులుగ ♦ నేనేమి పల్కుదుఁ బల్కినచో నాకుఁ ♦ బరమలోక
సంప్రాప్తి లేకుండుఁ ♦ దక్కనిధర్మంబు గాకయె యుండు ని♦క్కముగ రామ!;
భరతుఁ డుండఁగ నేను ♦ బదు లొకింతగాఁ బలుకంగఁజాల మీ♦పరిసరమునఁ

తే. పెద్దవాఁ డుండఁగా నేను ♦ చిన్నవాఁడ
నోట రాజ్యంబుఁ గొనఁజాల ♦ నఘము నొంది
శిశుదానికిఁ దగినది ♦ చెందఁజాల
మానదా! రామచంద్ర! యో♦త్స్వాతంత్ర!. ౭౪ 2703

చ. అనవరతంబు నీదయిన ♦ యానతిఁ దప్పక చేయువాఁడ నో
జనవర! మన్నిమిత్తముని ♦ చక్కనిధర్మము వీడఁ బోకుమం
చని మహితాత్ముఁడై తగఁ ద్రి♦యానుజుఁ డుద్ధతవైరిసూదనుం
డన విని రామచంద్రుఁ డతి♦హర్షము పొంగుచు నుండ నత్తఱిన్. ౯ 2704

క. భరతున్ లక్ష్మణుఁ గన్గొని, ధరణీశ్ బూ...గవలయుఁ ♦ దమ్ముని నభిషే
కరమా మహోత్సవమునకుఁ, బరికరములు నిపుడె కూర్ప♦వలయుం బ్రీతిన్. ౧౦

క. ఘనమవకేణ్యుని పోనరుఁ, బరదుర్గము లవణరాజ్య♦పాలకుఁగా ని
త్తఱిణంబునఁ జేసిన మఱి, బురోహితుని బౌరజనులఁ♦బూజ్యులమఱియున్.

సీ. ఋత్విజులను విచా♦రించి కార్యము చేయ నేర్పరులైన మం♦త్రిప్రముఖులఁ
బిలుపింపుమా నేను ♦ బలికినరీతిగా నన రాజశాసన ♦ మాదలలను
ధరియించి లక్ష్మణ♦భరతులు తద్రీతిఁ జేసిరి పట్టాభి♦షేకవస్తు
వులతోఁ బురోధను ♦ నెలమి ముందిడుకొని రాజగేహంబును ♦ బ్రాహ్మణవరు

తే. లపుడు చొచ్చిరి భూపతు ♦ లాదటమున
వచ్చి రంత మహోత్సవం ♦ బచ్చటఁ గన
సాగె శత్రుఘ్ననకు శాంత♦సాధుచిత్తు
నకును రాముండు పౌరగ♦ణంబు లలర. ౧౮ 2707

క. అంతట నభిషిక్తుండై, యెంతయు శత్రుఘ్నుఁ డలరె ♦ నినుచందమునన్
విలతగ నేంద్రక్రతుభు,క్సంతతిలో రాజ్య మొందు ♦ స్కందునిరీతిన్. ౧౪
క. పరహితకార్యరతుండౌ, ధరణీశుఁడు పిన్నతమ్ము ♦ దానవవిలస
ద్ధరకున్ బతిగాఁ జేయఁగఁ, బురజనులున్ వేదవిదులు ♦ భూసురవరులున్.
క. అలరిరి కౌసల్యసుమి,త్రలు కైకయు నింకఁ గల్గు ♦ ధరణీశుని దా
రలు మంగళకరకృత్యం,బులఁ జేసిరి సౌధమందుఁ ♦ బొంగెడుకాంక్షన్. ౧౬
క. ముని లాయమునాతీర,స్థనికేతను లున్నతమతి♦శాలురు లవణుం
డని నీల్గె ననుచుఁ బొగడిరి, జనపతి శత్రుఘ్నుఁ బతిగ ♦ శాసించుటచేన్. ౧౮
ఆ. పట్టభద్రుఁడైన ♦ పరహాంత శత్రుఘ్ను, నంకసీమఁ జేర్చి ♦ యవనివిభుఁడు
తేజ మతనియందుఁ ♦ దృప్తిగ నించుచుఁ, బలికె నిట్లు మధుర♦భాషణముల.
క. పరపురనిబర్హణా! యీ,శర మతిదివ్యంబు నీ కొ♦నంగెద లవణున్
దురమున దీనం జంపుదు, పురుకీర్తినిఁ బొందఁజాలు ♦ దొరఘుపుత్రా!. ౨౦
చ. సురలును దానవుల్ మఱియు ♦ శూరశిఖామణులైన రాక్షసో
త్కరములుఁ విష్ణుమూర్తిఁ గనఁ♦గాఁ దగుశక్తిని గాంచలేదొ యా
పరుఁడు స్వయంభువుండు ముని ♦ పార్థివసత్తమ! క్షీరవార్ధివి
స్ఫురతరయోగనిద్రఁ గొని ♦ పొల్పుగఁ దా శయనించె నత్తఱిన్. ౨౧ 2714
క. భూతము లెవ్వియు విష్ణుని, నాతనిఁ గనఁజాలకుండె ♦ నతఁడు రిపుజన
వ్రాతభయంకరమూర్తిని, నాతఱి సృజియించె నీశు♦హాశర మనఘా!. ౨౧½
క. దుష్టాత్ముల శిక్షింపఁగ, శిష్టులఁ బాలింప నెంచి ♦ శ్రీహరి కోపా
విష్టుండయి యీశరమును, సృష్టిచమత్కార మొప్ప ♦ సృజియించెఁ జుమీ!.
క. దనుజులు మధుకైటభు లో,జననాథకుమార! దనుజ♦సత్తములు తమం
తన *పెరుఁగ లోకములఁ జే,యను బూనినహరియు వారి ♦ నాగ్రహ మొప్పన్.
క. శరమున దీనం జంపెను, సురవైరుల మధువునాఁగ ♦ శోభిల్లెడు భీ
కరమూర్తిని గైటభునిన్, మరణము నొందించి దీన ♦ మహితవిభూతిన్. ౨౩½
క. లోకంబుల నిర్మించెను, శ్రీకాంతుఁడు దీని, నేను ♦ సీతకొఱకుఁగా
నాకర్బురేంద్రు రావణు, భీకరబలశాలిఁ జంపు♦వేడుక ననిలోన్. ౨౪½ 2719
చ. శరమును దీని వైవఁగను ♦ స్వాంతమునం దలపోయలేదు; భీ
కరశర మిద్ది వైవఁగ జ♦గంబులు భీతిలు హానిఁ జెందునం
చరసియె మాని నాఁడ, విన♦వయ్య! సహోదర! యీశ్వరుండు భూ
తరమునుఁ డంబికాపతి యు♦దారశరంబగు శూలవర్యమున్. ౨౫½ 2720
క. కర మర్థి నిచ్చెఁ గా దే, యరినాశకముంచుఁ బూర్వ ♦ మామధువునకున్
సురవైరి యతఁడు దానిని, గరువంబున నింట నునిచి♦కడు స్వేచ్ఛమెయిన్ ౨౬

* పర్పిష్టుకామేన లోకాం స్త్రీన్-అనియూ.

తే. తిరుగుచుండును దానిని ♦ బరమభక్తిఁ
బూజచేయుచునుండును ♦ బోలుచశక్తి
దానిఁ బూనక యే దిగ్వి♦తాన మెల్లఁ
దిరుగు ... హారకాంక్షియై ♦ దితినుతుండు. ౨౭ 2722

చ. అని యొనరింపఁ బూని యెవఁ ♦ డైనను బిల్చినమాత్ర శూలముం
గొని మధుదానవుండు కదుఁ ♦ గ్రూరత వైరిని బూదిచేయుఁ; గా
వున నిట నీవు శూలమును ♦ బూనక యాతఁడు పోయియున్న చో
ప్పును మది నెంచి ద్వారమునఁ ♦ బూనిక నిల్చి ధృతాయుధుండవై. ౨౮

క. దనుజుని బురిఁ జొరనీయక, యనిచేయుము గేహమునకు ♦ నాతఁడు చొరకుం
డ నిల్చి పిలువ్వ యుద్ధం,బును జేయుఁగ రమ్మటంచుఁ ♦ బురుషవరేణ్యా!. ౨౯

క. అని చేయ నతఁడు వచ్చును, నినుగని లవణాఖ్యుఁ జంపఁ♦గాఁ గల వనఘా!
వినుమా! వేఱొకరీతిని, దనుజుని జంపంగరా ద♦తఁ డవధ్యుఁ డగుటన్. ౩౦

తే. నేను జెప్పినయట్లుగా ♦ నీవు చేసి, తేని లవణాసురుండు దు♦ర్మాని చచ్చు;
శూలముననవచ్చు బాధల♦చొప్పు దెల్పి, నాఁడ లవణునిదగునాశ♦నమును నరిగ.

క. తెలిపితి [1]శ్రీసుచ్ఛంకరుఁ, డలఘుతరంబైన శక్తి ♦ నలరును గాన
విలయకరంబగు నాతని,పలు కది చెల్లింపవలయుఁ ♦ బల్కులిఁ కేలా?. ౩౨

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౪ - వ సర్గము.

—శత్రుఘ్నుఁడు రామాజ్ఞ చే మునులం గూడి లవణాసురునిపట్టణమునకుఁ బోవుట.—

క. అని పల్కి పిన్నతమ్ముని, దనూ...రీతులను బొల్చు ♦ సాశిమములచేఁ
దనుపుచు మఱియుం బల్కెను,దనుజా...నుఁగొనుము ముందు♦హారిరథములన్.

సీ. అవి ...ల్లు వేలు నీ ♦ కమరు సాయంబుగ వా స్తివర్యములు స♦హస్ర యుగము
పై నశతంబును ♦ బలసి వచ్చును వెంట నిలిచినతావుల ♦ నిఖిలవస్తు
వులతోడ ...ంగల్లు ♦ వెలయుచునుండును, ...ట స ర్తకులు వెంట ♦ నడచువారు
శ స్త్రకాంచననియు♦తంబును వస్త్రముల్ వాహనంబులు ధన♦వ్రజముఁగొనుచు

తే. నరుగుమా హృష్టపుష్టమై ♦ యతులబలము
వెంట నరుదెంచుఁ జక్కని ♦ విమలభామ
ణముల వారల ...లరింపు ♦ నరపతివర!
[2]వనమునందును ద్రవ్యముల్ ♦ గనఁగ నగునె? ౫ 2729

క. ననితిలు బాంధవు లుండిను, వసములలో నుండుతఱిని ♦ పరమిత్రులు భృ
త్యనికరములు నుందురు చెం,తనె కావున వారిఁ దగువి♦ధంబునఁ గనుమీ.

---

1 శ్రీమతి శ్రితికంఠస్య కృత్యం హి గురతి క్రమమ్-అనియూ. 2 న హ్యర్థా స్తత్ర తిష్ఠంతి నచ దారా న బాంధవాః-అనియూ.

తే. హృష్టజనసంభృతంబయి ♦ యెసఁగు గొప్ప
బలముఁ గొనిపొమ్ము లవణుని♦వనము చొచ్చు
తరుణమున నీవె చాపంబు ♦ కరమునందుఁ
గ్రాలఁ జొరవయ్య! నిన్నటుఁ ♦ గాంచువారు. ౭ 2731

క. అని చేయు వచ్చెనని తమ,మనములఁ దలపోయకుండు ♦ మాడ్కి నరుగుమా
దనుజుఁడు నినుఁ గని సంశయ,మును బొందకయుండవలయుఁ♦బూజ్యప్రతిభా!.

క. అనుమానింపక యాతఁడు, వనమున నుండంగఁ దాఁక ♦ వచ్చిన రిపుచే
తను దప్ప వేఱుమృత్యువు, గన రా దాతనికి శత్రు♦గణకాలయమా!. ౯

క. ఆతనిదర్శనమునకే, భూతలపతి పోవు నతఁడె ♦ పో లవణునిచే
నాతఁడేఁ జంపంబడు; నీ, వోతమ్ముఁడ! గ్రీష్మసమయ ♦ మొకవిధి నేగఁ. ౧౦

తే. వార్షికంబగుకాలంబు ♦ వచ్చుతఱిని, వానిఁ జంపుము తగినది ♦ యాను వాని
కద్ది; మానివరేణ్యుల ♦ నందఱిఁ గొని,నీదుసేనలు ముందుగాఁ♦బోఁదగు నిఁక.

సీ. గ్రీష్మకాలము భూరి♦రిపునాశకా! నుంత మిగిలి యుండంగ నీ ♦ వగణితబల
యుతుఁడవైమిగులఁబు♦ణ్యోదకంబులనొప్పుగంగను దాఁటింపఁ♦గాఁదగుఁజుము;
బలముల జాహ్నవీ♦వరతటంబున నిల్పి జాగరూకుఁడవయి ♦ చాప మూని
నులభగతిం జని ♦ శూరత చెలువార నాతనిఁ బొలియింపు ♦ మనుచు రాముఁ

తే. డాజ్ఞ చేయంగ శత్రుఘ్నుఁ ♦ డాత్మబలము
లను దదీశులఁ బిలిపించి ♦ యనియె; ముందు
నిలువఁ దగునట్టి తావుల ♦ నెమకి యందు
బాధ యొరికి లేకుండ ♦ వలయు నిలువ. ౧౨ 2736

చ. అని యిటు లాజ్ఞ చేసి తన♦దా గురుసైన్యముఁ బోవఁ బంచి చ
క్కని విధి మీఱఁ దల్లులకు ♦ గాఢతరంబగు భక్తి మ్రొక్కి రా
మునకుఁ బ్రదక్షిణం బిడుచు ♦ మ్రొక్కి తదంఘ్రులు నెత్తి సోఁకుచే
యనుపమభాగ్యమం చరసి ♦ యాజ్ఞను బొంది యరీంద్రకాలుఁడై. ౧౩

ఆ. భరతలక్ష్మణులకుఁ ♦ బ్రణమిల్లి దోసిలి, పట్టి యావసిష్ఠుఁ ♦ బరమమునిని
వేడ్కఁ జుట్టుఁ దిరిగి ♦ విధిహితవందన,ములు పొసర్చి వెడలె♦బలయుతుఁడయి.

చ. కరితురగాఢ్యమా బల మ♦ఖండతరంబగుదాని ముందుగా
నరుగ ననుజ్ఞ యిచ్చి తన♦యన్నపదంబులఁ గొల్చుపొంటె నా
దరమున మాసముం గడపి ♦ తత్ప్రహితాశిషముల్ గ్రహించి స
త్వరగతిఁ బొమ్మటంచు గుణ♦ధాముఁడు పల్కఁగఁ బోవ నెంచెఁ దాఁ. 2739

అఱువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - సర్గము.

శత్రుఘ్నుఁడు వాల్మీకిమౌనిం గాంచుట.

చ. బలముల నిట్లు ముందుగనె ♦ పంపి పురంబున మాసముండి దో
ర్బలు మెలఁగంగ నొక్కరుఁడె ♦ పార్థివచంద్రుని యాజ్ఞఁ బోయె; ని
ట్లిలఁ జనుచుండి రెండు దివరాత్రములు ♦ నంతరభాగమునన్ వసించి ని
ర్మలమయి పుణ్యవంబు నయి ♦ రాజిలు వాల్మికియాశ్రమంబునన్. ౨

క. కనుఁగొని యు త్తముఁ బుణ్యాత్ముని నావాల్మీకిఁ గాంచి ♦ తోరపుభక్తిన్
బ్రణతుల్ సల్పుచు మునిమును, గని యిట్లనె భగవంత! మీయా♦శ్రమసీమన్.

క. నివసింపఁగోరెదను మా, నిని కేణ్యులకార్యమునకె ♦ నేఁ జనియెద; రే
పు నగుణపాలితదిక్కున, కవితథజన మెప్పుఁ బోదు ♦ ననుపల్కులకున్. ౪

క మునిసత్తముఁడు వాల్మీకియు, నుసు ముని ముద మంది నవ్వి ♦ మహిమాఢ్యుండై
ఘనకీర్తి యలర వెలసెడు, దనుజవిజేతకును స్వాగతంబు ♦ సరగునఁ జెప్పెన్. ౫

సీ. రఘువంశవనితులా ♦ రాజుల కిది స్వీయమైన యాశ్రమమగు ♦ మాననీయ!
యాసనం బిదె పాద్య♦ మర్ఘ్యంబు నిదిగో సంశయమొందక కొను♦శత్రుహరణ!
యన వాని గ్రహియించి♦ మునులు మూలంబుల ఫలముల భక్షించి♦పరమతృప్తి
నందె శత్రుఘ్నుఁడు; డి ♦ ల్లామునిపూజకు నలరి యిట్లని పల్కె; ♦ నార్యవర్య!

ఆ. యాశ్రమంబు చెంత ♦ యజ్ఞసమృద్ధిచి
హ్నములు తోఁచుచున్న ♦ వవి యెవరివి?
తెలుపుమన్న నతని♦ పలుకులు నాలించి
యిట్లు పలికె, వినుము ♦ హితమునీశు!. ౭ 2744

క. మును పిది యొక రాజునకుఁ జక్కనిరీతిం జెలఁగెనొక్క ♦ సద్గుణా! మీ
కును బూర్వుండు సుదాసుం, డనుభూపతి యలరు, నతని ♦ కాత్మజుఁడొదవెన్.

ఆ. వీరసహుఁ డనంగ ♦ విఖ్యాతనామంబు, వాని కయ్యె; ధర్మ♦వర్తనుండు
వీర్యయుక్తుఁ డతఁడు ♦ విశదగతిన్ వేఁట, సలుపు నాఁ బూనె ♦ క్ష్మాపతిసుత!.

చ. వనమున నొక్కచో నెలమిఁ ♦ బన్నిలు వెట్టుచు మాటిమాటికిన్
దనుజయుగంబు స్వేచ్ఛమెయి ♦ దారుణరీతిఁ జరింపఁ గాంచె; నా
దనుజులు వ్యాఘ్రరూపులయి ♦ తద్వనసంస్థమృగవ్రజంబులన్
దినుచును దృప్తినిం గనక ♦ ద్రిమ్మరుచుండిరి భక్షణేచ్ఛచేన్. ౧౨ 2747

చ. ధరణిపుఁ డాసురారులను ♦ దారుణరూపులఁ గాంచి యీమృగో
త్కరములు నెల్లఁ ద్రుంగి మృగ♦కాంక్షవిహీనముగా వనంబుఁ జే
సిరి గద? యంచుఁ గ్రోధరతిఁ ♦ జెంది మహేషువు వారిఁ గూర్చి యొ
క్కరుని వధించి క్రోధమును ♦ గ్రన్నన వీడి విహీనఖేదుఁడై, ౧౩ 2748

క. దనుజశవంబును జూడఁగ, మనుజేంద్రుని గాంచి దనుజ♦మర్దను గని యా

* విజ్వరో విగతావర్ష-అనియు.

దనుజునిమిత్రుఁడు తాపం,బును మిక్కిలి పొంది పలికె ♦ భూపతితోఁ దగన్. ౧౫

క. వినవయ్యా! యనపరాధుని, దనుజుని నామిత్రు నీవు ♦ దారుణ బాణం
బున నేల చంపితివో యఘ,మును జేసితి వేల? దాన ♦ భూపా! నీకున్. ౧౬

తే. చేయువాఁడఁ బ్రతిక్రియ ♦ నీయెడ నని
యుండె కనఁబడకుండె; నా♦యవనినాథుఁ
డాత్మపురి కేగెఁ జిరకాల ♦ మట్లు గడువ
తనయునకు రాజ్య మిచ్చి యు♦త్తమపదమును. ౧౭ 2751

క. కనఁగోరి యుండె; నీచెం,తనె యజ్ఞము చేయునాఁ ♦ డాల్బె వసిష్ఠుం
డును నశ్వమేధమను క్రతు,వును దానిం గావ బుద్ధిఁ ♦ బూనెం బ్రీతిన్. ౧౮

క. చిరకాలము సాగెను న,ధ్వర మయ్యది పరమలక్ష్మి ♦ భాసుర మగుచున్
సురయజ్ఞతుల్యమై భూ,వరతనయా! యజ్ఞ మిట్లు ♦ వరుసఁ జెలంగన్. ౧౯

సీ. అధ్వరాంతమున నా♦యసురుఁడు తొలివైరమునుదలంచుచువసి♦ష్ఠునితనువునఁ
బొడనూపి యిట్లని ♦ నుడివె నీయజ్ఞంబు పూర్ణమా తరుణంబు ♦ నిర్ణయింప
నిదె వచ్చె మాంసయు♦క్తేష్టభోజన మిప్డు నాకుఁ గావలయు భూ♦నాథ! దాని
నిప్పింపు మెంతయు ♦ నెన్నకు మది నన బ్రహ్మరూపంబునఁ ♦ బరఁగుదనుజు

ఆ. వచన మాలకించి ♦ పలికె సంస్కారకు,శలము గొనుము విప్ర♦సత్తమ! యని
వంటచేయువానిఁ ♦ బరికించి సామిషం, బగు హవిష్య మితని ♦ కభిమతముగ.

క. మన మతితృప్తిం బొందం,గను వే నముకూర్పవలయు ♦ త్యానురుఁడు మనం
బునఁ దృప్తి నొందఁ జాలదె, యన విని రాజేంద్రునాజ్ఞ ♦ నలజడి గనుచున్.

క. విని సూదుఁడు చిత్తమురీ,తిని చేసెద నంచు రాజు ♦ తెల్పినరీతిన్
జని వంట చేసె నంతట, దనుజుఁడు సూదాకృతిని ని♦తాంతము పొల్చెన్.

క. మనుజునిపలలము వంటక,మునఁ గూరిచి రాజుతోడ ♦ భూప! హవిష్యం
బును సామిషముగ స్వాదువు,గను జేసితిఁ దెచ్చినాఁడ ♦ త్యానురుకొఱకై.

చ. అనుటయు భూధవుండు మద♦యంతియనంజను భార్యఁగూడి యా
మునిపతికిన్ వసిష్ఠునకు ♦ మూర్ఖుఁడు రక్కసుఁ డిట్లు చేసె నం
చును దలపోయఁ జాలమిని ♦ సొంపుగ దానిని నుంచె నందు నా
మనుజపలంబుఁ గాంచి ముని♦మండనుఁ డాగ్రహపూరితాత్ముఁడై. ౨౭ 2758

క. పలికెన్ రాజా! యీనర,పలలము నాకిడితి విట్టి ♦ పలలమె నీకుం
గలుగం గల దిఁక సంశయ,ములఁ బొందక దానిఁ దినఁగఁ ♦ బోలును నీకున్.

చ. అని శపియింప వీరసహుఁ ♦ డాగ్రహమూని మునిన్ శపింప జ
య్యన నుదకంబులన్ గొనియె ♦ హస్తమునం దది చూచి భార్య యా
తని వలదంచు నిల్పి ప్రభు♦తల్లజ! యియ్యది యొప్పునయ్య! యీ
జనపతిసత్కులంబునకు ♦ నన్ముని యాతఁడె ఱేఁడు చూడఁగన్. ౩౦ 2760

క. సురతుల్య తేజ నీతని, గురువును శపియింపఁ జన్న ♦ క్రోధ ముడుగు మీ
తరుణమునఁ దంచుఁ బల్కె నఁ, దరుణీమణిమాటల విని ♦ త్యక్తాగ్రహుఁడై. ౩౧

క. అనుపమకోపమయంబయి, ఘనతేజోబలయుతమయి ♦ క్రౌంచమహోదయం
బును దాని ధర్మమతియై, తత్పాదములంద విడిచెఁ ♦ దజ్జలయుక్తిన్. ౩[illegible]

క. చరణము లవి కల్మషతం, బరఁగెను దత్ప్రభృతి రాజ♦వర్యుఁ డతఁడు ను
స్థిరకీర్తి క్రొత్తనామం, బరయం గల్మాషపాదుఁ ♦ డన వహియించెన్. ౩౩

క. ఈదియె విస్మృతంబయి, ధారుణిఁ జెలువారె నంత ♦ దారయుతుండై
కోరికఁ బలుమఱు నతు లిడి, ధారుణిసురమౌనిఁ గాంచి ♦ తా వచియించెన్.

చ. మునిపతి వేద మౌని యొక ♦ మూర్ఖుఁడు మాయను బన్ని చెప్పినన్
వినితిని గాని నేఁ దెలిసి ♦ విప్రవరోత్తమ! మహాత్మ! త
ప్పొనగుపలేదు నా నృపతి ♦ యొప్పుగఁ జెప్పెడుమాట నన్ని యా
దనుజునిదా వికారమును ♦ దానవు డెంచి వచించె నీగతిన్. ౩[illegible] 2765

చ. ఘనమవరేణ్య! రోషమును ♦ బూని వచించిన నాదు వాక్కు దే
వనుసను వ్యర్థమై చనదు ♦ ద్వాదశవర్షము లేగినంత నీ
వనుమతరై కశాపఫల♦పద్ధతి తాన శమించు నీకు నీ
వరము నొసంగినాఁడ గతి♦వార్తల నాత్మఁ దలంపకుండుమా. ౩౬ 2766

చ. అన విని శత్రుశాలుఁడగు ♦ నానరపాలుఁడు మౌనిశాపమున్
బనిపడి యట్లు పొంది తగు♦వాత స్వరాజ్యము పూర్వరీతిఁ జ
క్కనివిధిఁ బొంది తాఁ బ్రజల ♦ గాఢముదంబునఁ బ్రోచె; నాతఁ డ
ట్లొనరిచినట్టి యజ్ఞమహి♦మోజ్జ్వలభూతల మద్ది రాఘవా!. ౩౭ 2767

ఆ. ఆశ్రమంబుచెంత ♦ నలరారుచున్నది; నీదు ప్రశ్నమునకు ♦ నే నదుత్త
రము నొసంగినాఁడ ♦ రఘుకులభూషణా!, యనిన మౌనివర్యు ♦ ననుపమోక్తి.

క. విని పార్థివవర్యుని చక్కని గాథ నెఱింగి మౌని♦శాంతునితోడం
జని పర్ణశాలఁ జొచ్చెను, మనుకులభూమణుఁడు మ్రొక్కి ♦ మౌనీశునకున్.

అఱువదియయిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౬ - సర్గము.

సీత కుశలవులను కుమారులం గనినవార్త విని శత్రుఘ్నుఁ డానందించి పయనమగుట.

క. ఏరాత్రి రాముతమ్ముఁడు, చేరెఁ దదాశ్రమముఁ బ్రీతి ♦ సీతయు వంశో
ద్ధారకపుత్రద్వయమును, నారాత్రియె కనియె మౌని ♦ హర్షము నొందన్. ౧

ఆ. అర్ధరాత్రసమయ♦మందు వాల్మీకికి, మౌనిబాలకు లొగి ♦ మంచివార్తఁ
జెప్పుకొఱకు వచ్చి ♦ సీత పుత్త్రులఁ గాంచె, ననియెఱుంగఁ జెప్పి♦రంతమునియు.

చ. పురుషవరేణ్య! యాధరణిఁ ♦ బోల వశంబున మెల్గఁ జేయ కి
త్తరుణమునందె నిర్జరప♦దంబును గోరితి వేలఁగా నిదే
ధరణి యదెప్డు సర్వమును ♦ దస్వద్వశవర్తినిగాఁ జెలంగునో
ధరణిప! *దేవరాజ్యమును ♦ త్వద్బలవాహనభృత్యయుక్తితోన్. ౧౧ 2790

ఆ. వశముచేసికొనఁగ ♦ వచ్చునంచని యింద్రుఁ, డిట్లు పలుకభూత♦లేంద్రుఁడనియె;
నింద్ర! భూతలమున ♦ నెందు మచ్ఛాసన, మునకు నడ్డుగలదొ♦వినఁగవలయు.

చ. అన విని వేయిగన్నుల మ♦హాప్రభు విట్లను భూపచంద్రమా!
విను లవణాసురుండు మధు♦వీరుతనూజుఁడు పొల్చుచుండువాఁ
డన మధునామకాటవిని ♦ నన్వహ ముండును వాఁడు నీదు శా
సనమును మీఱినాఁడుగద ♦ చక్కఁగ నెన్నుము నీమనంబునన్. ౧౩ 2792

క. అని యిటు విప్రియవాక్యం,బును వేగన్నులవిభుండు ♦ పొందుగఁ బలుకన్
విని సిగ్గునొంది తనమో,మును వంచి వచింపకుండె; ♦ భూపతి యంతన్. ౧౪

క. అమరేంద్రుననుమతిం గొని, యమంసమందాత మునసె ♦ యాస్యం బెత్తం
గ మదిఁ దలంపక యీలో,కమునకుఁ జనుదెంచె మరల ♦ క్ష్మాపతితిలకా! ౧౫

క. చనుదెంచి యమర్షను నె,చ్చనమున ధరియించి భృత్య♦మండలిసేనా
జనములు వాహనములు తోఁ, జనుదేరన్ మధుతనూజు♦శౌర్య మడంపన్.

చ. మనమున నెంచి ఘోరరిపు♦మండలకాలుఁడు రాజు విక్రమం
బున లవణాసురున్ గనఁగఁ ♦ బోయెను సంగరకాంక్షఁ బొంగఁగాఁ
దనపరిచారకుం బనిచె ♦ దానవుచెంతకు వాఁడు పోయి యా
దనుజునిఁ గాంచి విప్రియము ♦ తన్మనసుం గనఁ బల్కె; నంతటన్. ౧౭ 2796

క. సురవైరి లవణుఁ డాభూ,వరుదూతను దినియె; దూత ♦ వైశమ రామిన్
బరికించి క్రోధమతియై, ధరణీశుఁడు బాణవృష్టి ♦ దానవు ముంచెన్. ౧౯

చ. దనుజుఁడు నవ్వి భూమిపతి♦తల్లజు నిష్ఫలు రాలఁ జూచి యీ
శునికృపఁ గన్నశూలమును ♦ శూరత పొంగఁగఁ గైగ్రహించి భూ
పుని బొలియింప వైచె నిదె ♦ పోయి బలాన్వితు శత్రుఁ జంపుమా
యనుపమశూలమా! యనుచు; ♦ నంతట నయ్యది జ్వాల లొప్పఁగన్. ౨౦

క. బలవాహనములతో భూ,పలలాముని క్షణములోన ♦ భస్మముచేసెన్;
అలదనుజుచెంత నెప్పటి, వలె శివశూలంబు నిల్చె ♦ వరమహిమమునన్. ౨౧

సీ. జనపతి యీరీతి ♦ సబలవాహనుఁడయి విలయమొందెను; శూల♦బలమిటువలె
ననుపమానంబుగ ♦ నప్రమేయంబుగ నలరారు; దేవుద♦యమున నీవు
లవణుని జంపంగ♦లవు సంశయంబులే దగృహీతశూలుని ♦ నతని మారు
కొన జయుంబొదవు ని♦క్కువ మిద్ది, లోకంబులకు మేలు నీకృత్య♦మకలుషంబు

* దేవరాజ్యం కురుష్వేహ సభృత్యబలవాహనః - అనిమూ.

చ. అని యిటు పల్కుచుఁ నగుచు ♦ హర్షము మీఱఁగ మాటిమాటికిన్
దనుఁ గనుచున్న యాలవణు ♦ దర్పసమగ్రుఁడు రామతమ్ముఁడుం
గనుఁగొని రోషతామ్రముఖ♦కంజుఁడుగాఁ దనరారి యత్రువా
రిని విడిచెన్; మహోగ్రమగు♦రీతిని గ్రోధము వెల్వరింపఁగన్. ౬ 2807

ఆ. అమ్మహాత్ము దేహ♦మునందుఁ దేజోమయ,ములగు కాంతు లట్టె ♦ వెలికి సరిగె
దాన మఱియుఁ గ్రోధ♦తామ్రాక్షుఁడయియిట్లు,పలికెనతనితోడఁ♦బంత మాని.

క. దనుజా! దుష్టమతీ! మా,రొక్కని ద్వంద్వాహవము చేయఁ ♦ గోరితి శ్రీరా
మునకున్ ధీమంతున కే, ననుజుఁడ దశరథునిసుతుఁడ ♦ నర్కకులజుఁడన్.

క. విను మే శత్రుఘ్నాహ్వయ,మును గాంచినవాఁడ నిత్య♦మును వైరులఁ గా
లుని వీటికిఁ బంపుదు ని, న్ననిఁ జంపఁగ వచ్చినాఁడ ♦ నట్లగుట నిటన్. ౧౦

సీ. ద్వంద్వయుద్ధముఁ బ్రవి♦దారణకాంక్షి నౌ నాకొసంగుము నీ వ♦నంగ సర్వ
జీవవైరివి గానఁ ♦ జేరితి నినుఁ జంప జీవించి పురి కింకఁ ♦ జేరలేవు;
నా విని దనుజుండు ♦ నవ్వుచు [1]శత్రుఘ్నుఁ గనుఁగొని దుర్మతీ! ♦ కాలవశము
చేత నిచ్చోటికిఁ ♦ జేరితి నాతల్లి తోడఁబుట్టువునకుఁ ♦ దోడఁబుట్టు

ఆ. వగును రావణుండు ♦ హతమతీ! నీచాత్మ!, యాఁడుదానిమిషను♦ నంత మొందె
నతఁడు రాముచేత ♦ నావిధ మే విని, యతనివంశనాశ ♦ మాత్మ సైఁచి. ౧౨

క. ఊరక యుంటి; నవజ్ఞను, నీరీతిం జేసె మాకు ♦ నెంచక రాముం
డోరిదురాత్మా! నే ననఁ,గా రాజులఁ జంపినాఁడఁ ♦ గ్రాలెడుశక్తిన్. ౧౩

క. అవమానించితిఁ గొందఱ, నవనీశులఁ దృణము లట్లె ♦ యరయఁగ భూత
ప్రవిమలకీర్తులు రాజులు,ను వర్తమానులును ముందు ♦ నుతిఁ గనునృపులున్.

తే. తెగినయట్లె సంభావింపు ♦ దృప్తరాజ
తనయ! యుద్ధంబె కోరు నీ♦కును నొసంగి
నాఁడ సంగ్రామ మింక క్ష♦ణము నిలువుము
యాయుధము తెచ్చునందాఁక ♦ యాత్రపడక. ౧౪ 2814

క. నాయాయుధమును దెచ్చెద, నీయిూప్సిత మెల్లఁ దీర్తు ♦ నింక నిలువుమా
[2]నాయన! శత్రుఘ్నా! యన, నాయవనీశ్వరకుమారుఁ ♦ డాతనితోడన్. ౧౫

తే. నాయెదుట బ్రాంద కెట్లు చ♦నంగవచ్చు
శత్రు వొక్కండు స్వేచ్ఛగఁ ♦ జనఁగ నతని
యుద్ధమర్మ మెఱింగిన ♦ యిద్ధతేజుఁ
డూరకే పోవనీయంగ ♦ నొప్పుకొనునె?. ౧౬ 2816

---

1 శత్రుఘ్నో వీర్యసంపన్నో రోషా దశాస్యా న్యవర్తత -అనిమూ. 2 నాయన-ఈవిశేషణము సాభిప్రాయమని తెలియఁదగు.

చ. తనపయి కేగుదెంచు బహు♦దారుణపాదపరాజి మూఁడు తీ
వ్రనిశితబాణపుంఖముల; ♦ వానిని గొన్నిఁటి నాల్గుబాణముల్
గొని యొకకొన్నిఁటిన్; క్షితిని ♦ గూలఁగఁ జేసి శరైకవృష్టి నా
దనుజునివక్షముం దడిపె ♦ దర్పము పొంగఁగ దాన వైరియున్. ౧౧ 2826

క. చలియింప కట్టహాసం, బొలయ విలాసమున వృక్ష♦మొండు పెఱికి వే
తలపగుల మోఁదె దానం, జలితాంగుం డగుచు మూర్ఛ ♦ సౌమిత్రి కనెన్.

తే. ఇట్లు శత్రుఘ్నుఁ డిలఁ బడ ♦ నెసఁగె మాని
దివిజగంధర్వముఖులదౌ ♦ దీనరవము
వైరి ధరణిని బడియుంట ♦ వాని మృతుఁగఁ
దలఁచి యవకాశముండియు ♦ దానవుండు. ౧౩½ 2828

క. తనయింటికిఁ బోఁడయ్యెను;, ఘనశూలము తెచ్చుకొనఁగఁ ♦ గాని, తలఁపఁడ
య్యెను జచ్చె వైరి యంచని, యనుమానము లేక యాతఁ ♦ డలరుటకతనన్.

చ. తనమది లక్ష్మణానుజుఁడు ♦ దప్పక చచ్చె నటంచు నెన్ని యా
దనుజుఁడు భక్షణార్థ్వముల ♦ దారుణజంతువులన్ జవంబునం
గొని చన నెంచునంతటనె ♦ క్షోణివరుం డొగిఁ దెల్వినొంది బా
ణనికరహస్తుఁడై నిలిచె ♦ నాకవిరోధికి నడ్డమై తగన్. ౧౬ 2830

క. ద్వారమునకు నడ్డముగా, నారీతి న్నిలిచి దివ్య♦మగుచు నమోఘం
బై రాజిలు నుత్తమశర, మారసి తేజమున నుండు♦నట్టి తనువునన్. ౧౬½

క. ఘోరంబగుదానిని దు,ర్వారసుదీచులను దెసల ♦ భాసిలఁ జేయం
గా రామునితమ్ముఁడు గొని, సారము వజ్రాననంబు ♦ చంచద్గతియున్. ౧౭½

తే. మేరుమందరతుల్యమై ♦ మించుపర్వ,ములను దనరి యజయ్యమై ♦ వెలసి రక్త
గంధదిగ్ధాంగమై పత్ర♦కలితమగుచు,దనుజపర్వతకులిశమై ♦ తనరుచుండ.౧౮½

క. అరుదుగ నట్టిశరంబును, బరికించి గ్రహించె; నిట్లు ♦ భాసుర తేజ
స్స్ఫురణమున మండునాశర,వరమును గని భూతవితతి ♦భయముం గనియెన్.

క. సురలును గంధర్వులు ని,ర్జరవైరులు నచ్చరలును ♦ సాధుమునీంద్రుల్
గరము భయం బందిరి నం,గరదర్శనకాంక్ష నున్న ♦ కంజజు నమరుల్. ౨౧

క. కని దేవేశా! వరదా!, యనుపమకరుణాలవాల! ♦ యఖిలజగంబుల్
కనునే ప్రళయంబును లే,క నిఖిలయుగంబయము గల్గఁ ♦ గలదే? చెపుమా. ౨౨

చ. మును పిటు తోఁచు భీతి జగ♦ముల్ కనియుండఁగ లేదు దేవతల్
వనజభవా! భయంబు గను♦భంగి జగత్త్రయ మబ్బురీతి క
ల్గినవిపరీతమున్ వినఁగ♦లేదు కదా? వివరించి చెప్పుమా
యన విని దేవవాక్యముల ♦ నాపరమేష్ఠియు నిర్జరాళితోన్. ౨౩½ 2837

క. అప్పుడు కల్గిన క్షోభము, తప్పక వివరించి చెప్పఁ ♦ దగునని దయతో

క. సురపురసంకాశంబై, పరఁగెన్; క్షేత్రములు సస్యబహుళము లగుచున్
బరమాహ్లాదము నిడుచుం, గరము విరాజిల్లె సృష్టి గల్గెన్ సరిగన్. ౯
ఆ. విగతరోగ మగుచు వీరభటాకీర్ణ,మగుచు రాముతమ్ముఁ డలరి ప్రోవ
నర్ధచంద్రసమత నందుచు యమునతీ,రమున సౌధముఖ్యరాజితమయి.
క. తనరుచుఁ జత్వరములచే,తను విపణులచేత నృపవథవితతిచేతన్
ఘనమై వర్ణచతుష్టయ,మున వ్యాపారముల మిగులఁ బొల్పుచు నలరెన్.
క. దనుజుఁడు మునుపాలింపం,గను శోభిలకున్న తన్నగరమును శ్రీరా
మునిసోదరుండు నిర్మల,ఘనసౌధవిరాజితంబుగా నొనరించెన్. ౧౨ 2861
క. పలువిధములైన సౌధం,బుల నానావర్ణజనులు పొలుపుగ నుండన్
బలశాలి చేసి యేలెన్, లలితారామములఁ జెలువుల్ జెన్నెసఁగన్. ౧౩
క. సురుచిరపదార్థములచేఁ, గరము విరాజిల్లి సురనికాయమనుష్యో
త్కరనిబిడంబై సురపురి,కరణిన్ జెలువారి విపణి కాంతం బగుచున్. ౧౪
క. పలుదేశంబుల నుండియుఁ, జెలువారెడు వేశ్య వచ్చి స్థితిఁ గాంచి ధనం
బుల సేకరించి వణిజులు, విలాసముల నొప్పుచుండ వేడుకఁ గనుచున్.
క. ధనసంపన్నంబై యొ,ప్పిన పత్తన మిల్లఁ జొచ్చి పృథుకీర్తి యనం
దనరినశత్రుఘ్నుం డ,త్యనుపమహర్షంబు నొందె నాత్మన్ మిగులన్. ౧౬
చ. పురమునఁ గొంతకాలము విభూతి నెసంగుచు నుండి రాఘవే
శ్వరుచరణాబ్జముల్ గనఁగ స్వాంతమునం దలపోసి నేఁటివ
త్సర మిది ద్వాదశం బగుచుఁ దక్కనిరీతి ననంగ నింక నే
నరుగుట యొప్పునంచు నమరాధిపపత్తన మట్లు లొప్పుచున్. ౧౭ 2866
క. జనవితతి రమ్యమా ప,త్తనమును శాసింపఁ జాలు ధన్యుల నియమిం
చి నృపతి యన్ననుఁ జూడఁగ, మనమునఁ దలపోసె సంభ్రమదముప్పొంగన్.

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

---

## ౭౧ - సర్గము.

శత్రుఘ్నుం డయోధ్యకు మరలి వచ్చుట.

క. తరువాతం బంద్రెండవ, శరత్తునన్ రత్నగానుజన్ముఁ డయోధ్యా
పురమునకుభృత్యసుభటో,త్కరయుతుఁడై వెడలె రాముఁ గనుఁగొనుతమితోన్.
క. అనుమోదంబునఁ దోడను, జనుదెంచెడు మంత్రిముఖుల సకలబలములన్
జన దీక దూరము చనుదే,ర నని శతాశ్వములఁ గూడి రథ మెక్కి చనెన్
క. మును చనుదెంచినచందం,బును లెక్కిడుకొనుచు మాసములు నేడు పథం
బునఁ బుచ్చి యెనిమిదవ నెల, చనుచుండ మహారథుండు శత్రుఘ్నుండున్,

సీ. వాల్మీకిమౌనిభూ♦వరుని యాశ్రమమున కరుదెంచి యందుండ ♦ నగునటంచు నమ్మునిపదముల ♦ కభివాదమును జేసి యతఁ డొసంగినపాద్య♦మర్ఘ్యముఁగొని బహువిధమధురోక్తి♦భరితగాథాసహస్రముల నాతఁడు చెప్ప ♦ సమధికమతి యలరఁగావినియె;నా♦యమలమునీంద్రుండుపలికెనిట్లని;మహా♦పరుమహృదయుఁ

తే. డైన లవణాసురుం జంపి ♦ తది సుదుష్క-
రముగుకృత్యంబు వెయ్యేల ? ♦ రఘుకుమార !
యతనిచేతనె సబలవా♦హనులు కొంద
ఱవనినేతలు నిహతులై ♦ రనిని మున్ను. ౬ు 2871

క. గురుతరబాహూ! యాతఁడు, దురాత్మకుం డట్టియసుర ♦ ద్రుంపంబడెఁ బా
పరతుం డాలవణుం డో, పురుషర్షభ! లోకభయము ♦ పోయెక ద్వరగక. ౭ు

క. భూరిభవత్తేజంబున, ధారణి బాధయు నడంగెఁ ♦ దన్మహాత్ముని చే
నారావణుండు గూలెక, ఘోరాకారుం డతండు ♦ క్రూరుండు గదా? ౮ు

క. దనుజేంద్రుఁడు లవణుం డా,తనికంటెం గ్రూరతముఁడు ♦ తద్వధఁ గావిం
చినవాఁడ విద్ది గొప్పది, యనఁ దగుకృత్యంబు పుణ్య ♦ ములరెక నీకుక.

క. సురలకు దీసం గల్గెను, బరమప్రమదంబు భూత♦పటలమ్మునకుక
ధరణికిఁ బ్రీతి రొయిసర్చితి;, సురపతిసభనున్న నేను ♦ శుభతమదృష్టిక. ౧౦

క. మీయుద్ధంబును గాంచితి, నాయెడనే యుండి ప్రీతి ♦ యలరెక; శత్రు
ఘ్నా! *యసుర మృత్యు వొందుట, నీయెడలక ముద్దుగొనుదు♦నేశీర్షంబుక.

చ. అని వచియించి ప్రీతి యల♦రారఁగ నాతనిమస్తకంబు నా
మునిపతి ముద్దు వెట్టుకొని ♦ మోదము చూపుచు మార్గ మిద్దియే
యని యతిథిప్రియంబయిన ♦ యర్ఘ్యము చేసి తదీయసేనకుక
మన మలరంగఁ దృప్తియగు♦మాడ్కిని విందొనరించె నేర్పునక. ౧౩ 2877

సీ. శత్రుఘ్నుఁ డర్ఘ్యభో♦జనమునఁ బ్రీతుఁడై యాశ్రమాంతరమున♦యందు గీత
మాధుర్యమునఁ దగు ♦ మానితశ్రీరామ చరితంబుఁ దా విని ♦ సక్రమముగఁ
దంత్రీలయాదియు♦తంబయి త్రిస్థానకరణాన్వితంబయి ♦ పరఁగి సంస్కృ
తమయి లక్షణసంయు♦తంబయి సమతాళవిలసితంబయి ముని♦తిలకరచిత

తే. మైన శ్రీరాముచరితమ్ము ♦ నాదరమున
వినుచు నాయక్షరమ్ములు ♦ మునుపు జరగి
నట్టి కథనెల్ల నిజములై ♦ యలరఁ జేయ
విగతసంజ్ఞుఁడై యశ్రువుల్ ♦ విడుచుచుండె. ౧౬ు 2878

క. తను వెఱుఁగ కొకముహూర్తంబును మూర్ఛం గాంచి యొక్క♦పోలిక నిట్టూ
ర్పును బుచ్చి యట్టె యుండెను;, మనమొప్పఁగ నంతవినియె♦మరలనతండుక.

* ఉపాఘ్రాస్యామి తే మూర్ధ్ని స్నేహ హ్యేషా పరా గతిః-అనిమూ.

క. గీతంబులఁ బ్రాప్తవృత్తం, బేతెఱఁగునఁ జెప్పఁబడియె ♦ నిపుడు జరగున
ట్లే తోఁచె నంత సుభట, వ్రాతము నాగీతసరణి ♦ బాగుగ వినియెన్. ౧౮

క. మోములు వంచి సుహర్షిని, దా మొందుచు నతని నూరఁ♦దల్లజు లిది యే
మేమో యాశ్చర్యంబని, తా మొండొరులకును జెప్పు♦తద్రవ మలరెన్. ౧౯

క. ఇదియేమి యెందు నుండితి, మిది స్వప్నమునందుఁ దోఁచె♦నేమో! నిజమా!
యిది మున్ను మాచినారము, గద యట్లే వింటి మిపుడు ♦ కడుఁ జిత్రముగన్.

క. గానము స్వప్నంబున మన, కీనాఁడునుఁ దోఁచె నౌర ♦ యిది యచ్చెరువే
యానని శత్రుఘ్నునితో, మానసు లిట్లనిరి; దేవ♦మానీశ్వరునిన్. ౨౧ 2883

తే. ప్రశ్నచేయుము చక్కన♦ర్థంబు దీనిఁ
దెలియఁగాఁ దగు నన విని ♦ యలరి కుతుక
మెట్టి కాంచి వారల ♦ సరసి పలికె
నిట్టి ప్రశ్నము చేయుంగ ♦ నెట్లు తగును?. ౨౨ 2884

చ. మునివరుఁ బ్రశ్నచేయువిధ♦ముం గన రాదు మదిం దలంచి చూ
చినఁ గను నద్భుతంబు లిటఁ ♦ జెప్పఁగ శక్యముగాని యట్టులే
తన రెడుఁ గౌతుకంబున న♦తాంతము పొల్చెడు నిమ్మహామునీ
శుని నడుగంగ రా దనఁగ ♦ క్షోణివిభుం గని వార లట్లయా. 2885

క. అని పలికి శత్రుఘ్నుఁడు, తన బలములు నిద్రపోవఁ ♦ దాఁ బంచి మునీ
శునకున్ వందన మిడి తాఁ, జనియె నివాసమున కాత్మ ♦ శంకం గనుచున్.

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౭౨ - వ సర్గము.

{ శత్రుఘ్నుఁడు శ్రీరాముని జూచుట. అన్నయాజ్ఞ నొంది మరల మధురాపురికిం బోవుట. }

క. పురిమలలామముం డాతఁడు, పరుసఁ జనుఁ దెచ్చి స్థిర మొక్క♦భంగిఁ గనకయా
తురపడి యుండుట నిశ్చయముఁ, బరమాణువుపాటియుఁ ♦ బట్టకయుండెన్. ౪

క. అనుపమరామచరిత్రం,బును బలుమారు చింతచేయఁ ♦ బూనెను; గానం
బునఁ దగుశబ్దము మధురం,బును దంత్రీలయయుతమును♦బూజ్యతమమునై. ౫

క. అలరారె దాని వినఁగా, మెలమెల్ల రాత్రి గడచె; ♦ మేల్కొని యంతన్
గలఁగి మునితోఁ గృత్యం,బులు నాదయికములఁ దీర్చి ♦ మునిపతిచెంతన్.

క. నిలువఁబడి దోసిలొగ్గుచుఁ, బలికెన్ భగవంత! రామ♦భద్రునిఁ గనని
మ్ముల నేరెదమది యనుమతిఁ, బలికిన సేవకులఁ గూడి ♦ పయనమొనర్తున్.

చ. అన విని శత్రుతాపనుని ♦ నారఘురామునిసోదరుం గనుం
గొని ముని కౌఁగిలించి రఘు♦కుంజరుఁ జూడఁగఁ బొమ్ము నావుడున్

మునికి నమస్కరించి రథ♦మ్మున ముద మొప్పఁగ నెక్కి చారుకాం
తిని దగి యాయయోధ్యకు న♦తిత్వరగాఁ జనె జ్యేష్ఠుఁ జూడఁగన్. ౯ 2891

క. చని యిక్ష్వాకుకులోద్భవుఁ, డనఘుఁడు శ్రీమంతుఁ డిట్టు♦ లతిరమ్యంబై
కననగు పురిఁ జొచ్చెను*గాం,తిని మించెడు రాముఁ గాంచఁ♦దివురుచు నంతన్.

క. అనుచరమంత్రిగణావృతుఁ, గనె రాముని మంత్రివర్య♦కలితు శచీనా
థుని గాంచినట్లు వినయం,బునఁ బ్రాంజలియాచు భక్తి♦ మ్రొక్కి రఘుపతిన్.

క. జ్వలితాంగుని మహితాత్ముని, సులలితనేత్రాబ్జు నిత్య♦శూరుని గనుచుం
బలికెన్ రాజేంద్రా! మీ,పలికినగతిఁ గృత్య మెల్లఁ♦ బంతం బలరన్. ౯

క. ఒనరించినాఁడ లవణుని, బనిచితి యమపురికిఁ బురముఁ♦ బాలించితి నం
దును బండ్రెండేఁడులు మి,మ్మును వదలి వసించినాఁడఁ♦ బోలని మదితోన్.

సీ. వసియింపఁ జాల భూ♦వర! మిమ్ము విడనాడి కాకుత్స్థ! పటుశౌర్య♦కలిత! యాజ్ఞ
దయచేయు మిందుండఁ♦ దగునని తల్లిని విడిచినవత్సంబు♦ విధమున నట
నుండితి; నా విని♦ యుర్వీశుఁ డాతనిఁ గౌఁగిటం జేర్చి యి♦కరణిఁ బలికెఁ;
బొందకుము విషాద♦మును వీర! యయ్యది క్షత్రియచరితంబు♦ కాదు గాన

ఆ. విప్రవాసమందు♦ విహ్వలింపరు రాజు, లఖిలమనుజు లెలమి♦ ననిశ మొక్క
గతిని గష్టము లొగిఁ♦ గలుగకుండఁగఁ బ్రోవఁ,దగినవారు క్షత్ర♦ధర్మ మిద్ది.

క. తలఁచినయప్పుడు నగ్గన, నెలమిన్ రావచ్చు నిటకు♦ నిందుండి దినం
బులు కొన్ని పుచ్చి మధురకుఁ, గలఁగని మదిఁ బోవవచ్చుఁ♦ గప్రగుణాఢ్యా!.

తే. ప్రాణములకంటె నెక్కుఁడై♦ పరఁగు దీవు
సంశయం బించుకయు లేదు♦ సమధికముగ
రాజ్యమును బ్రోవఁగాఁ దగు♦ రాజులకును
ధర్మ మిది యాట నీ విట♦ నిర్మలగుణ!. ౧౬ 2898

క. నివసింపు మేడుదినములు, జవమున నవ్వలఁ జనంగఁ♦ జను మధురకు నో
సువిమలధిషణా! భృత్యులు, జవనాశ్వము లెల్లఁ దోడఁ♦ జను దేరంగన్. ౧౭

చ. అనుటయు రామచంద్రువచ♦నావళి ధర్మయుతంబు నౌట నె
మ్మనమున కింపుఁ బెంప విని♦ క్ష్మాపతితో నతిదీనుఁ డౌచు నేఁ
జనియెద యుష్మదాజ్ఞ శిర♦సా వహియించుచు నంచుఁ బల్కి రా
మునినికటంబునందుఁ దమిఁ♦ బుచ్చెను నేడు నిశల్ క్షణంబుగన్. ౧౮

క. తరువాత రామునానతిఁ, దరలం దలపోసి సత్య♦ధర్ముని మహితా
త్ము రఘుకులోద్ధారకు భూ,వరు వేఁడుచు లక్ష్మణునిని♦ భరతుని భక్తిన్. ౧౯

ఆ. పయనమునకు వేడి♦ భవ్యరథం బెక్కి
వారుతోడ నెలమి♦ దూరమునకు

---

* యత్ర రామో మహాద్యుతిః - అనియూ.

రాఁగ వారి నిల్పి ♦ యేగెఁ దా నయోధ్యకు
నస్తమనంబు లేసి ♦ చంద్రహాసను. ౨౧ 2902

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 23 - వ సర్గము.

—ఋష్యపుత్త్రునిం దెచ్చి బ్రాహ్మణుఁడు రాజద్వారమున నాక్రోశించుట.—

క. భరతుఁడు లక్ష్మణుఁడును దో, డుగ వెర సుమిత్త్రపుత్త్రు ♦ నాశత్త్రుఘ్నున్
బురికంపి ధర్మరక్షణపరుఁడై సుఖ మలర జనులఁ ♦ బరిపాలించెన్. ౧ 2903

క. చనియెను గొన్నిదినంబులు, జనపదసంవాసి వృద్ధ ♦ బ్రాహ్మణుఁ డొకటం
జనుదెంచి మృతుండగు తన, తనయుని ద్వారమునఁ బెట్టి ♦ తాఁ బలవించెన్.

క. పలువిధములఁ దనపుత్త్రునిఁ, బిలుచుచు స్నేహంబు వగయుఁ ♦ దనకుం దోఁపం
గలవిలపముచుం దనయా!, కులమును బోషింపఁ జాలు ♦ కొడుకా! యనుచున్.

క. వనటం గుందుచు నేడ్చుచు, ననియెన్ ; దొలిజనని బాప ♦ మది యెట్టిది నే
నొనరించినాఁడనో చ, చ్చినపుత్త్రుని నిన్నుఁ గనఁగ ♦ జీవించితిఁగా. ౪ 2906

సీ. వయను రాలే దింకఁ ♦ బంచహాయనములు మాత్త్రమే గడచెను ♦ మరణమీతఁ
డొందెనింతటిలోన ♦ నుసుదుఃఖవార్ధిలోననుముంచియనుచునో ♦ తనయ! యనుచు
బలవించి నే నింకఁ ♦ గొలఁదికాలంబున నిధనముం బొందెద ♦ నిజము పుత్త్ర!
నేను నీతల్లియు ♦ నీవగఁ బొరిజాల ము నెప్పుడైన న ♦ త్యేతరంబు

తే. బలుకఁ దలపోయ, హింసయుఁ ♦ గలఁప నెపుడు, పాపమెట్టిది చేయంగఁ ♦ బాలుపడిన
వాఁడనోగాని నాపుత్త్ర ♦ వస్యఁడిట్టు, లంతమొందెను దేననో ♦ యరయఁజాల. ౭

క. స్మరియింప నొరులపాపము, వరతనయుఁడు పోయె యముని ♦ భవనంబునకున్
దరుణమ్మునఁ బిత్రుకాల్యము, సరిగా నొనరింప కిట్లు ♦ చచ్చెం గాదే?. ౭౫

క. మును విది చూచి యెఱుంగను, విన నదియును లేదు ఘోర ♦ విషయం బిది రా
మునిరాజ్యమందుఁ దజ తప్పి రీతిం జచ్చు టొకటి ♦ పెంపువహించెన్. ౮౫

క. జనపతి సుంతయు లేకు, న్నను బెద్దదియో యఘంబు ♦ నాజనులన్
వనటం గుందఁగ నొనరిచె, ననుమానం బింతయైన ♦ నగపడ దిందున్. ౯౫

తే. ఇతరరాజుల దేశాలి ♦ నెందునైన, బాలుఁ డంతంబు నొందు టే ♦ వరున లేదు
రామ! నీ వీకుమారుధ ♦ ర్మగృహవాను, బ్రదుకఁ జేయుము నా ప్రియ ♦ బాలకునిని.

తే. ద్వారమున నిందు నే నిప్డు ♦ భార్యఁ గూడి,
యనదచందంబునన్ మృతి ♦ నందువాఁడ;
బ్రహ్మహత్యను బొందిభూ ♦ వర సుఖంపు
మనుజులం గూడి దీర్ఘాయు ♦ వంది వర్ధ్య!. ౧౭ 2912

చ. బలమున నొప్పియున్న జన ♦ పాలక! నీ కగురాజ్యమందు నీ
కొలఁదిదినంబు లుండితిమి ♦ కోరిక లూరఁగ నిప్డు డిట్టిపా

టాలసెఁ దద్వితీయపాలనము ♦ నోర్వక పోయెద మింక మృత్యువే
చలమున మమ్ముఁ బొందెఁ గద? ♦ చాలు సుఖం బిఁక నీదురాజ్యముల్. ౧౩
తే. బాలు నంతంబు నొందింపఁ ♦ జాలు రాము
నధిపునిగఁ బొందితిమి నిశ్చ♦యముగ [1]రాజ
పాపములఁ జిక్కి చత్తురు ♦ ప్రజ లవిధిగ
రా జసద్వృత్తి మెలఁగినఁ ♦ బ్రజలు ధరణి. ౧౪ 2914
క. అంతము నొందుదు రిది య,త్యంతము దుఃఖ మ్మొసంగు♦నది యతరుణమం
దంతముఁ గూర్చుట పాలన, మెంతయు నన్యాయమనుచు ♦ నెన్నఁగవలయున్.
క. అనుచితకృత్యంబుల నే, జనపదములఁ బురములందు ♦ జను లొనరుతురో
జనులందు మరణ మొందుదు;, రనూన విధి రక్షణంబు♦నరయునొ యెచటన్.
తే. కాలకృతమృత్యువే కల్గుఁ ♦ గాని యి ట్లకాలమరణంబు గల్గ దే♦కరణిఁగాని
స్పష్ట మిది భూపవర్యుదో♦షంబు సంశ,యంబు లే దింతయైనన♦త్యం బిదాను.
క. పురమున జనపదమున నీ,వరుసను శిశుమరణవిషయ♦వార్త కలిగెనం
చురునాదంబునఁ బలుమఱు, నరపతినిం గూర్చి నిజత♦నయుఁ దెల్పె వగన్.

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౪ - వ సర్గము.

నారదుండు రాముననుఁ బాలునిమృతికి హేతువుం దెలుపుట.

[2]క. కరుణమ్ము దుఃఖశోక,స్ఫురణమ్మును నైన విప్ర♦పుంగవు నేడ్పున్
నరపతిచూడామణి రఘు,వరుఁ డెంతయు నాలకించె ♦ వంత గదురఁగన్. ౧
చ. విని రఘురాముఁ డార్తి వగ♦పెల్లిద మోపఁగలేక మంత్రులై
ఘనమతులౌ వసిష్ఠముని♦కాంతుని యోగిని వామదేవుఁ ద
క్కినమునిమంత్రిపౌరులను ♦ గేవలతత్త్వము తెల్పువారిఁ జ
య్యనఁ బిలువంగఁ బంచెను, మ♦హాత్ము వసిష్ఠునిఁ గూడి వార లా
జనపతిఁ జేర వచ్చిరి ప్ర♦శస్తమతుల్ చెలువారుచుండఁగన్. ౨ 2920
తే. వచ్చి రఘురామ! వర్ధిల్లు ♦ వరయశంబుఁ
గాంచి యంచొగి పల్కిరి ♦ కాశ్యపముని
వామదేవమార్కండేయ♦నామమునులు
గౌతముండు జాబాలిమౌ♦ద్గల్యమునులు ౩ 2921

---

1 రాజదోషై ర్విపద్యంతే ప్రజా హ్యవిధిపాలితాః, అసద్వృత్తే తు నృపతౌ అకాలే మ్రియతే జనః-అనిమూ. 2 తథా తు కరుణం తస్య ద్విజస్య పరిదేవితం, శుశ్రావ రాఘవ స్సర్వం దుఃఖశోకసమన్వితమ్-అనిమూ.

క. అనృతము నధర్మమును మే,దిని లేకుండంగఁ జేసి ♦ దీర్ఘాయువు న
మ్మనుజులు పొందిరి సత్యం,బు నధర్మము సుంతయేని ♦ పూనక మనుజుల్.
తే. మంచికర్మంబు లొనరించి ♦ యంచితమగు
సత్యధర్మానురక్తిచేఁ ♦ జాలఁ గ్రాలి
యశముఁ గాంచిరి; త్రేతాహ్వ♦యమునఁ బరఁగు
నీయుగంబున బ్రాహ్మణు ♦ లెల్ల నృపులు. ౨౧ 2932

*క. అనుపమతపముం జేయం,గను దొడఁగిరి సేవచేయఁ♦గాఁ బూనిరి త
క్కినవారు వైశ్యశూద్రుల, కనువగు శుశ్రూషయనెడు♦నది ధర్మముగన్.
క. చరణజులు విశేషించియుఁ, బరిచర్యలు చేయుచుండు♦వారు మిగతభూ
సురముఖ్యవర్ణములకున్, దరువాతన్ నరుల కనృత♦ధర్మేతరముల్. ౨౨
ఆ. వృద్ధి నొందఁ జొచ్చె ♦ నెట్టులో పాదమా,త్రముగనున్నయదియుఁ♦దనరె రామ
తా ద్వితీయపాద♦ధర్మేతరముఁ గూడి, యట్లసత్య మలరె ♦ నంతలోన. ౨౩
సీ. ద్వాపరయుగమనఁ ♦ దత్కాల మలరారు నీత్రేత గడచిన ♦ నెనఁగు నదియె
నం దధర్మ మసత్య ♦ సుభివృద్ధి నొందును దత్కాలమున వైశ్య♦తతిఁ దపంబు
పొందును; శ్రీరామ♦భూపాల! యీరీతిగా యుగత్రయమున ♦ భూసురాది
వర్ణత్రయంబుఁ ద♦పం బొందు ధర్మంబు నారీతినే పొల్చు ♦ నందు ధర్మ
ఆ. మంఘ్రిజులను బొంద ♦ దాకుల మవనిపై, నాల్గవదయి యుంట ♦ నరవరేణ్య!
శూద్రులందుఁ దపము ♦ శోభిల్లుఁ గలియందు,నం దధర్మమధిక ♦ మౌఁ దలంప.
క. ద్వాపరమందున ధర్మం, బాపాదజులందె యధిక♦మై యుండును నో
భూపాల! యీయుగంబున, నీపాలనమందునున్న ♦ యిల నికటమునన్. ౨౮
చ. చరణభవుండు సత్తపము ♦ సల్పెడు దుర్మతియై తదీయమా
పరమతపోబలంబుననె ♦ బాలుఁ డితండు మృతిం గనెన్ మహీ
వరువిషయంబునం దెవఁడు ♦ వారక కార్యము చేయుచుండుఁ ద
త్పురమునఁ గాని యుత్తపము ♦ పొల్చు దరిద్రత కాలవాలమై. ౨౯ 2938
క. నరపతి యాతఁడు వేగమ, నరకంబున కేగుఁ బాల♦నముఁ జక్కఁగ శా
స్త్రరతిం జేయనికతమునఁ, బురుషవరా! రామచంద్ర! ♦ పొలుపుగవినుమా!.
క. మనుజులు పఠించినం జ,క్కని నియతిం దప మొనర్పఁ♦గా సత్కర్మం
బును జేసిన షష్ఠాంశం,బును సత్పాలనముచేయు ♦ భూపతి పొందున్. ౩౦
క. కృతకర్మంబున భూతల,పతి యాఱవయంశ మొందు ♦ భాగ్యము గని యు
న్నతధర్మంబునఁ బ్రజలన్, హితముగ నెటు ప్రోవకుండ ♦ నిల వర్ధిల్లున్. ౩౧
ఆ. అట్లు ప్రోవకుండు ♦ నాశండు నాల్గవ, యంశ మొందుఁ బాప♦మందుఁ జుమ్ము;
పురుషవర్య! నీవు ♦ ధరణిని వెదకుమా, దుష్కృతంబు చేయు ♦ దుష్టనరుని.

* తపో౽తప్యంత తే సర్వే శుశ్రూషా మపరే జనాః-అనిమూ.

క. దానికి యత్న మొనర్పుము, గానంబడుగా ధర్మవృద్ధి ♦ క్ష్మాస్థలి యీయా
న్నానమన జంపుగ బ్రాహ్మణసూనుని జీవితము పొల్చు ♦ క్షోణీశేంద్రా! ౩౪
ఎబ్బదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౭౫ - సర్గము.

రాముఁడు దక్షిణదిక్కునఁ దపస్సు చేయు శూద్రుని గాంచుట.

క. నారదువాక్యంబును వింత, భీరామాంగం బమృతసమము ♦ విని హర్షంబుగా
భూరిసుఖంబు బొందె లక్ష్మణు, గారవ మలరారఁ బలికెఁ ♦ గరుణ యలరఁగా
క. అనుజా! సౌమిత్రీ! వేగను, జని బ్రాహ్మణు నూరడింపు ♦ సద్వ్రతుఁ డాతం
డనయంబుడు వగ నొందంగాఁ, జని దాశిశుతనువు నూనెఁ ♦ జక్క నునుపుమా.
ఆ. పాత్రమునకు నూనె ♦ భద్రంబుగా నించి
దానియందు శిశువు♦తనువు నునిచి
పరిమళములఁ జల్లి♦పాత్రమ్మునం జేర్చి
తనువు చెడకయుండఁ ♦ దగ నొనర్పు ౩ 2946
చ. తను వది యెవ్విధంబునను ♦ దారుణరీతిఁ గుళ్ళి రాక యుం
డను జను భేద మింతయుఁ గ♦నంబడ కుండఁగఁ జేయు మిట్లు యీ
పని నొనరింపు; మంచును స్వ♦పాలకుఁ డానతి యిచ్చి లక్ష్మణుం
గనదురుసాధులక్షణని♦కాయుని బంపి సుస్సునందుగన్. ౪ 2947
క. తలఁచె ను బుష్పకమును జవ, మలరఁగ రమ్మనుచుఁ గీర్తి♦యశములఁ దగు భూ
పలలాముఁ డంత నయ్యది, విలాసగతి మీఱ వచ్చె ♦ విభునాజ్ఞ మెయిన్. ౫
చ. కనకవిభూషితంబగుచుఁ ♦ గ్రాలెడు పుష్పక మింగితజ్ఞమై
తనరుటచే ముహూర్తమునఁ ♦ దాఁ దగు రాముని చెంతఁ జేరి యి
ట్లనియె; నమస్కరించి వసు♦ధాధిప! నీకగునాజ్ఞ వచ్చితిన్
బని యెదియేని పంచిన న♦వశ్యము చేయుదుఁ గింకరుండ నా. ౭ 2949
చ. మనుచిరవుష్పకోక్తులను ♦ క్షోణివిభుం డాలకించి భూ
సురమునివర్యసంతతికి ♦ శోభిల భక్తిని మ్రొక్కి మ్రొక్కి నా
దరమున బుష్పకంబు; రఘు♦వల్లభుఁ డాయతచాపతూణముల్
వరశరవాలముం గొనుచుఁ ♦ బాదజుఁ జంపఁగఁ బోవుచుండగన్. ౮ 2950
క. పురరక్షణం బొనర్పఁగ, భరతుని లక్ష్మణుని వీర♦వర్యుల నునిచెన్
బరమాద్భుతరీతిఁ జనెఁ బడమరదిక్కున వెదకి నొక్క♦మూడ్కిఁ గడంకన్.
క. హిమవత్సంవృతమై పొల్చు మహోత్తరదిక్కును నాని♦చొప్పు వెదకి పా
పము నుంతయేని కానక, యమురేంద్రు సిదిశకుఁ బోయి ♦ యందెల్లెడలన్. ౧౧
చ. కనుఁగొని పావనాచరణ♦శాంతము నై ముకురంబురీతిఁ జ
క్కనిదయి యొప్పు నాదెసను ♦ గానక శూద్రమునిన్ యమాశనుం

గనుఁగొన నందుఁ బోయె రఘు♦కాంతుఁడు పుష్పకయుక్తి వింధ్యనా
మనియతభూధ్రపార్శ్వమున ♦ మానితమైన సరస్సు నొక్కెడన్. ౧౩ 2953

ఆ. కనియె దానిచెంత ♦ ఘనతరతప మూని, యున్నవాని మునిని♦నూర్ధ్వముఖుని
నందుఁ గాంచె సిరుల ♦ నలరారు శ్రీరాముఁ, డంత నతనిఁ జేర♦నరిగి యచట.

క. ఉత్తమతపోవ్రతాదరు, న త్తపసిని గాంచి యిట్టు ♦ లనియె; మహాత్మా!
యిత్తఱి ధన్యుఁడవే యివు, డుత్తర మీవలయు నేక♦లోద్భవుఁడ వొకో.

సీ. దృఢవిక్రమా! వ్రతా♦ధీనచిత్తా! నేను గౌతూహలంబున ♦ నీతఱి నినుఁ
బ్రశ్న చేసితి దశ♦రథభూమిపాలకు తనయుండ శ్రీరాముఁ ♦ డనెడువాఁడ
నే ప్రయోజనము నీ♦విపు డొందఁగోరితో స్వర్గలాభమొ వేఱు♦వాంఛితంబొ
దుష్కరంబని నాకుఁ ♦ దోఁచెడు నీతపం బేవరంబును బొంద ♦ నెంచి యిట్లు

తే. తపము సల్పుచునున్నావొ ♦ దాని వినఁగఁ
గోరి యడిగెద నెవ్వనిఁ ♦ గూర్చి యిట్టి
వ్రతముఁ బూనితొ తెల్పుమా ♦ బ్రాహ్మణుఁడవొ?
క్షత్రియుఁడవొ? తృతీయవం♦శభవుఁడవొకొ?. ౧౬ 2956

క. చరణభవుండవొ? సత్యా, దరమున వచియింపు శుభము ♦ దగు నీకు మహా
త్తర మౌను సూనృతము సుస్థిరతపమునకంటె నమృత♦సిద్ధిప్రదమౌ. ౧౭

చ. అని యిటు రాఘవుం డడుగ ♦ నామునివర్యుఁ డవాక్శిరుండు రా
మునకు స్వజాతియుం దపముఁ ♦ బూనఁగ నేటికొ యావిధంబుఁ జ
క్కనిగతి నిట్లు చెప్పెఁ, దన♦గాదిలిపూనిక వీడ కట్టులే
జనపతివర్య! యంచు మది ♦ నంతస మెంతయు నొప్పుచుండఁగన్. ౧౮ 2958

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౭౬ - వ సర్గము.

రాముఁడు శంబుకుని జంపి బ్రాహ్మణశిశువు బ్రదికించుట.

చ. ఒరులకు బాధ చేయని మ♦హోత్తమకర్మము లాచరించు భూ
వరుఁ డిటు ప్రశ్న చేయుటయు ♦ వంచినశీర్షము నట్లె యుంచి యా
చరణజమౌని యిట్టులనె; ♦ శంబుకనాముఁడ శూద్రజుండ నో
గురుతరకీర్తిరాజిత! ర♦ఘుప్రవరా! తనుయోగ మొప్పఁగన్. ౧ 2959

తే. కోరినాఁడ దేవత్వంబుఁ ♦ గొంకి మిథ్య, పల్కువాఁడను గాను దే♦వతలలోక
మేజయింపఁగఁ గోరితి♦నేను శూద్ర,వంశజుఁడ ఘోరతపము స♦ల్పంగ నిచట.

క. వరనియతి నున్నవాఁడను, దరుణం బింకయును రాదు ♦ దానికి నను నా
చరణజుని గాంచి ఖడ్గము, నిరుపమకాంత్యుజ్జ్వలంబు♦నృపతియుఁ గొనుచున్.

క. శిరమును ఖండించెను నా, శరుణంబున; నిట్లు శూద్రు తపసి తెగిన ని
ర్జరపతి సహస్రప్రముఖా, మరనన్యులు మేలు మేలు ♦ త్క్ష్మాపతివర్యా!. ౭౪

క. అని వినుతించిరి పలుమా, ఱనూనసుమవృష్టి గురిసె ♦ నతిపరిమళయు
క్తిని వాయుప్రోద్బలమునఁ, గనఁబడియెన్ నాల్గుదెసలఁ ♦ గడువడిఁ బడఁగన్.

చ. సుర లెన వార్ష మంది రణ♦శూరుని సత్యపరాక్రముణ్ క్షితీ
శ్వరపతి రామచంద్రుఁ గని ♦ సౌమ్య! యొనర్చితి దేవకార్య మి
త్తరుణమునందుఁ జక్కఁగ; ని♦తాంతముదంబున మే మొసంగు నీ
వరము వరింపుమా! గొనుము ♦ వాంఛను దెల్పుము తీర్తు మిత్తఱిన్. ౭౫

క. చరణజుని స్వర్గభాక్కుగఁ, బరికించియె కాకయుండఁ ♦ బార్థివవర! నీ
వరుదుగఁ జేసితి వను ని,ర్జరవాక్కుల నాలకించి ♦ రాముఁడు భక్తిన్. ౭

క. కరయుగము మోడ్చి శ్రద్ధా, పరములు చెలువార వృత్ర♦వనుజహరుఁ బురం
దరునిన్ సహస్రలోచనుఁ, బరికించి వచించె దేవ♦వర! నీవు సురల్. ౭ 2966

క. నాయెడఁ గరుణామతులే, నాయువనీనుఁ డనుమానుఁ ♦ డపగతజీవుం
డీయెడఁ బ్రాణయుతుండై, పాయక తండ్రికిని బ్రీతి♦పాత్రుం డగుతన్. ౭

క. వర మిది మదీప్సితము స,త్కరుణన్ కొనఁగఁ డిదియె ♦ గాదే నా కో
సురలార! మనవచారము, పరఁగుట నావిప్రసుతుఁడు ♦ బాలుం డయ్యెన్.

సీ. మరణించె నేరకు♦మారుఁ డావిప్రున కాతఁ డకాలాంత ♦ మందెఁ గాన
నాతనిఁ బ్రదికింపుఁ ♦ డదియెమీకుశుభంబువాక్కుసత్యంబయి♦భాసిలునటు
చేయుఁడీ నేఁ బురి ♦ క్షితిసురవరుతోడ బ్రదికించువాఁడ నీ ♦ పట్టినంటి
దానిని జెల్లింపుఁ ♦ డోనిర్జరేశ్వరులార! నా రసము రాము ♦ గారవమునఁ

తే. గాంచి వార్షంబు వృద్ధిని ♦ గాంచునట్లు
బదులు పల్కిరి దేవతా♦వరులు కూడి
వగవు మానుము కాకుత్థ్స! ♦ బాలుఁ డాతఁ
డీదినమె జీవములఁ బొందె ♦ నెలమి మిగుల. ౧౩౪ 2969

క. తనబంధువులం గూడియె, మన మలరం దిరుగువాఁడు ♦ త్క్ష్మాపాల! యిటం
దునిమితి వెప్పుడు శూద్రుని, గనియెం బ్రాణముల నచట ♦ క్షణమాత్రమునన్.

తే. శుభము నీ కగుఁ గార్యము ♦ సొరిది మేము
నీకు నమకూర్చుచుందుము ♦ భూకళత్ర!
నవ్యశోరాజితా! యుగ♦న్త్యమునిచెంత
కరుగవలయును బ్రహ్మర్షి ♦ యతఁడు నియతి. ౧౫ 2971

క. వ్రత మొనరింపం బూనెను, తుతి నొందక యద్ది ద్వాద♦శశరత్తులు సు

* తం జీవయత భద్రం వో నానృతం కర్తు మర్హథ-అనిమూ.

స్థితి సాగె నింతకాలం, బతఁ డొగి *జలశయ్యఁ నుండె ♦ నధికశ్రద్ధన్. ౧౭
క. కనుక నె యామహానీంద్రునిఁ, గనఁబోయెన మతని మోద♦కలితుం జేయన్
జననాథ! నీవు నమ్మునిఁ, గని మ్రొక్కుట మే లటన్న ♦ గారవ మలరన్ ౧౮
క. చనుదెంచెద నిప్పుడె యం,చని వారలతోడఁ బలికి ♦ హాటకమయమై
తనరారుపుష్పకం బె,క్కెను; దేవత లంత విమల♦కీర్తులు చెలఁగన్. ౧౯
తే. వ్యోమయానంబులను నెక్కి ♦ రాముఁ డవుడు
వెంట రాఁ బోయి, రాముని♦వీరునాశ్ర
మమున; కంతఁ దపోధనుం ♦ డమలకీర్తి
యాయగస్త్యుఁడు వారల ♦ యాగమనము. ౨౦ 2975
క. కని వారి యథావిధిఁ బూ,జనముల నలరించె దేవ♦సత్తము లాపూ
జను గొని యాతనిఁ దగున,ర్చనముల ముదమొందఁ జేసి ♦ చనిరి యథేచ్ఛన్.
క. సురవరు లీవిధిఁ దమయను,చరు లెల్లను వెంట రాఁగ ♦ స్వర్గమునకు స
త్వరగతిఁ బోయిరి; రఘుభూ,వరతిలకుఁడు పుష్పకంబు ♦ వసుధం దిగఁగన్.
ఆ. అవతరించి మునికి ♦ నాయగస్త్యునకు వం,దనము లాచరించి ♦ యనలతేజుఁ
డాతఁ డిచ్చునట్టి ♦ యాతిథ్యములఁ గొని, యధివసించె నందు ♦ నాదరమున.
క. అనుపమతపోధనుం డా,మునిపతి యత్యుగ్రతేజ♦మునఁ బొల్చుచు నా
జనపతి కిట్లను; స్వాగత, మనూనగుణసాంద్ర! హోమ♦హోత్రా! యిటకున్.
క. చనుదెంచితి నాభాగ్యం, బనఁదగు నిద్దాని సద్గు♦ణావళి నీయం
దు నెగడుఁ గావున బహుమతిఁ, గనుచుందును నిన్ను నేని♦కామం బాత్మన్.
ఆ. అతిథి పూజనీయుఁ ♦ డనుదిన మాత్మ యం,దలరుచుండు నతఁడె♦యమరులెల్లఁ
జరణభవుని జంపి ♦ సద్యశంబున వెల్గు, నీదురాక పలికి ♦ రాదరమున. ౨౬
క. ధరణీసురపుత్త్రుని మృతుఁ, బరిగతజీవితుని జేసి ♦ భాసిల్లితి వో
ధరణీశపుంగవా! రా,తిరి యిది యిటఁ బుచ్చఁదగును ♦ దృష్టి మెఱయఁగన్,
క. పురికిఁ బ్రభాతంబున నీ, వరుగంగా వచ్చు స్వేచ్ఛ ♦ నరిగెదుయానం
బరుదుగ నొప్పుట రామా!, పరమాత్ముఁడ వీవు లక్ష్మీ♦పతి వరయంగన్. ౨౮
క. నారాయణుఁడవు నీయం,దే రాజ్యం బెల్ల నుండు ♦ నెల్లర కీవే
యారయఁ బ్రభువవు ప్రాక్తన,పూరుషుఁడవు సౌమ్య!వినుము♦పూర్వమ్మొకటన్.
సీ. ఆభరణం బిది ♦ యావిశ్వకర్మచే నిర్మితంబయి కాంతి♦నిచయదివ్య
మయి దివ్యతనువుచే♦నరుదగు తనకాంతి వెలయుచుండును; గాన ♦విశ్వనాథ!
గ్రహియింపుమా నాకుఁ♦గల్పింపు ప్రియమును దత్తవస్తువు ప్రీతి♦తనర మరల
దానము చేసినఁ ♦ దత్ఫలమనుపమ మిద్దాని ధరియింప ♦ నీవె తగుదు

---

* జలశయ్యాం సమాసతః-అనిమూ.

తే. వధి సఫల మొందఁ జాలుదు; ♦ నసురనాథ
ముఖుల నరియింపఁ జాలుదు ♦ భూమిపాల!
గాన నీ కిచ్చువాఁడను ♦ దీనిఁ గొనుము
చిత్ర మాభరణ మ్మిది ♦ చెలఁగు వేడ్క. ౩౩ 2985

క. ఇవ్విలియించుసూర్యుఁడో? యన, వెలసెడు నమ్మిద్ది యనిన ♦ విని శ్రీరాముం
డలఘురథశ్రేష్ఠుఁడు రాజులధర్మము లోఁ దలంచి ♦ సొంపగుభణితిన్. ౩౪

క. దానము ప్రతిగ్రహంబును, భూసిద్ధసులకును దగును ♦ భూపతిని గదా?
నే నెట్లు సంగ్రహింతును, భూనిర్జరుసొమ్ము పాప♦ము గదా? కొనినన్. ౩౫

చ. అన విని యాయగస్త్యముని ♦ యానృపతి రామునిఁ గాంచి యిట్లనున్;
జననర! బ్రహ్మభూతమును ♦ నాఁడు శరంబగు నాకృతంబునన్
జనులకు రాజు లేఁడు సుర♦సంతతి కింద్రుఁడు లేఁడు గాన నా
జను లధిపాలునిం బడయు♦నాంతమునం బగు నిన్ను వేఁడినన్. ౩౬ 2988

చ. శతముఖు దేవకోటికిని ♦ నత్ప్రభువుం బ్రమిఁజేసి తీవు; మ
ర్త్యతతికిఁ బాలకుండుఁగ వి♦రాజిలువానిని జూపవే యటం
చతిశయభక్తి వేఁడ పర♦మాత్మ! నృపాలుని బూజ సేసి పా
పతతులఁ బాయువార మని ♦ వారలు గోరి వచించి రీగతిన్. ౩౭ 2989

చ. ధరణివిభుండు లేకయె ము♦దంబును గాంచఁగఁ జాల మేము భూ
వరుఁడె సుపూజ్యుఁ డెప్పుడు ధ♦రావరవచ స్తతు లాలకించి యా
దరమున నుత్తమార్థము ని♦దం దలపోసి శర్వదాజ్ఞచేత నా
సరసిజసూతి యింద్రముఖ♦సర్వదిగీశులఁ బిల్చి యిట్లనెన్. ౩౮ 2990

సీ. కరుణించి మీయందుఁ ♦ గల్గిన తేజంబు నందు భాగం బొసం♦గం దగు నన
వారు తేజమ్ముల ♦ భాగ మిచ్చిరి బ్రహ్మ తుష్టి నర్ధాసిన ♦ త్రోఁచె నొకఁడు
క్షువుఁడన; నతనికిఁ ♦ గూర్చె నింద్రాదుల యంశంబులను మను♦జాళి కిచ్చె
విభుగాఁగ, నంతట♦విబుధేంద్రభాగంబుతోడ భూమిం గూర్చెఁ♦దోయవిభుని

తే. భాగమును గూర్చి దేహంబు ♦ పరఁగినట్లు
చేసెఁ గౌబేరభాగంబు♦చే వసువును
బ్రజల కిచ్చెను యమునిదా ♦ భాగమునను
బ్రజల శాసించు నరపతి ♦ రమ్యరీతి. ౩౯ 2991

క. సురపతిభాగంబున నే, నరభూషణ మలఘుదానిఁ ♦ బరమాద్భుతి ని
ర్జరపతి యజ్ఞాంశమ్మును, బరిగ్రహముచేయురీతిఁ ♦ బార్థివముఖ్యా!. ౪౦ 2992

తే. కైకొనుము దీని నీకు మేల్ ♦ గలుగు నన్ను
నుద్ధరింపుము నా, ముని♦సూక్తులు విని
పరమధార్మిక మిది యని ♦ నిరుపమాన
మైన యాభరణము దాని ♦ మానవపతి. ౪౧ 2993

క. నిరుపమభూషణ మని తాఁ, బరిగ్రహించెను; నృపుండు ♦ వరభూషణ మా
దరమునఁ జేకొని తద్విధ, మరయంగాఁ గోరి యిట్టు ♦ లనియెన్ మునితోన్.

సీ. అద్భుతాకృతితోడ ♦ నలరారు నీయది యేరీతి వచ్చె మీ ♦ కెవ్వఁ డిచ్చెఁ
గౌతూహలంబయ్యె ♦ భూసురమౌనీంద్ర! యతులకీర్తి! మిమ్ము ♦ నడుగువాఁడ
నాశ్చర్యములకు నీ ♦ వన్ననో నిధి వౌదు వనుచుఁ గాకుత్స్థుఁడి♦ట్లడుగ మౌని
యిట్లని చెప్పె; రా♦జేంద్ర! యీవిషయంబు విను విన్నవించెద; ♦మునువు త్రేత

తే. యనఁబడు యుగంబు గడచెడు♦నదనునందు
నీవనంబున రమణీయ♦మై వఱలెడు
భాగమం దిందు దానవపూ♦ర్వముగఁ గంటి
నచ్చెరు వౌనంగ దానినే ♦ ననువదింతు. ౫౨ 2995

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౭౭ - వ సర్గము.

అగస్త్యుఁడు రామునకు శ్వేతరాజోపాఖ్యానముఁ జెప్పుట.

క. మును త్రేతాయుగమున నో, జనవర! వన మొండు బహువి♦శాలంబయి యో
జనశతపరిమితమై పక్షినికరమృగవర్జితమయి ♦ చెలఁగుచు నుండెన్. ౧ 2996

క. వన మది నిర్మానుషమై, కనఁబడ ముత్తమతపంబు ♦ గావింపఁగ నే
వన మద్దానిం జేరితి, ననఘా! *సాదనుచు మోద ♦ మలరారంగన్. ౨ 2997

క. ఫలమూలంబుల వృక్షం,బుల సుస్వాదంబులగుచుఁ ♦ బొలుచు మధువులన్
జెలఁగెడునవ్వనరూపముఁ, బలుకంగా రాకయుండెఁ ♦ బార్థివముఖ్యా!. 3

సీ. దానియంతరమందు ♦ మానితసర సొండు యోజనాయతమయి♦యొప్పియుండె
హంసకారండవా♦ద్యఖిలపక్షులు స్వేచ్ఛ విహరించుచుండెను ♦ విమలపద్మ
ములు నుత్పలంబులు ♦ చెలువారుచుండెను శైవలంబులు మహా♦శ్చర్యరీతిఁ
గనఁబడుచుండె సు♦ఖంబుగా నివసింపఁ దగియుండె విమలమై ♦ సొగసుమీఱ

తే. క్షోభ మింతయు లేక ప♦క్షులు వెలయఁగ
నలరుచుండెను; నద్దాని ♦ యంతికమున
నాశ్రమం బొండు చిత్రమై ♦ యతిపురాణ
మగుచుఁ బుణ్యతమంబయి ♦ యందమలర. ౪ 2999

చ. మునిజనహీనమై యదియుఁ ♦ బొల్పుగ నొప్పుచునుండె, రామ! యం
దును నివసించినాఁడఁ దమి♦తో నొకరాతిరి గ్రీష్మమందు, నం
త నినుఁడు తూర్పుకొండపయిఁ ♦ దా నుదయింపఁగఁ బూన లేచి చే
యను దగినట్టి కృత్యముల ♦ నాదృతి సల్పఁగఁ బూని శ్రద్ధతోన్. ౫ 3000

---

* అహ మాక్రమితుం సౌమ్య-అనియా.

క. సగమునకు నేఁ గందు; నజరమై వృద్ధంబు నగుచు ♦ శవ మొందు మహా
త్మునరీతిఁ గానఁబడియెన్; ధరణీశ్వర! యాశవంబు ♦ తనవసరమునన్. ౧

సీ. కం_క్షితేకమ్మున ♦ బలవంతమయి సరోవరము యాశ్రయముగఁ ♦ బరఁగుచుండెఁ
దనుకాంతి యెంతయుఁ ♦ గననగుచుండెను; జింతించితిని దీని♦సిద్ధి యెట్టు
లనుచు ముహూర్తంబు ♦ మనమున నారీతిఁ దలఁచుచు దానిన♦త్తటమునందు
నుంటి నీచిత్రమె♦ట్లో యని; యంతలో నద్భుతదర్శనం♦బై నిరుపమ

తే. మగుచు నత్యున్నతంబయి ♦ యంబరమునఁ
గానఁబడియె విమానంబు ♦ నమ్రహంస
సంయుతంబయి చిత్రక♦జవముగలిగి
యందు నతిమానసంతుఁడై ♦ యలరె నొకఁడు ౧౧ 3002

క. సురపురి వసింప నన్వర, పురుషుం డద్దాన సురల♦పూఁబోఁడులు సుం
దరగతులఁ దన్నుఁ గొల్వఁగ, వరభూషణరుచిరుఁ డగుచు ♦ భాసిల్లె నృపా!.

ఆ. తనువిలాసములను ♦ వగునం[illegible] కొంద, యమలగేయములను♦నద్భుతముగఁ
బాడి; రంతఁ గొంద ♦ నాసిరి వీణాది, వాద్యములను నేర్పు ♦ వఱలుచుండ.

క. కొందఱు వాయించిరి మఱి, కొందఱు సంతోషమునలరఁ ♦ గోయని ధ్వని యిం
పొందఁగఁ జేసిరి నృత్యము, కొందఱు స్వేచ్ఛగను జేయఁ ♦ గోరిరి రామా!.

క. తరుణులు కొందఱు సుందర, హిరణ్యదండములఁ గాంతి ♦ నెనఁగుచుఁజంద్రుం
బుగడించు చామరంబులఁ, గరములఁ గైకొనుచు విసరఁ♦గా మొదలిడఁగన్.

తే. పుండరీకేక్షణంబులఁ ♦ బోలువువారు
నతనిమోమున్ముట్టె వికసించె; ♦ నంత నతఁడు
సింహపీఠిక విడిచి య♦చ్చెరువు తోఁప
నావిమానంబు దిగి వచ్చి ♦ యాశవమును. ౧౫ 3007

క. తినియెను శ్రీరామా! నేఁ, గనుచుంటి ననంతరంబ ♦ కడఁగి యతఁడు క్రొ
వ్విననమాంస మెల్ల స్వేచ్ఛగఁ, దిని సరసుం జేరి యచటి ♦ దివ్యసలిలమున్.

తే. విధియుతంబుగ స్పృశియించి ♦ వేవిమాన
మెక్కఁ బోవుచునుండ నే ♦ నన్ని యతని
దేవసంకాశు స్వర్గిని ♦ భావ మలరఁ
గాంచి యిట్లంటి; శోభాఢ్య♦కాంత! రామ!. ౧౭ 3009

క. సురసంకాశా! యెవ్వఁడ, వరయఁగ నాహార మిద్ది ♦ యతిగర్హితమై
పరఁగెడుదానిం దింటివి, కరుణించి వచింపు దీని♦కారణ మెల్లన్. ౨౦ 3010

క. ఎవనికి నీయాహారము, చవిగా నుండంగఁ గలదు? ♦ [1]స్వర్గాలయతు

1 స్వర్గాలయతుల్యసాంగ=దేవతాసమానమై శ్రేష్ఠమగు దేహము కలవాఁడా అని యర్థము. దేవసమత-అనిమా.

ల్యవరాంగ! చిత్ర మయ్యెడి, జవమున వినిపింపు దీని♦సత్యం బెల్లన్. ౧౧ 3011

క. వినఁగోరెద నాహారం, బనఘా! యోగ్యంబు గాది ♦ దంచున్ దోఁచెన్
గనఁగ శవం బిది యెట్లీ, వనూనముదమారఁ గొంటి ♦ వరుదయ్యెఁ జుమీ.

చ. అన విని స్వర్గగామియగు ♦ నాతఁడు స్వాంతమునం గుతూహలం
బును గని సత్యవాక్యములఁ ♦ బొందుగఁ దద్విధ మెల్లఁ జెప్పె; నో
జనవర! యావిధంబు వినఁ ♦ జాలఁగ నచ్చెరువై కనంబడున్
విను వచియింతు నాతని సు♦వృత్తము సర్వము విన్నరీతిగన్. ౧౩ 3013

డెబ్బదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౮ సర్గము.

-ఁఃఃఁ- అగస్త్యుఁడు రామునకు నాభరణము దొరకినవిధముఁ దెలుపుట. -ఁఃఃఁ-

చ. అనుటయు నాదువాక్కు విని ♦ యాదివిజాలయగామి ప్రీతి న
న్గని శుభవాక్కు లివ్వి యని ♦ కైయుగమున్ ముకుళించి రామ! యి
ట్లనియెను; బ్రాహ్మణోత్తమ! *సు♦ఖాసుఖవృత్తము నాది దాఁటఁగా
ననువుపడంగ రాని దిది♦యా వచియించెద నాలకింపుమా. ౨ 3014

క. అడిగితివిగావఁ దప్పక, నుడివెద; వైదర్భనాను♦నుతభూవిభుఁ డొ
క్కఁడు కీర్తిశాలి గలఁ డా,తఁడె నాజనకుండు మున్ను ♦ తనరు విభూతిన్.

తే. అతని పేరు సుదేవుఁడా♦యనఘుఁ డేజ,గత్త్రయంబున వీరైక♦ఘనుఁడు; భార్య
లిరువురాతని కొప్పుదు♦రెలమి నొక్క,పత్నికొకఁడుగ నాత్మజ♦ద్వయముగలిగె.

క. వారలలో జ్యేష్ఠుఁడ నో,ధారణిసుర! శ్వేతుఁడనఁగఁ ♦ దగుదు సురథుఁడున్
భూరిపరాక్రముఁ డనుజుఁడు, సారయశోరాజితుండు ♦ శాంతియుతుండున్. ౪

క. జనకుఁడు సురపురి కేగఁగ, జను లెల్లరు నన్ను నృపుని ♦ నరగునఁ జేయన్
మనిచితి ధర్మపథంబున, జనులను శ్రద్ధాదరముల ♦ క్షమ చెలువారన్. ౫

చ. మనుజులు ధర్మమార్గ మణు♦మాత్రము తప్పక యుండఁ బ్రోచుచుం
డ నొకసహస్రవర్షములు ♦ నాపరిపాలనమందుఁ జెల్లెఁ బా
వననియమా! ద్విజప్రవర! ♦ వారక యట్లిల నేలు నేను నొ
య్యన నొకహేతువుం దలఁచి ♦ యాయువు గన్గొని మృత్యు వెన్నుచున్. ౬

ఆ. చాలు నింక రాజ్య♦లీల లంచుఁ దలంచి, యావనంబుఁ జేరి ♦ మృగపతత్రి
వర్జితముగఁ జొరఁగఁ ♦ బడనిదిగను గను,పట్టఁ గాంచినాఁడ ♦ బ్రహ్మమాని!.

క. నర సిది శుభతమమై నా, కరుదుగఁ గనుపట్టఁ దపము ♦ నతినియమమునన్
జరపం జొచ్చితి రాజ్యము, పరిపాలింపంగ సురథు ♦ భ్రాతను నృపుఁగన్. ౮

---

* మ మైతత్సుఖదుఃఖయోః, దురతిక్రమణీయం హి-అనిమా.

క. ఒనరిచి యభిషిక్తుని భూ,జనులకు నర్పించి యిందు ♦ సగనతటమునఁ గ్రా
మనమున నియతిం దపః దప,మును జేసితిఁ జాలకాల♦ము మునీషివరా!, ౯

సీ. మూఁడువేలేండ్లిట ♦ మునివర్య! తపము నీగుణుతరవనమునఁ ♦ గోర్కెమీఱ
నన్యదుష్కరముగ ♦ నాచరించితి; నంత ననుపమవిధి లోక♦మునకుఁ జనితి;
స్వర్గభూతుండనై ♦ సాధుతపశ్శక్తి నలరిన క్షుత్పిపా♦సలు సతంబు
బాధింపఁగాఁ జొచ్చెఁ ♦ బరమమునీ! దాన వ్యథితేంద్రియుండనై ♦ యాజగత్త్ర
తే. యాధిపుని బ్రహ్మఁ గాంచి యి♦ట్లంటి దేవ!,క్షుత్పిపాసావివర్జిత♦క్షోణి యిద్ది
బ్రహ్మలోకంబునాఁ బడుఁ ♦ బ్రాగ్జనిష్కృత,కర్మ మెట్టిదో నాకిందుఁ♦గలిగెక్షుత్తు.
క. అనవరతంబు పిపాసయు, జనియించెను గాన నాకుఁ ♦ జక్కనిభోజ్యం
బును జెప్పుమా పితామహా!, యన బ్రహ్మ పచించె నిట్లు ♦ లారసి నాతోన్.
తే. స్వాదుమై తగు నీదు మాంస♦మును నీవె
యనుదినంబును భక్షింపు ♦ మనఘనాథ!
యదియె యాహారమగు నీకు ♦ నాత్మతనువుఁ
జక్కఁ బోషించుచుం డవం ♦ బక్కజముగ. ౧౮౪ 3025

క. ఒనరించితి కాదే యో,జననర! నాట నిది బీజ♦సత్త్వము మయ్యెన్
గనునే యంకురతను గా,వున దానిని తినుము మున్ను ♦ పొందవు తృప్తిన్.
క. వన మది నత్త్వనిషేవిత, మనుపమఫలమూలనికర♦ముగు నందు వసిం
చిన నీవును భిక్షార్థిగఁ, జనుదెంచిన యతికిఁ జిత్త♦సస్మర మలరన్.౧౬ 3027

ఆ. భిక్ష మిడక యుంటి ♦ నక్ష యనుగునగి, యనితలంపవై తి ♦ వతులతపము
నల్పినాఁడ వట్టి ♦ చందమ్ముగావున, స్వర్గవాసమైన ♦ సంతతంబు. ౧౭౪ 3028
క. నిను క్షుత్పిపాస లేఁచెడుఁ, గనుకని పోషించినట్టి ♦ కాయంబును జ
క్కనిరుచిగల్గినదానిని, గొను మాహారముగ సుధను ♦ క్రోలినరీతిన్. ౧౮౪
తే. తృప్తిఁ బొందుచు నుండుము♦దివ్యతేజ, ఘానగస్త్యమహాముని♦యరిజనులకు
దుష్ప్రధర్షుఁడు వచ్చు వి♦భూతికష్ట,జాలుఁడవగుదు వీవు త♦త్సమయమందె.
క. ముని యతఁడు దేవసముదయ,మును దరియింపంగఁ జేయఁ ♦ బోలు సుశక్తిం
దనరారుక్షుత్పిపాసల,వనటం బడు నిన్నుఁ గూర్చి ♦ పలుకన్ వలెనే. ౨౧

క. గురుబాహూ! నిక్కంతఁడు, తరియింపం జేయఁ జాలు ♦ ధన్యుఁడనియె; నా
సురతల్లజువాక్కుల విని, పరమవిగర్హితము నాదు ♦ నపువుం దినుచున్. ౨౧౪
క. అనుదిన మీరీతిని నే, వనికిన్ వచ్చుచును మగల ♦ స్వర్గంబునకున్
జనుచున్నవాఁడ వర్షము, లనేకములు చెల్లె నిట్లు ♦ లంగము దినఁగన్. ౨౨౪
చ. తను విది క్షీణ మొందదు ము♦దంబునుఁ బొందదు చిత్త మోమహా
మునివర! యిట్టికష్టములఁ♦బొందెదు నన్గరుణించి కష్టరా

శిని బొలఁగించి కావు మిటఁ ♦ జేర నగస్త్యుఁ డొకండు శక్తుఁ డ
న్యునకు నగమ్య మిందుమ్యది ద్విజోత్తమ! నన్నుఁ దరింపఁజేయుఁగదే. ౩౪ 3034

[1]క. కొను మీయాభరణంబును, మునివర! కరుణింపు స్వర్ణ♦మును ద్రవ్యము వ
స్త్రనిచయము భక్ష్యభోజ్యము,లను నీయది యాభరణము♦లను దగ నిచ్చున్.

తే. బ్రహ్మమానీంద్ర! కోరిన♦వాంఛితముల,నొసఁగువాఁడనుభోగాళి♦నొసఁగువాఁడ
నుద్ధరింపుము కరుణింపు♦మోమహాత్మ!, యనిన నాస్వర్గివగుపల్కు♦లాలకించి.

క. తరియింపఁజేయఁగా నా,భరణం బిద్దాని మిగుల♦భాసురము మహా
దరమున గ్రహియించితి నేఁ, బరిగ్రహింపఁగనె యతని♦ప్రాక్తనువచనట్లే. ౩౭

క. వెన నశియించెను రాజ,ర్షి సత్తముం డట్లు తనువు ♦ చెచ్చెఱ నశియిం
ప సురపదంబునకుం జని,యె సంతసం బొప్పుచుండఁ ♦ దృప్తుం డగుచున్. ౩౮

క. ఆతనికొఱకై దీనిని, భూతలనాథా! గ్రహించి ♦ పొలుపుగ దానిన్
జేతం బొప్పక యుండిన, నీతరుణము దాఁక నేను ♦ నిందుంచితిఁ జూ!. ౩౯

ఆ. దాని నీకు నొసఁగఁ ♦ దగునని యెంచితి
నిదియుఁ జూడఁ జిత్ర ♦ మొదవు రామ!
యతఁడు భూతపాపుఁ♦డై సుఖంబుగఁ దన
పదముఁ జేరఁబోయెఁ ♦ బార్థివేంద్ర!. ౪౦ 3040

డెబ్బదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౭౯ - వ సర్గము.

-దండమనివృత్తాంతము రామునకు నగస్త్యమహాముని చెప్పుట.-

క. ఆయద్భుతతమవాక్యము, నాయవనీసురమునీంద్రుఁ ♦ డట్లు వలుకఁగా
నాయవనీశుఁడు విస్మయ, మాయెడఁ దోఁపంగ మరల ♦ నమ్మునిపతితోన్. ౧

క. గౌరవ మలరఁగ నిట్లను, [2]ఘోరంబగు తద్వనమున ♦ క్షోణీశుఁడు దు
ర్వారతపం బొనరుపఁగా, నేరీతి మృగద్విజాళి ♦ యొసఁగక యుండెన్?. ౨

క. మనుజవిహీనంబయి త,ద్వన మలరక యుండఁ దపము ♦ వైదర్భుఁడు చే
యను బోయె నెట్టు? లయ్యది, వినవలతుం దత్త్వ మెల్ల ♦ వివరింపు మునీ!. ౩

సీ. అనుచుఁ గౌతూహల ♦ మలరంగ రాముండు,ప్రశ్న చేసినముని♦ప్రవరుఁ డగుచు
బరమ తేజస్వి యీ♦భంగిని వచియించె; మును కృతయుగమున ♦ మనుజనాథ!
దండధరుండు శా♦స్తయు మనుసంజ్ఞుండు నయి యుండె నాతని ♦ కాత్మజన్ముఁ
డిక్ష్వాకువన నొప్పె ♦ హితమతి కులవర్ధనుఁడు కీర్తిశాలి యా♦తఁడు మహాత్మ!

---

1 ఇదం తావ త్సువర్ణంచ ధనం వస్త్రాణి చ ద్విజ, భక్ష్యం భోజ్యంచ బ్రహ్మ న్దేదదా త్వాభరణానిచ-అనిమూ. 2 భగవం స్తద్వనం ఘోరం తప స్తప్యతి యత్ర సః-అనిమూ.

తే. యతని జ్యేష్ఠుని దుర్జయు ♦ నధిపుఁ జేసి
రాజ్య మేలుము ధరఁ గల ♦ రాజవంశ
ములకుఁ గర్తవు నీవు కా♦వలయు ననుచు
ననిన నట్టులె చేసెన ♦ ననుచు నతఁడు. ౮ 3044

క. ప్రతిన యొనర్చెను రామా!, పిత దానికి మోద మంది ♦ పెంపు మిగుల నీ
గతిఁ బల్కె మరలఁ దనయా!, యతిశయమోదంబుఁ గంటి♦నట్టిఁడవగుమా.

ఆ. సంశయంబు లేదు ♦ సకలవంశములకుఁ, గర్తవగుదు దండ♦కలనఁ బ్రజలఁ
గావు హేతు వుండె♦కయ దండ మిడకుము, తప్పు చేయు మనుజ♦తతులయందు.

క. మనుజేంద్రుఁ డేవఁడు దండన,మును జక్కఁగ నునుచు స్వర్గ♦మును బొందు నతం
డని పెద్దలు చెప్పిరి; కా,వునఁ బుత్రక! యత్నవకుఁడ♦వుగ నుండఁదగున్. ౯

క. పరమము ధర్మంబు గదా, ధరణిం జెలువారు దానిఁ ♦ దలఁపుము మది నం
చు రుచిమతి మను వాత్మజునకుఁ, బరుసగతిం జెప్పి హర్ష♦పరిపూర్ణుండై. ౧౦

తే. శాశ్వతంబగు నాపద్మ♦సంభవు పద
మొందెఁ; ద్రిదివంబు మను విట్టు ♦ లొంద నంత
నాత్మజుండగు నిక్ష్వాకు ♦ వమితతేజ
ములరఁ దనయులఁ గాంచు టె♦ట్లనుచు మదిని. ౧౧ 3049

క. ఆలోచించెను; బిదపన్, జాలుగ బహుకర్మతతులఁ ♦ జక్కని శ్రద్ధా
లోలుండై యొనరిచి సుర,బాలసతుల్యులను బుత్ర♦వరులం గనియెన్. ౧౨

తే. ధర్మమతియైన యిక్ష్వాకు♦ధరణివిభుఁడు
తనయులం గాంచె వారిలో ♦ మనుజనాథ!
కట్టకడపటితనయుండు ♦ వెడువిమూఢుఁ
డకృతవిద్యాపరిశ్రముం ♦ డౌట నతము. ౧౩ 3051

క. తనయగ్రజులం గొల్చుచుఁ, జనివొందుచు నుండె వాని♦తండ్రియె దండుం
డని పేరు పెట్టె నతనికి, మనమునఁ దలపోసి యల్ప♦మతియను నూహన్.

తే. తప్పు కితనికి దండప♦తనము దేహ,మందుఁ గలుగంగఁ గలదని ♦ యట్టిపేరు
పెట్టి యతిఘోర దేశం బ♦దట్టి దిశని,కుండఁ జాలినదని యాత్మ ♦ నూహ చేసి.

*క. కనఁజాలక రిపుకాలుఁడు, జనపతి యాతండు వింధ్య♦శైవలమధ్యా
వని గాంచి యందు నాతని, నునిచెం దదాధిపత్యమందు ♦ నొడయం డనుచున్.

సీ. పర్వతరమ్యత♦ద్భాగంబునన్ దండు నరపతిగాఁ జేసి ♦ పుర మనుత్త
మమును నిర్మించె; నా♦త్మోపతి తన్నామమును మధుమంతమై ♦ భూరికీర్తి
నందు, నియ్యదియంచు♦ననువదించెను; దరువాత దండుఁడు భృగు♦ప్రవరుఁడైన
శుక్రు నాచార్యుఁగా ♦ నువ్రతు వరియించె, నిట్టు లావండుఁ డ♦హీనతేజుఁ

* వింధ్యశైవలయో ర్మధ్యే రాజ్యం ప్రాదా దరిందమ- అనియు.




తే. డైన శుక్రుని గూడి రా♦జ్యంబు చేసె
హృష్టమనుజవికీర్ణమై ♦ యింద్రురాజ్య
మట్లు చెలువారె; దండుఁ డ♦య్యవని నింద్రు
కరణిగాఁ బాలనము చేసె ♦ ఘనయశమున. ౧౯ 3055

క. మనుతనయుండౌ దండుం, డనూనశక్తిం జెలంగు ♦ నయ్యుశనసుతో
డను గమ్రరీతి రాజ్యం,బు నేలె ధర్మైకమార్గ♦మునఁ బ్రజలొప్పన్. ౧౯౹

తే. రాజ్య మయ్యది విస్తృతిఁ ♦ బూజ్య మగుచు
నలర గురునాశయమురీతి ♦ నసురవిభుఁడు
స్వర్గ మేలినయట్లు రా♦జ్యంబు దానిఁ
బాలనము చేసె ధర్మత♦త్పరుఁడు నగుచు. ౨౦ 3057

ఎబ్బదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౮౦ - వ సర్గము.

-ఃఃః దండుఁ డరజను బలాత్కరించుట. ఃఃః-

చ. అని వచియించి కుంభభవుఁ ♦ డారఘురామునిఁ గాంచి వెండి యి
ట్లనియెఁ; గథాప్రపంచ మొకఁ ♦ డాదృతి నే వినిపింతు భూధవా!
వినఁదగు; దండుఁ డాతఁ డట ♦ నీ[illegible]ధివిహీనరీతి నె
మ్మనమున శాంత మూని బహు♦[illegible]హీనము మీఱఁగఁ బెక్కువర్షముల్. ౧౹

క. ధరణిం బాలించెను; నొక, తఱి[illegible]గాబున నతఁడు శుక్రు♦ధామమ్ము మనో
హరమును బొందెను జైత్రం, బరుదేరఁగ మనమునందు ♦ హర్షము పొదలన్.

చ. కనుఁగొనె దండుఁ డందు ముని♦కన్య ననుత్తమరూపఁ గాననం
బున విహరించుదానిఁ గనఁ ♦ బొంకముగా నలరారుదాని; నం
త నతఁడు మన్మథాంబకని♦తాంతతరార్దితుఁడై కుబుద్ధియై
తనదగుధైర్య మెల్లఁ జెడ ♦ దగ్గఱ కేగి వచించె నీగతిన్. ౩ 3060

క. ఎందుండి వచ్చితివి నీ,విందుల కోసైకతాభ♦హితసుశ్రోణీ!
పొందుగఁ జెప్పు మదెవ్వరి,కిం దనయవు మన్మథాస్త్ర♦కృతతాఁవుడనై. ౩౹

క. నినుఁ బ్రశ్నించితిఁ దరుణీ!, యని పల్కెడు మోహమత్తు ♦ నాతని మదనా
స్తుని గాంచి భార్గవునిస,త్తనయయు ననునయము దోఁపఁ ♦ దా నిట్లనియెన్.

సీ. భార్గవుతనయను ♦ వరముని యాతండు పరులకు నెవ్విధి ♦ బాధకల్గ
కుండు కర్మంబుల ♦ నొగిఁ జేయువాఁడు నూ! యరజ నా పేరు జ్యే♦ష్ఠాత్మజాత
నగుదు నే నతనికి ♦ నాశ్రమ మందిందు వసియించుదానను ♦ వసుమతీశ!
బలవంతముగ నన్నుఁ ♦ బట్టఁ జూడకు, పితృవశనౌటఁ దండ్రియే ♦ పరఁగునీకు

ఆ. గురువుగాఁగ, నీవు ♦ క్షోణీసురర్షికి, శిష్యుఁడవు గదా? వి♦శిష్టచరితుఁ

డతఁడు క్రుద్ధుఁడైన ♦ వ్యసనం బసంతంబు, గల్గఁ జేయుశక్తిఁ ♦ గలఁడుసుమ్ము.

క. కుసుతరతపఃప్రభావ, స్ఫురణంబున వెలయు నతఁడు ♦ సుమ్ము; వసుమతీ
శ్వర! నన్నుఁ బొందఁ గోరికి, పరఁగునయే నీదు మదిని ♦ భార్గవు నసమున్.

క. నాతండ్రి మహాద్యుతి సం, ప్రీతుని నొనరించి నీవు ♦ వేఁడుము మార్గం
బీతఱి నింకొక్కటి కల, దే? తెలియఁగ ధర్మవిహిత ♦ మెద్దియు రాజా!. ౧౦

తే. అట్లుగాక యధర్మంబు ♦ నాశ్రయించి
నట్టులైన ఘోరాంఘు మొ♦య్యునఁ బొసంగు;
భార్గవుం డాగ్రహించిన ♦ భస్మములగు
లోకములు మూఁడు వేఱుస♦లుకు లిఁకేల?. ౧౧ 3066

క. జనకుని నీవె యాచిం, చిన నిమ్మఁగలఁడు మహాత్మా! నీకుఁ ♦ జెప్పెద నన్ని
చ్చు నటంచుఁ బల్కు నరజను, జనపతికామాస్త్రములకు ♦ స్వాంతముతూలన్.

క. శిరమును వగుఁగఁ గ సంజలి, పఱఁగించి ముఖంబు తను న♦వశ్యము దుష్కృ
త్యరతికిఁ జొప్పఁగొఁ బలికెను, దగుణీ! దయ చూపి నన్నుఁ ♦ దగఁగావంగన్.

క. కాలక్షేపము చేయకు, మోఁవలనా! నీసిసుత్త ♦ మొగి నసుతతి నీ
వేళ నశియించుఁ గావునఁ, బాలం గృపయుంచి ప్రోవు ♦ చంద్రనిభాస్యా!. ౧౪

క. నినుఁ గూడిసంత స్మృతి యు, బ్బిన సబ్బం గాక యొక్క♦వేళ దురంతం
బనఁదగు శాపము గల్గిన, వనితా! నాకగును గాక ♦ నైశమ నన్నున్. ౧౫

క. తగుణీ! పొందుము నిను నస, వరతవశు సేవించువానిఁ ♦ బ్రద్యుమ్నాస్త్రో
త్కరవివశ్వలు న న్నని యా, తునసడి నగూనె న్నిమిన్న ♦ దోశపటుత తగన్.

క. వల దిది తగదని చెప్పిన, బలియుతుఁ డోటన్ మహీశు♦పట్టి యతఁడు నా
లలనం బట్టి రతిక్రీడలఁ దేలం దొడఁగ న్యగుఁ డ♦డంపఁగఁ బెలుచన్. ౧౭

క. ఈరీతి నట్లు దండుఁడు, ఘోరాపత్యంబు చేయుఁ♦గూడని రీతిన్
గోరి యొనరించి చయ్యనఁ, జేరెన్ మధుమంతపురముఁ ♦ జెలఁగెడు వేడ్కన్.

క. అరజాలలనయు నాశ్రమ, పరిసరమున నేడ్చుచుండె; ♦ బ్రాహ్మణవరుఁడై
పరమతపస్వియునయి నిర్జరతుల్యుఁడునైన తండ్రి♦జాడం గనఁగన్. ౧౯ 3074

ఎనుబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౮౧-వ సర్గము.

—శుక్రుఁడు దండునకు శాప మొసంగుట.—

చ. సురముని తీవ్రతేజుఁడగు ♦ శుక్రుఁడు కూఁతుచరిత్ర మెల్ల నా
తురపడి శిష్యుఁ డొక్కరుఁడు ♦ తోడ్కొని తెల్పఁగ వానితోడ న
త్వరముగ నాశ్రమంబునకు ♦ వచ్చి తుధార్తిని జాలఁ దూలుచున్
ధరణిరజంబు దేహమునఁ ♦ దద్దయుఁ గప్పడు పుత్రికామణిన్. ౧ 3075

క. అరజను దీనను గాంచెను;, నరుణరుచుల్ తన్నుఁ గ్రమ్మ ♦ నలరక తేజో
విరతిం బ్రత్యూషంబున, నుసుతరముగఁ గాంచుచున్న ♦ జ్యోత్స్నవిధమునన్.

క. తనతనయ బెండుపడి యే,మనఁ జాలక యుండఁ గాంచె ♦ నాతండు క్షుధా
ర్తిని బొందియుంటచే మిం,చెను రోషము ద్విగుణముగుచుఁ♦జిత్రగతులచేన్.

సీ. మూఁడులోకంబులఁ ♦ గూడ నొక్కుత్తున దహియించునట్టిచం♦దమున నద్ది
యడరఁగా శిష్యుల ♦ కనియె నీరీతిగా; నవిజితాత్ముండయి ♦ యవనిపతిత
నంది గర్వించుచు ♦ నతిశయాధర్మంబు గావించె, దండుఁ డి♦క్ష్వాకునసమున;
నయ్యది ఘోరమై ♦ యాగ్రహించిన యగ్ని శిఖవోలెఁ జూడంగఁ♦జెప్పఁ దగని

తే. యట్టి యాపత్స్వరూపమై ♦ యమరె; దుష్ట
బుద్ధియగు నీతనికి మృత్యు♦వు పరిసరము
నకు వెసం జేరెఁ, గాన నీ♦నరపతి కడు
మందునగ్నిశిఖం దాఁక ♦ మదిఁ దలంచె. ౬ 3078

చ. కన విన రాని పాపమును ♦ గాదన కీతఁ డొనర్చె నిట్టిరీ
తిని జెడుబుద్ధి యందులకుఁ ♦ దృప్తిగఁ బొందఁదగున్ ఫలంబు పా
పనిచయకర్మముల్ ఫలము ♦ బాగుగ నీయక పోవునే ధరన్;
గనుకనె యేడురాత్రముల♦కాలమునందు సభృత్యబంధుఁడై. ౭॥ 3079

క. తనపాపకర్మముల నాత్మను దలఁచుచు నంతమొందు ♦ దండుఁడు శతయో
జనపరిమితతద్దేశం,బును, శుక్రుఁడు చేయుఁ గాక ♦ బూదిగఁ బెలుచన్. ౮

ఆ. సర్వసత్వములును ♦ స్థావరంబులు జంగం,బులును పాంసువర్ష♦మున నశించుఁ
గాక దండువిషయ ♦ మేకడ నెందాఁక, నమరు నంతదాఁక ♦ నస్మదాజ్ఞ. ౯॥

తే. పాంసువర్షపరీతమై ♦ పరఁగుచుండఁ
గలదు సప్తదినంబుల ♦ కాల మింక;
ననుచుఁ గ్రోధాగ్నితప్తుఁడై ♦ యాస్థలమున
నున్న జనములఁ గాంచి యి♦ట్లొప్పఁ బలికె. ౧౦॥ 3082

క. స్థల మిది వాసార్హము కా, దలఘుజవం బొప్పఁగా స్థ♦లాంతరమునకున్
వెలుఁడు చింతిల్లక యని, పలికెను శుక్రోక్తుల విని ♦ బ్రాహ్మణు లెల్లన్. ౧౧

క. ఆయాశ్రమంబు వదలి త,దీయాటవి కంతికమున ♦ దివ్యస్థలమున్
రోయుచు సుస్థలమును గని, యాఁచువసిం గట్టుకొనిరి ♦ యాశ్రమసంక్తుల్.

చ. మునిపతి యెల్లమానులకు ♦ ముక్తిని నచ్చట నిచ్చి యొందు తా
వున నరు లెల్ల నుండుటయుఁ ♦ బొందుగఁ గూఁతును గాంచి యిట్లనెన్;
వనితరో! యీపదంబునసె ♦ వాన మొనర్పు సమాహితాత్మవై
వన మిది యోజనంబు లోక ♦ వందకు నూటిగనా సరస్సుగన్. ౧౩॥ 3085

## ౮౨ - సర్గము.

—రాముఁడు మరల నయోధ్యకు వచ్చుట.—

చ. అన విని మౌనివాక్యముల ♦ హర్షము నొంది రఘూద్వహుండు సం
ధ్యను గొలువంగ, నచ్చర ల♦హర్నిశముం గొలువంగఁ బుణ్యమై
తనరుసరోవరంబునకుఁ ♦ దానవు డేగి జపం బొనర్చె; నె
ట్లన జలముల్ స్పృశించి యప♦రాద్రికిఁ బోయెడుసూర్యు భక్తిచేన్. ౧౪

తే. గొలిచి పశ్చిమసంధ్యను ♦ గోర్కి దనరఁ
దా నుపాసించి మహితాత్ముఁ♦డైన కుంభ
భవుని యాశ్రమమును జేర♦వచ్చె; నంత
నమ్మునీంద్రుఁడు కందమూ♦లాదు లవుడు. ౨ 3099

క. పలువిధములైన లతలను, సులలితశాల్యన్నములను ♦ శుభగుణునకు భూ
పలలామునకున్ భుక్తికి, నలఘుతరప్రీతిఁ గూర్చె ♦ నంత నతండున్. ౩ 3100

క. అమృతోపమమగు నాయ,న్నముఁ జక్కఁగ ననుభవించి ♦ నరపతిసంతో
షముఁ దృప్తినొందియారే,యి మునీంద్రునిచెంతఁగడపె ♦ నెలమి మిగులఁగన్.

సీ. అరినిషూదనుఁడైన ♦ యారాఘవుఁడు తెల్లవాఱఁగా లేచి స♦ద్భక్తిఁ గాల్య
కృత్యంబులం దీర్చి ♦ హితమతి నాహ్నికకృత్యంబు జరపి ము♦నీంద్రుతోడ
గమనంబునకు నాజ్ఞఁ ♦ గరుణింపుఁడని వేఁడ నూహించి వందన♦మ్మొగి నొనర్చి
కుంభసంభవ! ముని♦క్షోణీశ! పురి కేగ నానతి వేఁడెద ♦ ననుమతింపుఁ

తే. డేను ధన్యుఁడ మీకృప♦నిందుఁ గంటి
గానఁ గృతకృత్యుఁడను మహా♦మౌని చరణ
దర్శనము చేయఁ గంటి నా♦త్మను బవిత్ర
ముగ నొనర్చుకొనన్ వత్తుఁ ♦ దగినయపుడు. ౫ 3102

చ. అని యిటు లాకకుత్స్థకులుఁ ♦ డాదృతిఁ బల్క మహాద్భుతంబుగాఁ
గనఁబడువాక్య మద్ది విని ♦ కస్రుమతిం బరితుష్టుఁ డౌచు నా
మునిపతి యాతపోధనుఁడు ♦ మోమున సుస్మిత మాడ నిట్లనున్
జనవర! యద్భుతం బగుచుఁ ♦ జాల ముదం బిడు నీసువాక్కులన్. ౬ 3103

క. వినినాఁడ ముదముఁ గంటిని, మనుకులవారిధిశశాంక! ♦ క్ష్మాపతివర! భూ
తనిచయముల నీవే పా,వనమూర్తివి క్షణము నిన్న ♦ వరుసం బ్రీతిన్. ౭

క. కనఁజాలుదురో వారలె, యనఘులు పావనమనస్కు ♦ లగుదురు స్వర్గం
బున కేగఁ జాలుదురు పూ,జను బొందం దగినవారు ♦ సత్యము సుమ్మీ!. ౧౦

క. ఘోరంబగుదృష్టిని ని,న్నేరైనం జూతురేని ♦ యేవున యముఁ డ
వ్వారిన్ దండించి మహా,రౌరవమునఁ ద్రోయుఁ జుమ్ము ♦ రాఘవరామా!.

క. పరిశుద్ధుండవు శ్రీరఘు,వర! భూతగణంబులందుఁ ♦ బరికింపఁగ నీ

ధర నిన్నుఁ దలఁచినంతనె, పరమం బగుసిద్ధి నొందు ♦ భవములయందున్.

క. చనవయ్య! క్రొన్న దోషం,బును బొందక భీతిలేక ♦ పూజ్యతరంబై
కనఁబడు నవ్వగ్రజునకై, జనులను బాలింపవయ్య! ♦ చక్కనిరీతిన్. ౧౭

క. గతి నీవె యెల్లవారికి, నతిమానుషుఁడవు మహాత్మ! ♦ యన విని వినయో
న్నతి దోసి లొగ్గి వలగొని, క్షితిసురముని నయ్యగస్త్యు ♦ సేవించి తమిన్. ౧౮

తే. ప్రాజ్ఞుఁడౌ రాఘవుఁడు మౌని♦పతిని భక్తిఁ
గొలిచి పుణ్యాత్మువలన ని♦మ్ముల మహాశి
షములఁ గైకొని యందున్న ♦ సాధువరులఁ
గొలిచి యవ్వగ్రజుఁడై ముదం ♦ బలరుచుండ. ౧౯ 3110

క. కనకాలంకృతపుష్పక,ము నెక్కి నమ్మొగుచున్న ♦ భూపతివరు రా
ముని నాశీర్వచనంబులఁ, దనిపిరి మును లెల్ల రట ని♦తాంతప్రీతిన్. ౧౬

సీ. అమరులు దేవేంద్రు ♦ నర్చించువిధమున నంబరతలమున ♦ నమలపుష్ప
కమునందు నున్న భూ♦కాంతుని గాంచిరి మును లెల్లఁ; గనకవి♦భూషితమగు
పుష్పకవరమందుఁ ♦ బొలుచు నా రాముండు జలధరాగమమున♦సలిలదముల
చెంతనున్నట్టి శ♦శివిధంబునం బొల్చె నర్ధదినంబున ♦ నానృపుండు

తే. పురమునకుఁ బోయి తనసౌధ♦వరమునందు
మధ్యకక్ష్యను దిగియె నా♦మాడ్కిఁ బుష్ప
కంబు దిగి కామగంబయి ♦ కాంక్షితరము
నైన దానిని బొమ్మని ♦ యాజ్ఞ చేసి. ౧౯ 3112

క. చను నీకు శుభంబగు నం,చన నయ్యది స్వేచ్ఛ నరుగ ♦ నచ్చట ద్వారం
బునను న్న భటునితో ని,ట్లను లక్ష్మణు భరతుఁ బిలువ ♦ మతివిక్రములన్. ౨౦

క. నారాకఁ దెలుపు, నారలు, భూరిపయుం బొప్ప రాఁగఁ ♦ బూనుదురని గం
భీరోక్తుల నాపతి యిడ, ద్వారస్థుఁడు పోయె నాజ్ఞఁ ♦ దలఁగొని యంతన్.

ఎనుబదిరెండవ సర్గము సంపూర్ణము

---

౮౩ - వ సర్గము.

రాముఁడు రాజసూయము చేయఁబూనఁ గానుఁడు వలదని చెప్పఁగా నంగీకరించుట.

క. చని యతఁడు భరతలక్ష్మణు,లను గని రామోక్తులను నె♦లమిఁ దెలుపంగా
విని వారు రాఁగ నవ్వా,ర్తను దెలిపెను భూమిపాల♦తంమున కంతన్. ౧

క. కని ప్రియుల భరతు లక్ష్మణు, ననురాగముతోడ వారి ♦ నల్లన నాలిం
గనమున రంజిలఁ జేయుచు, జనపతి గారిఁ బలికె ♦ సహజన్ముతోన్. ౨

చ. ఒనరిచినాఁడఁ జక్కఁగ మ♦హోత్తమభూసురకార్య మేను నిం
కను వరధర్మసేతువును ♦ గప్రగతిం బరిరక్షణంబు చే

యను దలఁపోయువాఁడ; నది ♦ యక్షయ మవ్యయమంచు నామనం
బునఁ దలఁపోయువాఁడ నిదె ♦ పో యఘమోచనమార్గ మారయన్. ౩౫

తే. ధర్మమునె సంస్మరించుట ♦ తగినపనియొ
యింక నాయాత్మభూతులై ♦ యొసఁగు మిమ్ము
ననుజులం గూడి రాజసూ♦యంబు చేయఁ
దలఁతు నయ్యది శాశ్వత♦ధర్మము గద. ౬ 3118

సీ. శత్రుసూదనుఁడైన ♦ మిత్రుఁడన్ భూపతి రాజసూయమున ని♦ర్మలుని నగ్ని
సంతృప్తి నొందించి ♦ సత్వరంబుగ మిత్రత యనఁగఁ బడు సత్ప♦దంబునొందె;
రాజసూయ మొనర్చి♦రాజన్యుఁడౌ పాశధరుఁడు పొందెను బ్రీతి♦వరుణపదముఁ
జంద్రుండు ధర్మశా♦స్త్రంబుల నెఱిఁగినవాఁడౌట ధర్మైక♦పథముచేత

తే. రాజసూయంబుచేసి స♦ర్వజగములకుఁ
గీర్తిపదమైనలోకంబు ♦ నార్తిహరము
శాశ్వతంబును బొందెను; ♦ సహజులార!
యీదినమునందె నను గూడి ♦ యొసఁగు వేడ్క. ౮౫ 3119

క. పరికించి ధర్మమున్ మది, నిరుపమమాశ్రేయమెట్లు ♦ నిల్చునో మనకం
చరసి నయుక్తికముగ మీ, రురుతరధర్మంబు చెప్పు ♦ టొప్పుం జుండీ!. ౯

చ. అనుటయు వాగ్విశారదుఁడు ♦ ప్రాంజలియై భరతుండు పల్కె ని
ట్లని; పరమాత్మ! ధర్మమను♦నయ్యది నిల్చును నీదుచిత్తసీ
మను సకలోర్వి నీదయిన ♦ మానితశాసనమందె నిల్చు నిం
తని వచియింపరానిబల ♦ మట్టిదె విక్రమ మెన్న నీదెయౌ. ౧౦౫ 3121

క. గురుబాహూ! నిన్నున్ భూవరు లెల్లను దేవత లోగి ♦ బ్రహ్మను బోలెన్
ధరణీపతిశేఖరునిగఁ, బరమాత్మునిగాఁ దలంచు♦వారు సతంబున్. ౧౨ 3122

క. నిను మేముఁ దలఁచురీతిగఁ, జను లెల్లను దండ్రిగాఁగ ♦ స్వాంతంబులయం
దనవరత మెంచుచుందురు, ఘనబలశాలీ! ధరిత్రి ♦ గతి నీవె కదా ?. ౧౨౫

తే. ప్రాణులకు నీవె సతతసం♦త్రాణరూపుఁ
డవు గదా?; యట్టి నీవె భూ♦మివరనాశ
కరమయిన యజ్ఞ మిది చేయఁ♦గాఁ దొడంగు
టెట్లొ ? నృపవంశములు నశి♦యించుఁ జుమ్ము. ౧౪ 3124

సీ. [శశి రాజసూయాఖ్య♦నవ మొనరించిన తరువాతఁ దారకా♦సురుని యుద్ధ
మందు దెస్పరమగు ♦ నని చేయ నయ్యె; హరిశ్చంద్రుఁ డీయజ్ఞ♦రీతిచేత
క్షత్రియవంశనా♦శనభూతయుద్ధంబు చేయఁగా వలసె; ని♦శ్చింతనున్న
వరుణుఁడే యీమహా♦ధ్వర మొనరించి యద్దాని యంతమ్మున ♦ దారుణమగు

ఆ. సంగరంబు చేయ ♦ జలచరసంతతి, గ్రుందెఁ జుమ్ము; పరుల ♦ డెందమలరఁ

చేయుచుట్టిపనుల ♦ జేయుశత్రుం డిద్ది, చేయ ఘోరయుద్ధ ♦ మాయెడఁ దగె,
క. దానఁ భూతాళి చెడెఁ, భూనాయక! రాజసూయ♦మును జేయంగా
నానాభూతంబులకును, మానక నాశనము గల్గు♦మాట నిజంబౌ. ౧౯ 3126
క. క్రతు విది చేసిన రాజ, ప్రతతులకుం బౌరుషంబు ♦ భాసిల్లును వి
చ్యుతి గల్గు దాన భూతవితతికిం గోపంబు చాల ♦ దారుణము గదా?. ౨౦
చ. నరసగుణాఢ్య! శత్రుగణ♦సంతతభీకరవిక్రమా! మహా
పురుష! నృపాలశేఖర! వి♦భూతి నెసంగుచు నిన్నుఁ గొల్చి వి
స్తరయశమొందియున్న నృప♦సంతతిఁ జంపఁగరాదు; బుద్ధిమ
ద్వరుఁడవు చక్క నెంచి రఘు♦వంశచరిత్రముఁ గాంచి యుత్తతిఁ. ౨౧
క. భూతవ్రాతములకు హిత, మేతీరున గనునో దాని ♦ నెంచుము నీవే
భూతములకు నెల్లను గతి, యాతతి నద్దానిఁ ద్రుంప ♦ నేలా! చెపుమా!.
చ. భరతుఁడు సాధురీతి సుధ♦వర్షము పర్వినయట్లు పల్కఁగా
నిరుపమసత్యవిక్రముఁడు ♦ నీరజమిత్రకులోద్వహుండు భూ
వరపతి యాలకించి మది ♦ వర్ధిలు హర్షరసంబు ముంపఁగాఁ
గరము వెలింగె; నంత రఘు♦కాంతుఁడు కైకకుమారు సద్గుణుఁ. ౨౩ 3130
చ. కనుఁగొని యిట్లు పల్కె నుది ♦ గాఢమునంబును బొందినాఁడఁ ద్వ
త్తిని గని యిండ నీదునుప♦దేశము మేలని తోఁచె ధర్మయు
క్తిని గని యానుడుల్ వెలసె ♦ దివ్యములై హితదాయకంబులై
జనపతిపుత్ర! యాధరిణిఁ ♦ జక్కఁగఁ బ్రోచుటఁ దెల్పుచుఁ గదా. ౨౪
సీ. ధర్మజ్ఞ! నీవచ♦స్తతి నూఁతఁగాఁ గొని క్రతునరంబయి మాను♦కప్రియకర
మయి యొప్పు రాజసూ♦యంబును మానితి; లోకపీడాకర ♦ మేకరణిని
నగుకార్యమును దెల్ప ♦ నలరువారలు మానఁగను లక్ష్మణాగ్రజా!♦తగశుభంబు
హితమును నగువాక్య♦మే బాలకుఁడు చెప్పగ్రహియింపఁదగునని♦కలదు నీతి
తే. బుద్ధిమద్వర్య! నీవాక్య♦ము విహితంబు
శుభము హితదాయకంబునై ♦ శోభిలుటను
నే గ్రహించితిఁ దత్కృతిం ♦ బింకఁ జేయ
యత్నమును మానెదఁ విల♦యద మగుటను. ౨౫ 3132

ఎనుబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౮౪ - వ సర్గము.

లక్ష్మణుఁడు రామునకు వృత్రాసురునిచరిత్రంబును దెలుపుట.

చ. అని యిటు కైకయాత్మజుఁడు ♦ నారఘురాముఁడుఁ బల్క లక్ష్మణుం
డను నిటు రామునిం గని మ♦హామతిభూషణ! యశ్వమేధమం

చను క్రతువొండు పాపముల ♦ నన్నిఁటిఁ గూల్చును బావనంబుగాఁ
దనరును దానిఁ జేయఁదగు ♦ దావకచిత్తము సమ్మతించినన్. ౨ 3133

తే. దుస్తరం బది సర్వక్ర♦తువరమగును
బూర్వవృత్తము వినఁబడు ♦ భూమిపాల!
మహితచిత్తుఁడు వాసవుం ♦ డహితనూద
నుఁడు మహాబ్రహ్మహత్యచేఁ ♦ దడవు డస్సె. ౩ 3134

క. తరువాతన్ హయమేధా,ధ్వరమునఁ దత్పాపము క్షిఁ ♦ దా నొందెఁ గదా?
గురుబాహూ! విను దేవా,సురసంయోగంబు చెడిన ♦ సురరిపులందున్. ౩౪

క. దితిజుఁడు వృత్రాఖ్యుఁడు స,మ్మతుఁడై రాజ్యమ్ము చేసె ♦ క్ష్మాపాలక! వి
స్తృతి నూఱుయోజనమ్ముల, మితిఁ దత్త్రిగుణోచ్ఛ్రితంబు ♦ మే నతని కగున్.

క. అనురాగంబున మూఁడుభు,వనముల స్నేహమునఁ జూచు♦వాఁడౌట నతం
డనురంజకుఁ డన నెగడెను, విను నతఁడు కృతజ్ఞుఁ డఖిల♦విషయములందున్.

తే. ధర్మవేత్తయు సద్బుద్ధిఁ ♦ దనరువాఁడు
నగును గాన నె శ్రద్ధయు ♦ నమర ధర్మ
పాలనంబునఁ బృథ్విఁ గా♦పాడె నట్టి
వృత్రుఁ డఖిలవసుంధర ♦ వెలయఁ జేయ. ౭ 3138

క. ధర కామంబులఁ బిదుకుచుఁ, బరమాద్భుతరీతిఁ బొల్చెఁ; ♦ బ్రసవఫలములున్
వరమూలంబులు రసయుతి, ధరణిన్ విలసిల్లె నట్టి ♦ తరుణంబందున్. ౮ 3139

తే. ధరణి దున్నకయే పండు ♦ ధనము చాల, గల్గియుండును నాతని♦కాలమందు
నద్భుతంబుగఁ గన్పడు♦నవనితలము, భాగ్యయుతమయి వృత్రాను♦భవితమగుచు.

క. ఒకనాఁ డాతండు తపం, బకలుషమతిఁ జేయఁగోర్కె ♦ నంది యనుపమం
బు కదా యంచును జగతిన్, సకలశ్రేయఃప్రదాన♦చణమంచుఁ దగన్. ౯౪

తే. ఇతరసుఖ మెల్ల మోహంబు ♦ నిచ్చు నంచుఁ
దలఁచి పెద్దకుమారుని ♦ నిలిపి రాజ్య
పాలనంబునఁ బౌరుల ♦ నోలి నడిగి
మధుర కీశ్వరుఁ డితఁడను ♦ మాట దెలిపి. ౯౪ 3142

క. సురలకుఁ దాపం బిడు ని,ర్భరతపముం జేయఁ బూనె; ♦ వాసవుఁ డాక
ర్భరనాథు నియతి నెమ్మదిఁ, బరికించి సరోజనేత్రుఁ ♦ బరమాత్ము హరిన్. ౧౦౪

క. కన వైకుంఠమునకు వే,చని మ్రొక్కి వచించె నిట్లు; ♦ చక్రధరా! యో
దనుజవిరోధీ! వృత్రుం, డనుదనుజుఁడు తపము చేయ ♦ నాత్మనియతిచేన్. ౧౧౪

తే. జగము లన్నింటినిం దానె ♦ చక్క నాక్ర
మింపఁగాఁ బూనె బలమున ♦ మించు నతఁడు

ధర్మగతి గాన నేవానిఁ ♦ దాఁకి విజయ
మందఁగాఁ జాల నింక నా♦యసుర నారిల. ౧౨ 3144

క. ప్రణమూని తపము చేయఁగ, దితి పేంద్రుని వశ్యములగుఁ ♦ద్రిజగంబులు నీ
వతని మహోదారుని నుం,తతకైరి నుపేక్షచేయ ♦ ధర్మమె చెపుమా?. ౧౩

క. మనమున నీవే క్రోధం,బును గాంచిన వృత్రుఁ డుండఁ ♦ బోఁడు ధరిత్రిన్
వనజాక్ష! జగంబులప్పు, డనురాగము పొదలఁ జేయ ♦ నగు నీకనైనన్. ౧౪

క. నిను విభునిఁ బొందిి లోకము, లనూనసుఖసంపదలకు ♦ నాకరములుగాఁ
దనరెడుఁ గాక; మహాత్మా!, యనుగ్రహం చేయుమ స్తుత్య♦లం దున్నఁదగున్.

క. నీ వానరంబు చూపిన, నీవిశ్వము శాంతినొందు ♦ నెనఁగు నరుజమై
యోవిశ్వనాథ! నిన్నే, దేవత లిట వేఁడువారు ♦ తీవ్రత్వరతోన్. ౧౬ 3148

తే. వృత్రు వధయించి సాహాయ్య మిా♦విబుధులకును
జేయుమా సంతసంబు నీ♦ చేయుమా యా
మునన మే మున్నవారి మిా♦వని గొలుకు
శక్యమే గాదు వేరింబ ♦ సాఁదుపనము. ౧౭ 3149

ఎనుబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౮౫ - వ సర్గము.

—ఇంద్రుఁడు వృత్రాసురుం జంపి బ్రహ్మహత్యను బొందుట.—

చ. అనవిని లక్ష్మణోక్తులకు ♦ నారఘురాముఁడు మోదమంది యి
ట్లనియెను; వృత్రుఁ జంపి మ♦హాకథ యంతయు నాకుఁ జెప్పుమా
ఘనశరధి క్తి! యంచు నిపు♦ణాఢ్యుఁడు రాముఁడు పల్క లక్ష్మణుం
డనుపమగాథ దాని నిటు ♦ లారసి చెప్పఁగఁ బూనె శ్రద్ధతోన్. ౨ 3150

చ. వినుము నరేంద్ర! యింద్రుఁ డిటు ♦ వేఁడినఁ దద్వచనంబు నిర్జరుల్
వినట వచించువాక్యములను ♦ వారిజనాభుఁడు శ్రద్ధమీఱఁగా
విని శతమన్యుముఖ్యులను ♦ విమ్యతిసద్ధులన్ దగంగఁ గ
న్గొని యిటు పల్కె; వృత్రుఁడు వి♦కోపనుఁడౌ నని యెంచినాఁడఁజా!. ౩

క. కనుకన్ వృత్రునిపై నా,మనమున మనుకంపాంతరంగ♦మందల మగుచున్
ఘనరేడుఁ గావున నిత్తఱిఁ, గసలి ధనత్ప్రీతిక్రా ఆఁదు ♦ గాదు వధింపన్. ౪

తే. మీకు సుఖసంపదలు గల్గు ♦ మేలుచేయు, టది యవశ్యము నాకగు♦నట్లుగాన
వృత్రుఁ జంపుమపాయంబు ♦ నేను జెప్పు,వాఁడె సద్దాని వినిచేయు♦వలయునట్లె.

సీ. నా తేజమును జని♦న్నాయకత్వము దాల్చు సద్దానిఁ ద్రివిధమై♦యలరఁ జేయు
వాఁడె సద్దానిచే ♦ వాసవుం డా వృత్రుఁ జంపంగఁ గలుగునం♦శం బొకండు

వానవునిం బొందు♦ద్వైతీయమే వజ్రమునుబొందు మూఁడవ♦దనఁగ నొప్పు
నంశంబు భూమిని ♦ నాశ్రయించుచు దానవృత్రునిఁ జంపు దే♦వేశుఁ డనుచుఁ

తే. బలుకు నావిష్ణుమూర్తి భా♦షలను వినుచు
నమరు లట్లనె యగు సంశ♦యంబు వలదు
దానవాంతక! నీకు ము♦దంబు గలుగు
నసురవధమును గోరుచు ♦ నరుగుదు మిఁక. ౮౪ 3154

క. పరమోదారా! నీదగు, వరతేజముచేత నింద్రు ♦ భజియింప్రము స
త్వరముగ ననుచున్ శతమఖ,పురోగములు నొచు దేవ♦పుంగవు లెల్లన్. ౯౪

క. చనియెందు వృత్రనామక, దనుజుఁడు నివసించు నట్టి ♦ దారుణవనమున్
గని చొచ్చి యావరించిరి, వనమున నట స్వీయకాంతి♦భాసురు ఘనునిన్.

చ. దనుజగణేంద్రు వృత్రుని ని♦తాంతము మండెడు నగ్నిరీతి లో
కనిచయమున్ దహించు గురు♦కాంతిసముగ్రుని నంబరంబు నొ
య్యనఁ దపియింపఁ జేసెడు మ♦హత్తర తేజునిఁ జూచినంత భీ
తిని గని రాయమర్త్యు లెద ♦ ధీరత యెచ్చటికో వెసన్ జనన్. ౧౧౪ 3157

చ. ఇతని వధించు టెట్టు? లితఁ ♦ డెట్లు పరాజితుఁడౌనొ యంచు నీ
గతిఁ దలపోయుచుండ సుర♦కాంతుఁడు వజ్రము కేలఁ బట్టి యా
దితిజునిశీర్షముం దెగఁగ ♦ ధీరత వైచెను; దాన మస్తకం
బతులము ఘోరరీతిఁ దగు♦నట్టి మహోర్చులఁ గాల వహ్నియున్. ౧౩ 3158

క. తలఁ జెండురీతి వజ్రం, బలఘుగతిం బైనఁ బడిన ♦ యంత శిరం బు
జ్జ్వల తేజము పడె భూమీ,స్థలమున లోకములు సాధ్వ♦సంబును బొందన్.

ఆ. తగినరీతి విబుధ♦తల్లజుఁ డావృత్రుఁ, జంపి ఘనయశుండు ♦ సకలలోక
ములకుఁ బైననున్న ♦ యులఘుతనున్నను, జేరఁ బోయె మదిని♦జింతఁగలుగ.

క. సురనాథుఁ డిట్లు చనఁగా, గురుతరమగు బ్రహ్మహత్య ♦ కూడం జనె నా
తురముగఁ బైకొని యది యా, పురుహూతుని కుందఁ జేయఁ♦బూననతండున్.

క. అనయము దుఃఖించుచు నుం,డెను; శత్రువు తెగిన దేవ♦నిచయము పురుహూ
తుని గానక యనలునితోఁ, జని లోకత్రయమహేశుఁ ♦ జక్రిని భక్తిన్. ౧౭

క. కని పలుమఱు పూజించుచు, వనజాక్షా! నీవె గతి భు♦వనముల కెల్లన్
జనకుండవు భూతగణా,వనమునకై విష్ణు వనఁగఁ ♦ బరఁగితి సుమ్మీ. ౧౮

చ. దనుజుని జంపె నీదగు ని♦తాంతను తేజము బ్రహ్మహత్య యిం
ద్రుని గడు నేఁచుచున్నయది ♦ తోఁప దుపాయము మాకు మోక్ష మిం
కను గరుణింపవే త్రిదశ♦కాండపతీ! యుని వేఁడ నారివా
క్కును విని యిట్లు పల్కె హరి ♦ కోమలవాక్కుల మోద మబ్బఁగన్.

క. సను నింద్రుఁడు పూజించెడుఁ, గనుకన్ బుధసహూతుబాధ ♦ గాతింపక యుం
డను జేయువాఁడ నీకుఁ బ్రా,ననహాయమేధంబుఁ జేయ ♦ వలయు నతండున్.

క. సురల నుపేంద్రత్వము ని,ర్జరనాథునిఁ బొందు సాధ్వ ♦ సం బించుకయున్
బరికింప లేక యుండును, సురలార! యటంచుఁ జక్రి ♦ శుభతరభణితిన్.

తే. అమృతధారలు గురిసెడు ♦ నట్లు పలికి
వారి సంతృప్తి నొందించి ♦ వాసుదేవుఁ
డమరవినుతులఁ బొందుచు ♦ నాత్మలోక
మును దగం జొచ్చె దేవతల్ ♦ చనిరి తమిని. ౨౨ 3167

ఎనుబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౮౬ - వ సర్గము.

ఇంద్రుఁడశ్వమేధముచే బ్రహ్మహత్యను బాయుట.

చ. అని యిటు వృత్రు వజ్రమున ♦ నాయమరేంద్రుఁడు త్రుంచుటల్ వచిం
చిన రఘురామసోదరుఁడు ♦ శ్రీయుత తేజుఁడు లక్ష్మణుండు గా
థను బరిశిష్టభాగమును ♦ దా వచియింపఁగ నెంచి యిట్లనున్;
జనవర! దేవభీకరుఁడు ♦ చాలఁ బరాక్రమశాలి వృత్రుఁడున్. ౧ 3168

క. దురమునఁ దెగుటయు దివిజే,శ్వరుఁ బొందెను బ్రహ్మహత్య ♦ శక్రుండు మహా
సురుఁ జంపినపాపంబునఁ, జిరము వికారంబు నొంది ♦ కలవలపడుచున్. ౨

క. స్మృతిఁ బొందఁడయ్యె నెప్పటి, వితమున; నగ్గాట నతఁడు ♦ విశ్వాతీత
స్థితి నొందె విసంజ్ఞుండై, మతిపాటవమింత లేక ♦ మ్రాన్పడియుండెన్. ౩

క. ఈరీతిఁ గొంతకాల మ,పారతనుసంకుచితదేహ ♦ సర్పము గతి నా
భూరితరపాపపీడితుఁడై రాజ్యము తొలఁగ నుండె ♦ నట నెచ్చటనో. ౪

చ. సురపతి నష్టసత్త్వుఁడయి ♦ చోటు గనంబడకుండ దాఁగఁగా
ధరణియు నష్టతుల్యయయి ♦ తద్దయు నెండిన కాననంబులన్
గరము వికాసముం జెడఁగఁ ♦ గ్రాలకయుండె; జగంబు లన్ని యా
తురమును బొందుచుండెను న♦దుల్ జలపూరమడంగఁ గన్పడెన్. ౫ 3172

సీ. జలదముల్ లేనికాలము♦ములఁ బోల్చె ప్రాణములు నట్లు కన్పడియెన ♦ త్యాళిక్షోభ
మును బొందె వృష్టియే ♦ గనఁబడకుండెను; క్షీణించుచున్న ని♦శ్రీకలోక
ములఁ గాంచి సురలెల్ల♦ విష్ణు మూర్తి నెంబులుమును నిష్ణుమూర్తిఁ జెప్పినవిధమున
హయమేధమును జేయ♦నగు ననిపూనిరి మును లుపాధ్యాయులు♦ముందునడువ

తే. నింద్రుఁ డతిసాధ్వసంబున ♦ నెందునుండె
నచటికిం బోయి మోహితు ♦ నమరనాథు

బ్రహ్మహత్యాపరీతాత్ము ♦ బలవిహీనుఁ
గాంచి యాతనితోఁ గూడి ♦ క్రతు వొనర్ప. ౮ 3173

క. పూనిరి మహితాత్ముండగు, నానిర్జరనాథు బ్రహ్మ♦హత్య యడఁగఁగా
నానిర్మలహయమేధము, గానంబడె శ్రుతిహితముగఁ ♦ గడుఁ జిత్రముగన్. ౯

తే. అధ్వరంబు సమాప్తి ని♦ట్లుంద బ్రహ్మహత్య యాయమలాత్ముని ♦ నమరవిభుని
బాసి చెంతనె నిలువంగఁ♦బడివచింపు,నాకు నుండంగఁ దగినస్థా♦నంబు నింక.

క. అన విని సంతుష్టులు ప్రీతిని గాంచిన దేవతలు స♦తిస్థిరబుద్ధుల్
తనరఁగ నిట్లని పల్కిరి, వినుమా యోబ్రహ్మహత్య! ♦ వివరింతు మిఁకన్.

తే. నీదుతనువు చతుర్భాగ♦నియతిఁ గనఁగఁ
జేయుమా ముందు నీబాధ ♦ చెప్పరాని
దగును నా దేవవాక్కుల ♦ నాలకించి
మహితులౌ వారిపల్కులు ♦ మంచి వనుచు. ౧౨ 3177

క. తనమది నెంచుచు నింద్రుని, తనువున నివసింపరామిఁ ♦ దలఁచి పలికె ని
ట్లని వారితోడ; నాల్గుగ, నొనరించెద నాదుతనువు ♦ నోసురలారా!. ౧౩

సీ. ఒక్కయంశంబున ♦ నురుజలసంపూర్ణనదులందుఁ బఱమల్ ♦ నాల్గువార్షి
కములనఁబడువానిఁ ♦ గడపెదఁ బఱ్యాత్మ లగువారలం గాక ♦ యుపగతసుకృ
తాత్ములదర్పంబు ♦ హరియించుదాననై స్నానార్థమరుదెంచు♦జనులయందుఁ
గామచారిణినయి ♦ క్రాలుచు నుండెద; ధర నొకయంశంబుఁ ♦ దాల్చి సర్వ

తే. కాల మండెద నింద్రుని♦కాయమందు,వసతి లేదింకఁ గావునఁ ♦ బలుకుదాన
సత్యవాక్కుమఱొక్కయం♦శమునవనిత,లందువాసంబుఁగల్పించు♦కొందు నేను.

క. వనితలు ప్రాయంబునఁ జక్కనిరీతిని బొల్చువారు♦గా నుందురు వా
రిని గాంచి వసించెద నే, ననవరతము గాక నియత ♦ మగుకాలమునన్. ౧౪

తే. నే వసించెద మూఁడగు ♦ నిశలు మాత్ర
మవుడు తద్దర్పమును నేను ♦ నపహరించి
పురుషసంయుక్తి లేకుండఁ ♦ బూన్కిఁ జేయు
దాన మీ రొప్పవలయు స♦ద్యమము దీని. ౧౫ 3181

క. ధరణీసురహంతకులై, నిరతము సత్యేతరముగ ♦ నియతిగ దూషిం
తురో వారిఁ దురీయాంశత, సురలారా! పొందుదాన ♦ శూరత మెఱయన్.

చ. అన విని నిర్జరుల్ పలికి ♦ రాత్మఁ దలంచినయట్లె చేయు మీ
వనుపమశక్తిఁ గార్యముల ♦ నన్నిఁటిఁ దీర్తువు గాక స్వేచ్ఛగా
నని వచియించి దాని విడి ♦ యాదృతిఁ బ్రీతియుఁ దోఁప నింద్రు వం
దనములఁ దన్పి రాతఁడు గ♦తజ్వరుఁడై యలరారె నెంతయున్. ౧౬ 3183

తే. వేయిగన్నులనాథుండు ♦ విశ్వపాల,నమును బూనంగ లోకంబు ♦ లమలరీతిఁ

చ. అనుపమచైత్రమాసమున♦యందు బలంబులు సేవకాళి వా
హనములు తోడ రా శతస♦హస్రముగా మృగసంతతిన్ బలం
బునఁ బొలియించె; వేఁటతమి ♦ పొందక యుండెను దృప్తి యెంతకున్
జనపతి యస్సుహాత్ముఁడు య♦శంబున మించఁగ నెంచి యాత్మలోన్. ౯

చ. చనిచని యామహాత్ముఁడు ని♦శాతశరంబులచే మృగాళులం
దునుముచు నేయరణ్యమున ♦ ధూర్తవిరోధి యముండు స్కందుఁ డ
త్యనుపమశక్తి యుద్భవము ♦ నందెనొ యాస్థలిఁ జేరఁబోయె; నా
వనమునఁ బార్వతిన్ సుదతి ♦ భద్రుఁడౌ శివుఁ డెంతొ వేడుకన్. ౧౦

క. సంతోషపఱచుచుండెను, వింతగ ననుచరులు వేన♦వేలుగఁ గొలువన్
గ్రాంతరివుం డాతఁడు తన, కాంతను సంతోషపఱుపఁ♦గా స్త్రీతనువున్.

తే. తాను గ్రహియించి గోపతి♦ధ్వజుఁడు చెంత
నలరుపర్వతనిర్ఝర ♦ మందు వేడ్క
నుండె; నావనభూమి స♦త్త్వగ్రపురుష
సత్త్వములును బులింగవృ♦క్షములుగూడ. ౧౧ 3195

క. వనితలవలె నయ్యెను; నా, వనినున్న మృగాళు లెల్ల ♦ వనితాసంజ్ఞం
దనరారె; నట్టియవసరమునఁ గర్దమపుత్రుఁడైన ♦ భూపతి యిలుఁడున్. ౧౨

క. శరముల మృగములఁ జంపుచు, నరిగెను దద్వనముఁ జేర ♦ నంత నతఁడు త
ద్ధర వ్యాళమృగపత్త్రిని,కరములు స్త్రీరూపములను ♦ గ్రాలుచునుండన్. ౧౩

క. కనుఁగొనె నంతటఁ దానును, ననుచరులును వనితలైరి ♦ యట్లగుటను నె
మ్మనమునఁ దలంచి శోకంబును మిగులం బొంది కృత్య♦మును దద్విధమున్.

క. హరకృతమని యెఱిఁగి మహా, త్తరభయమును బొందె; నంత♦దైవంబు మహే
శ్వరు శితికంఠుఁ గపర్దిని, శరణ్యుఁ గాఁ గోరి భృత్య♦సముదయయుతుఁడై. ౧౪

క. చని భవుని మఱుఁగు జొచ్చెను, జనపతి నాయిలుని గాంచి ♦ శంకరుఁడు వరం
బును గరుణించెడు దైవము, తనమోమున సుస్మితంబు ♦ తగ సతితోడన్.

తే. కర్దమప్రియనందనా! ♦ క్షత్రియముని
వర్య! ఘనబలరాజితా! ♦ వరనియమవి
భాసురా! సౌమ్య! లేలెమ్ము ♦ వరముఁ బురుష
తను వదలి వేఱు వరముఁ బొం♦దఁగను గోరు. ౧౫ 3201

క. అన విని శోకార్తుండై, తనకోరిక శంకరుండు ♦ పగదని పలుకన్
విని భవునివలన వేఱొక, టనఁదగు వరమును వరింప ♦ నాత్మఁ దలఁపమిన్.

ఆ. వగలఁ బొగిలి నృపతి♦వర్యుఁడు పార్వతి, కెరఁగి హృదయపూర్వ♦కేష్టభక్తి
నిట్లు వినుతి చేసె ♦ నీశాని! వరదాన,దక్ష! లోకజనని! ♦ ధన్యచిత్త!. ౨౨

క. నిను దర్శించుట సఫలం, బనఁ జనుఁగద? యట్లుగాన ♦ నాదృతి నన్నుం

గనుఁగొని కావుమ యనఁ దా,తనివ్యాప్తశీవాంఛ నెఱిఁగి ♦ ధరణివిభు మునిన్.
క. కరుణాదృష్టిం గన్గొని, హరుసన్నిధి నిట్లు పలికె ♦ నతిశుభదోక్తిన్
గిరిశునినస్తుతిచే నో, ధరణీశా! యీశుఁ డర్థ♦తోనుఁడౌను గదా?. ౨౮ 3205
క. సగ మేను గాన పన్నొక, నగమే యాచింపు వనిత♦చంద మ్మొకరాం
తగఁ బురుషాకృతిఁ గొంతగఁ, దగుకాలము గోరుకొనుము ♦ తలఁచినరీతిన్.
క. అని యనునృతమురీతిం దగి, యను త్రీసంబైనవాక్య ♦ మంబ పలుకఁగా
విని సంతుష్టస్వాంతం,బున రాజేంద్రుండు పలికెఁ ♦ బొంగెడువేడ్కన్.
సీ. దేవి! ప్రసన్నవై ♦ తివయేని నే రూపవిభవంబునన్ సాటి ♦ విశ్వమందు
లేక మానసం బొందు ♦ లీలాకురంగాక్షి నై యొక్కమాసంబు ♦ నందుఁ బురుష
తను గని యుండెద ♦ ననుమతింపుము యిట్టులన రాజువాంఛితం♦బును నెఱింగి
పార్వతి శుచిరాస్య♦పద్మయై యిట్లను; నీవు కోరినయట్లు ♦ గా వరంబు
తే. నిచ్చితిని రాజవర్య! నీ ♦ వెపుడు పురుష
తను గనంబాలుడవౌ యప్పు ♦ డన్విభావ
మును స్మరింపఁగఁ జాలవు ♦ వనితవైన
యప్పు పురుషతయును దెలి♦యంగ లేవు. ౩౧ 3208
క. అని పలికె సంత నాతఁడె, జనపదుఁడై మాస ముండె ♦ జగములలోఁ జ
క్కనిదనఁగను వనితయునై, తనరె నిలా దేవియనఁగఁ ♦ దా నొక నెలలోన్.

ఎనుబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౮౮ - సర్గము.

ఇలుఁడు స్త్రీరూపము నొంది వనమున విహరింపుచు బుధుఁడు కామించుట.

క. అని యిట్లు లిలానిషయం,బును దెల్పెడు గాథ రాము♦మూర్తి తెలుపఁగా
విని భరతలక్ష్మణులు మన,మున విస్మితులగుచు హస్త♦ముల నొగ్గి తమిన్.
క. రామునితో నిట్లని రా, భూమీశుని సుహితచిత్తు ♦ బుధనుతుని వినం
గా మది త్వరపడియెడు నో, రామా! వినవలతు మేము ♦ రాజచరితమున్.
క. నరపతి దుర్గతి యనఁదగు, తొలఁగరూపంబు నొంది ♦ ధర వర్తించెన్
బురుషుండై యెవృత్తిని, బరిగ్రహించెన్ మహీశ♦వర! తెల్పఁగదే?. 3
చ. అనుటయు సంతసంబు గని ♦ యాయనుజన్ములు తన్ను వేడఁగా
విని రఘురాముఁ డెంతయును ♦ విస్తృతమౌ కథ దానిఁ జెప్పెదన్
జనపతి యెట్లుగాఁ దిరిగె ♦ త్స్నాస్థలి నవిధ మెల్లఁ జెప్పెదన్
వినుఁ డిటు లామహీశ్వరుఁడు ♦ వింతగ సుందరనారియై యటన్. ౪ 3213
క. అనుచరులును వనితలునై, తనుఁ గొల్వఁగఁ దవ్వనమును ♦ దాఁ జొచ్చి విహా

రనిరతిఁ జరియించెను నా,వన మున్నతతరులతాలి♦బద్ధం బగుచున్. ౯॥ 3214

ఆ. అలరుచున్న నందు ♦ నాయతపద్మద,శాఖీర్ణమైన యిల యు ♦ సంప్రీగతిని
దిరిగె వాహనాళిఁ ♦ దేశువ విజనాడి,సిరివిశాలతరవి♦వరములందు ౭ 3215

సీ. ఆకాశనంబున ♦ నద్రికిఁ జెంతనె బహువిధఖగకుల♦పటల మొలయ
నుచిరప్రఖ్యమై ♦ శోభిల్లు సరసొండు వెలయుచుండెనుదానినిలయుఁ గాంచి
యందుఁ జంద్రాత్మజుం♦డైనట్టి బుధుని దేహచ్ఛాయ నలరారు♦నతని నుదిత
సంపూర్ణచంద్రుని♦చందంబునం దగువానిఁ దపస్స్ఫూర్తి ♦ వఱలువాని

తే. జలములకు మధ్యమంబగు ♦ స్థలమునందు
దుష్కరంబగు నియతిచేఁ ♦ దోఁచువాని
యశమునందగువాని వ♦యస్స్ఫురితునిఁ
*గామకరుఁ గాంచె మది యెల్లఁ ♦ గళవళింప. ౧౦ 3216

చ. సరసును జొచ్చి కాంతలయి ♦ చారుతనుద్యుతు లొప్పుచున్న య
ప్పురుషులఁ గూడి యాకొలను ♦ బొంక మడంగఁ గలంచె విస్మయా
తురమున; నంతటన్ బుధుఁడు ♦ తొయ్యలి నయ్యెడఁ గాంచి యెంతయున్
స్మరశరపీడితుండగుచు ♦ స్వాంతము దూలఁ దపించె నామెయున్. ౧౧॥ 3217

చ. జలములలోన మున్గుచును ♦ జక్కనిచేడెలఁ గూడి తేలుచున్
బాలసెడుకోర్కి నుండ; శశి♦పుత్త్రుఁడు రూపమునన్ ద్రిలోకకాం
తలను జయించి యొప్పనల ♦ తన్విశుభాకృతిఁ గాంచి చిత్తమం
దలఘువిచారముం గనియె ♦ నంగనవార్త నెఱుంగఁ గోరుచున్. ౧౩ 3218

క. సురకాంతల మించెడు నీ,తరుణీమణి యెవతెయొక్కొ ♦ ధాత్రిం గనని
ర్జరనారులందుఁ బన్నగ,తరుణులయం దసురవరని♦తంబినులందున్. ౧౩॥ 3219

తే. అచ్చరలయందు నిట్టిదా ♦ నాకృతిఁ దగు
నింతి మును పెన్నఁడును జూచి ♦ యే నెఱుంగ
నెవతయో యీమె యితరుఁ డీ♦యింతిఁ గొనక
యున్న నా కుద్దియా నీక ♦ నెన్న నేల?. ౧౪॥ 3220

క. అని చింతించుచు జలముల,కు నడుమఁ జలియించి యట్టె ♦ కోరిక పొంగన్.
జనుదెంచెఁ గూలమునకా,ఘనుఁడాశ్రమమునకుఁ బోయెఁ♦గాంతామణులున్.

చ. జలకము లాడి యాడి కడు♦సంతస మింపెనలార నాశ్రమ
స్థలమున కేగుదెంచుటయుఁ ♦ జక్కని ధర్మ మొనర్చు నాబుధుం
డలతరుణీగణంబు గనె ♦ నాతని వారలు గాంచి రంతటం
గలిగెఁ బరస్పరంబు తమి; ♦ కాంతల నందఱఁ గాంచి యాదృతిన్. ౧౬॥

తే. పలికె నిట్లని ధర్మాత్ముఁ ♦ డలఘుమతియు
నగు బుధుఁడు కాంతలార! యీ♦యంగనాతి

* యశస్కరం కామకరం తారుణ్యే పర్యవస్థితం-అనిమూ.

తే. ఒంటి నుండుట నాయిళ ♦ యుగుతరాంగి
కాంతిఁ జెలువారు చంద్రుని ♦ కమ్రసుతుని
గాంచి యిట్లని పల్కెఁ; నేఁ ♦ గామచరిని
నీకువశవర్తినిగ నైతి ♦ నెమ్మి నిపుడు. ౯॥ 3233

క. మనమున ననుఁ గోరితివే, ననూనసువిలాస మనుర ♦ సర్వసుఖములన్
గను కోర్కెరీతి ననుఁ గొని, యను నద్భుతపద్ధతిఁ దగు ♦ నావచనంబున్. ౬॥

చ. విని మది హర్షమంది ముని ♦ వృత్రహరుండగు సోమనందనుం
డనుపమకేళిలోలుఁడయి ♦ యాయిళఁ గూడి సుఖించె; మాధవా
ఖ్యనుదగు మాస మొందు తమి ♦ నావనితాసుఖయుక్తి నున్న యా
తనికి క్షణంబుగాఁ గడచెఁ ♦ దద్దయుఁ గాముకుఁడై చెలంగుటన్. ౭ 3235

సీ. అంత మాసం బొక్కఁ ♦ డారీతిఁ గడచిన నాయిళుండును బూర్ణుఁ ♦ డైనచంద్రు
ననుకరించెడు నాస్య ♦ మలరారఁ బురుషుఁడై శయనంబునుండియొ ♦ చక్క లేచి
శశినందనుని జలా ♦ శయమందుఁ దపమును సలుపుచుఁ బైకి హ ♦ స్తంబు లెత్తి
యాలంబనము లేక ♦ యలరారఁదాఁ గాంచియిలుఁ డిట్లుగాఁ బల్కె ♦ నెలమితోఁ బ;

తే. మునివరా! దుర్గమంబగు ♦ భూధరంబుఁ
జొచ్చితిని సేవకులతోడఁ ♦ జూడఁ బడరు
నాదు సేవకు లెం దేగి ♦ నారొ? చెపుము
యనఁగ నష్టసంజ్ఞుండగు ♦ నతనిపలుకు. ౧౧॥ 3236

క. విని చంద్రనందనుఁడు చక్కని వాక్కున నూఱడిలెడు ♦ గతి శుభరీతిన్
వినిపించె నిట్టు లో నృప!, యనుచరులన్ ఱాలవాన ♦ యంతముఁ గూర్చెన్.

తే. ఆశ్రమంబున నిందు నీ ♦ వతులవాత
సాధ్వసార్తుఁడవై యుండి ♦ శయనమంది
తివి గదా; యూఱడిల్లుము ♦ "తేఽస్తు భద్ర
మవ్యహా" మ్మంచుఁ బల్కె యి ♦ ట్లనియె మరల. ౧౩॥ 3238

క. మనమున భీతిం బొందకు, మనఘా! విగతజ్వరుండ ♦ వై ఫలమూలా
శనమున యథాసుఖంబుగ, వనమున నిట నుండవయ్య ♦ వసుధాధిపతీ!. ౧౪

చ. అన విని యామహీపతి స ♦ మాశ్వసితుండయి సేవకుల్ మృతిం
గనుటను దీనుఁడై యతనిఁ ♦ గాంచి వచించెఁ;ద్యజింతు రాజ్య మే
ననుచరు లెల్లఁ జావ క్షణ ♦ మైన సహింపను రాజనామముం
గని భగవంత! యాజ్ఞ యిడఁ ♦ గాఁ దగు నర్హుఁడ నేను దానికిన్. ౧౬ 3240

క. తనయుఁడు జ్యేష్ఠుఁడు మానీ!, యనఘుఁడు సుయశుండు నాకు ♦ నలరునతం డే
పున నాదురాజ్య మేలును, ఘనుఁడై శశిబిందు వనఁగఁ ♦ గ్రాలెడుఁ జుమ్మీ.

* అహం కామచరీ సౌమ్య-అనిమా.

క. జరపిన యనంతరం బే,కరణిం గథ చెల్లఁ జెప్పఁ♦గాఁ దగుఁ దత్త్వం
బరసి యనఘ మధురోక్తులఁ, బరమోదం బలరఁ దన్నుఁ♦బ్రశ్నింపంగన్. ౭౫

క. విని యలరి వారి కిట్లని, వినిపించెం గర్దమాఖ్య♦విమలాత్ముని పు
త్రునిగాథ; నిట్లు పురుషతఁ, గనినట్టి యిలాఖ్య శూర♦గణనుతుఁ గనుచున్.

చ. నిరుపమబుద్ధిసంపదయు ♦ నిర్భరశక్తియుఁ గల్గు నాబుధుం
డురుతరకీర్తిశాలియయి ♦ యొప్పుట నానృపుశాపముక్తి నే
కరణి నొనర్పనో యనుచుఁ ♦ గ్రమ్మఱ నెంచి మహాత్ములౌ మునీ
శ్వరులను రాఁగఁ బంచె వర♦శక్తియుతాత్ముల యోగశాలురన్. ౮ 3253

సీ. సంవర్తనామకుఁ ♦ జ్యవనుని భృగుపుత్త్రు ననఘు నరిష్టనే♦మినిఁ బ్రమోద
నాహ్వయు దుర్వాసు ♦ నఖిలవేత్తల నాఁ బిలిపించి వాక్యరీ♦తుల నెఱుంగు
బుధుఁడు మిత్త్రుల ముని♦పుంగవులం గాంచి వచియించె నీరీతి; ♦ వసుమతీశు
డీగురుబాహు వీ♦యిళుఁడు కర్దమసుతుం డని మీ రెఱుంగుదు ♦ రట్టి లాట

తే. నితని కే పరితాపం బ♦హీనతరము, కలిగె నద్దానిఁ దొలఁగించి ♦ క్షమ్రయశము
కలుగునట్టులు గావింపఁ♦గాఁ దగు నన, వార లేమియొపల్కు న♦వసరమందు.

క. అరుదెంచెఁ గర్దమమునీ,శ్వరుఁ డచటికిఁ దేజమలర ♦ సమహావిప్రో
త్కరుఁడై యాతని వెన్కొని, యరుదెంచినవారిని వినుఁ ♦ డతిశుభమలరన్.

తే. క్రతువుల స్త్యవషట్కారు ♦ లతుల తేజుఁ
డైన యోంకారమానియు ♦ నరుగుదెంచి;
రంత వారెల్ల నిత రేత♦రాభిదర్శ
నమున సంహృష్టులై మహీ♦నాథుఁ గూర్చి, ౯౫ 3256

క. హితకాములు గావున నే, వితమున నీశాపముక్తి ♦ వెలయు ననుచుఁ బ
ల్కుతఱిని గర్దమమునిపతి, సుతునకు శ్రేయస్సు గోరి ♦ శుంభద్భణితిన్. ౧౦౫

క. మునివరులారా! నానుడి, వినుఁడీ! యీపార్థివునకు ♦ వితతశ్రేయ
స్సును గూర్చి పలుకువాఁడను, ఘనభైషజ్యంబు వేఱు ♦ గన్పడ దెదియున్

చ. పరముఁడు శంకరుండు సుర♦పాలకుఁ డావృషభధ్వజుండె భూ
వరునకు మందుగాఁ దగిన♦వాఁడు తురంగమమేధ మొక్కఁ డీ
తరుణమునందుఁ జక్కనిది ♦ దానిని వీడిన నన్యమైన య
ధ్వరము ప్రియంబుగాదు వృష♦భధ్వజు నాతనిఁ దృప్తుఁ జేయఁగన్. ౧౨

సీ. మనమందఱముఁ గూడి ♦ మఖవరం బద్దాని దుస్తరవ్రతముఁ బ్ర♦శస్తతరముఁ
బార్థివుహితముఁ గూ♦ర్పంగ యజింతము; నా విని యెల్లభూ♦దేవమాను
లతని కిట్లని పల్కి ♦ రశ్వమేధంబున నీశు నారాధింత ♦ మిది తగినది
సంవర్తుఁడను మునీ♦శ్వరుశిష్యుఁ డరిపురంజయుఁడు మరుత్తనఁ ♦ జను మునిపతి

తే. యశ్వమేధాధ్వరంబున ♦ నభవుఁ దృప్తి
నొందునట్లుగఁ జేయించె ♦ నుద్యనామున
నధ్వరం బది బుధునిదా ♦ నాశ్రమంబు
చెంతఁ జక్కఁగ సాగె వి♦చిత్రరీతి. ౧౫ 3260

క. మాఱుఁ డాయధ్వరవరమునఁ, బరమప్రమదంబు నొంది ♦ భవ్యయశంబుల్
ధరణిఁ జెలయింపఁగ నధ్వర మది సంపూర్ణమైనఁ ♦ దా హృష్టుండై. ౧౬

క. చనుదెంచి యిలునిసన్నిధి, మునిపతులం గాంచి యజ్ఞ♦మున దీనం దృ
ప్తిని బొందినాఁడ మీాభ, క్తిని మెచ్చితి బ్రహ్మమునిత♦తి ప్రియ మింకన్. ౧౭

క. ఒసరింపఁ దగును నిశ్చితి, జనవిభునకు శుభముఁ బ్రియముఁ♦జనఁగద చేయం
గను గోరుఁ డనఁగ నామునిఘను లెల్ల మహేశునూర్తి♦గణముల్ వినుచున్.

తే. పలికి రెంతయు శ్రద్ధచే ♦ నిలుఁ డితండు
పురుషుఁడయియే ప్రవర్తిల్లు ♦ భూతనాథ
కరుణనీయుంగఁ దగు నిదె ♦ వర మటన్నఁ
బ్రీతి సద్దాని నొసఁగె నా ♦ పృథ్విపతికి. ౧౯ 3264

క. వర మిట్టు లొసఁగి యాశం, కరుఁ డంతర్ధాన మొందె ♦ గాఢరుచుల్ భూ
నుతులకుఁ గన్పడకుండఁగ, మాఱుఁ జేగఁగ నధ్వరంబు ♦ సాంతం బైనన్. ౨౦

క. వరయోగదృష్టిగల యా, వరవిప్రులు నచ్చినట్టి ♦ భంగిం దగఁ బో
యిరి రాజు బాహ్లీకంబును, నరగున విడనాడి మధ్య♦జనపదమందున్. ౨౧

క. అనుపమసుఖదం బని యెంచి నివాసము చేసెఁ గీర్తి ♦ చెలువారఁగఁ బ
త్తనముఁ బ్రతిష్ఠానాహ్వయ,మును గట్టఁగఁ బంచి మంత్రి♦ముఖ్యులతోడన్.

ఉ. తాను వసించె బాహ్లిపుర♦తల్లజమందు మహాదినూదనుం
డైన ధరిత్రినాయకుఁ డ♦హార్యుఁడునౌ శశిబిందునామకుం
డానతభూపతిప్రకరుఁ ♦ డాన్నృతిమై నివసించె; నా ప్రతి
ష్ఠానమునం దిలుండను ప్ర♦జాపతిపుత్త్రుఁడు దోర్బలంబునన్. ౨౩ 3268

ఉ. ధారణిపాలనంబుఁ గుల♦ధర్మము లేవియుఁ దప్పకుండఁగాఁ
జారుతరంబుగా జరపె ♦ సంతతధర్మరతుండు గాన నా
భూరమణుండు కాలమునఁ ♦ బూజ్యతరంబు నను త్తమంబునౌ
సారసంభవామలవి♦శాలపదంబును బొందె నంతటన్;. ౨౪ 3269

తే. ఇలునినుతుఁడౌ పురూరవ ♦ సొంపు మిగుల
నా ప్రతిష్ఠానపత్తనం ♦ బట్టి యేలెఁ;
బురుషసత్తములార! యా♦తురగమేధ
మహిమ యిట్టిది యనుచు మీా♦మది నెఱుఁగుఁడు. ౨౫ 3270

క. తరుణీభూషుండగు భూవరుఁడయ్యెను బురుషుఁడుగను ♦ వసుధాస్థలి న
ధ్వర మిద్ది యాచరింపఁగఁ, బరమార్థము గల్గునంచు ♦ వర్ణించు శ్రుతుల్.

తొంబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౯౧ - వ సర్గము.

అశ్వమునకు వలయుపరికరముల నిర్మింప లక్ష్మణునకు రాముఁ డాజ్ఞయిచ్చుట.

చ. అని యిటు రామచంద్రుఁడు మ♦హోత్తరతేజుఁడు పల్కి లక్ష్మణుం
గని వచియించె ధర్మయుతిఁ ♦ గాంచినపల్కుల; నవ్వసిష్ఠమా
నిని ఘను వామదేవుని న♦నింద్యచరిత్రుని గాశ్యపాఖ్యుఁ దో
డ్కొని యిట కేగుదెమ్ము మఱి ♦ క్షోణీసురర్షిని దివ్యతేజునిన్. ౧ 3272

సీ. జాబాలినిన్ ద్విజ♦సత్తములన్ హయమేధంబుఁ జేయింప ♦ మిగులశక్తి
గలవారిఁ దోడ్కొని ♦ కడువడి రమ్ము; వారలతోడఁ దలపోసి ♦ రమ్యలక్ష
ణాభిరామము యజ్ఞ♦హయమును శ్రద్ధతో విడిచెద నంచన్న ♦ వినుచు నలఘు
విక్రముండగు రఘు♦వీరుని తమ్ముఁడు లక్ష్మణుం డరిగి యి♦లాదివిజులఁ

తే. దోడుకొని వచ్చి రాఘవు♦తోడఁ దెల్పె;
భూసురుల్ దేవసన్నిభుఁ ♦ బూతమతిని
బాదవందనధన్యుఁడై ♦ పరఁగువాని
వైరిదుస్సాధ్యవిక్రము ♦ శ్రీరఘువరు. ౨ 3273

క. దీవించిరి; ప్రాంజలియై, భూవిభుఁ డాద్విజులఁ జూచి ♦ పొంగుచు మదిలోఁ
బావనహయమేధముఁ దాఁ, గావించుకుతూహలమును ♦ గాంచి వచించెన్. ౩

శా. శ్రీరామోక్తుల నాలకించి గిరిశున్ ♦ శ్రీకంఠునిన్ వేఁడి యిం
పారన్ దక్షక్రతువర్యముం బొగడి చే♦యన్ శ్రేయముల్ గల్గు నా
గౌరీశుండు ప్రసన్నుఁడౌ ననుచు ని♦క్కంబున్ వచింపంగ గం
భీరార్థంబగు వారివాక్కు విని యా♦పృథ్వీశుఁ డత్యాదృతిన్. ౪ 3275

తే. తురగమేధంబు చేయంగఁ ♦ దోఁచు శుభము
లనుట కెంతయు నానంద ♦ మంది వారి
యనుమతిం బొంది సౌమిత్రి ♦ కనియె; నీవు
త్వరగ సాధుసుగ్రీవు ను♦దాత్తమతిని. ౫ 3276

క. క్రతుకార్యము చేయింపఁగ, జతనంబుగ రమ్మటంచు ♦ జంఘాలుర వే
గ తగం బంపుము వానర,వితతులతోఁ గూడి మఖము♦వేడుకఁ జూడన్. ౬

క. కృతనిశ్చయులై కపులను, హితులను జతగూడి రమ్ము ♦ తృప్తిగ దీనిన్
గ్రతువర్యము చూడం దగు, వితతసహాయంబు నాకు ♦ వెలయున్ నీతోన్.

సీ. భద్రంబు నీకగుఁ ♦ బరమముదంబున నంగదు గంధవ♦హాత్మజన్ము
నలుని నీలునిని బా♦టలుని గవాక్షుని గజుఁ బనసుని నింకఁ ♦ గలుగుహరులఁ

తే. పరమపావనమైన యధ్వరము దీని, ననుభవింతురు గాక యావనమునందుఁ
దుష్టిఁ బుష్టిని బొంది యభీష్టముగను, గారవం బంది వచ్చిన వార లెల్ల. ౨౮౪
క. చనుదురు గాక పురంబుల;, కనసూయులు నగుచు ధర్మ మావృతిని నెఱిం
గినవాఁడ వౌట జనముల, మన మలరం జేయునట్టి మాడ్కిఁ బిలువుమా.
ఆ. బలిసినట్టి లక్షవరవృషభంబులు, తండులములు మోయఁ దగి వెలువడ
వలయుఁ దిలలు ముద్గములు మోసికొనిపది, వేలవృషభములును లీలమెఱయ.
క. చనవలయు ముందు నులవలు, మినుములు చణకములు నుప్పు మించినగతిఁ గై
కొని గోనెలెద్దు లేగం, జనవలయుఁ ముందు ముందు శత్రుబలహా!.
క. కనకంపునాణెములు వెండి నాణెములు చక్కఁ జూచి నేర్పున నొకకో
టిని నూఱుకోటులను గొని, చనవలయుఁ భరతుఁ డచటి సవనస్థలికిన్.
తే. త్రోవ నడుమను బణ్యవీథుల నమర్పఁ
దగును నటనర్తకులు నుండఁ దగును వంట
చేయువారును బ్రౌఢలౌ స్త్రీలు మెలఁగ
వలయు సత్కీర్తిఁ జెంపుమా సులలితముగ. ౨౯ 3293
చ. భరతునితోడ సైన్యములు పౌరులు పల్లియలందు నున్న స
త్పురుషులు బ్రాహ్మణోత్తములు పోవలయుఁ భయభక్తులొప్ప కిం
కరులును గోశపాలకులు కమ్మరి కొయ్యలు చెక్కువాఁడు న
త్వరగతి గుంపుగా మునుపె ధర్మము తప్పక పోవఁగాఁ దగున్. ౩౦౪ 3294
క. జననులు నాదునహోదర, వనితలు *హాటకతనుత్వభాసురయగు నా
వనితయు దీక్షానిరతిం, గనుపండితు లరుగఁ దగును గా భరతునితోన్. ౩౧౪
ఆ. వీరి నెల్ల ముందుఁ జేరుప భరతుండు, పృథుయశుండు నాకుఁ బ్రీతిదుండు
చనును గాక రాజసమితికిఁ దగు గేహ, ములు నొనర్పఁ దగును వలసినట్లు.
క. జనపతులసేవకులకున్, జనుఁ దగు గేహాళిఁ గట్టఁ జక్కఁగ నని యా
జనకకుమారీనాథుఁడు, పనిచెన్ సోదరుల కెల్లఁ బరమప్రీతిన్. ౩౩ 3297

తొంబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౯౨ - వ సర్గము.

శ్రీరాముఁ డశ్వమేధము చేయఁ బూనుట.

క. భరతాగ్రజుఁ డీరీతిగఁ, బరికరముల నెల్ల సిద్ధపఱుపఁ బనిచి స
త్తురగమును గృష్ణవర్ణము, పరఁగఁగ సల్లక్షణముల భాసిలుదానిన్. ౧
క. ధరణిఁ బ్రదక్షిణ మొనగుప, ధరణీశుఁడు విడిచి యశ్వతంత్రంబున సో

* కాంచనీం మమ పత్నీం చ-అనిమూ.

వాని నొసఁగుచు నుండి ర♦ధ్వరమునందు
నందు మలినుండు దీనుండు ♦ నాతురుండు. ౧౭॥ 3309

క. ధనహీనుండును వెదకినఁ, గనరాకయె యుండె; హర్ష♦కలితజనులు గ
ల్గిన రామునియాయజ్ఞం, బనూనవిధి సాగె ననమ♦మై యాతతినిన్. ౧౮ 3310

సీ. స్థిరజీవులై మహా♦త్తరబుద్ధిమంతులై చెలఁగుమహర్షులు ♦ చిత్రరీతి
సాగునాయజ్ఞంబు ♦ చక్కఁగఁ గన్గొని మున్నెప్పు డీయజ్ఞ♦మునకు సాటి
యగునశ్వమేధంబు ♦ నవని సాగఁగలేదు నిశ్చయం బని పల్కి ♦ నెమ్మి నందె
యుండిరి; కనకంబు ♦ నొందఁగాఁ గోరిన నది యబ్బు, విత్తార్థి♦యైన ధనము

తే. దొరకు, రత్నార్థియైనచో ♦ వరమణులను
బొందు, రజతంబు గోరిన ♦ నొందు దాని,
సద్మములు వేడ నయ్యె వా♦క్షణమునందె
పొందు, వస్త్రమ్ము లడిగినఁ ♦ జెందు వాని. ౧౯॥ 3311

క. అనిశం బిచ్చుటకై పో,సినవస్తుప్రతతి గొప్ప ♦ శిఖరివలెం గా
ననగున్; సురనాథాంతక,ధనదాపోనాథయజ్ఞ♦తతులన్ గనమే?. ౨౦॥ 3312

తే. దీని కవ్వి సమాన మే♦తీఱున నగు?,నంచు మానులుదలఁచిరి;♦హరులు దనుజు
లర్థులకు వస్త్రధనముల ♦ నన్నమును ద,గంగసంపూర్ణహస్తులై ♦పొంగు వేడ్క.

క. మన మలర నొసఁగుచుండిరి;, జనపాలకసింహుఁడగుచు ♦ శత్రుభయదుఁడై
వినుతగుణాకరుఁడగు రా,మునియజ్ఞ మ్మొక్కవర్ష♦ముగఁ గొనసాగెన్. ౨౧

తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౯౩ - వ సర్గము.

{ కుశలవులతో వాల్మీకి యశ్వమేధముఁ జూడఁ బోయి వారిచే రామాయణమును బాడించుట. }

చ. జనపతిపుంగవుండు రఘు♦సత్తముఁ డీకరణిన్ మహాద్భుతం
బనుపమ ముత్తమంబువగు ♦ నధ్వర మాదృతిఁ జేయుచుండ శి
ష్యనికరసేవితుండు ముని♦సత్తముఁ డాదికవీంద్రుఁ డద్ది చూ
చు నెలమి వచ్చె; దివ్యమయి ♦ చూడఁగ నద్భుతమైనదానిసిన్. ౧॥ 3315

క. కనుఁగొని వాల్మీకియు నె,మ్మనమున నానంద మంది ♦ మఖవాటముచెం
తను బర్ణశాల నిర్మిం,చెను శిష్యులతోడ నటవ♦సించెను వేడ్కన్. ౨ 3316

చ. పరమమునీంద్రుఁ డచ్చటనె ♦ బ్రాహ్మణమానిగణావృతుండునై
ధరణిపపూజితుండునయి ♦ తా వసియింపఁగ రాజపుత్రకుల్
త్వరపడి యన్నమూలఫల♦వైభవయుక్తములైన బండ్లని
ల్పిరి మునిధానమందు; ముని♦పేరుఁడు మంజుల తేజుఁ డాదృతిన్. ౩॥ 3317

క. రేపటిప్రభాత మాదిగ, నేపట్టున నేని శ్రద్ధ యే యాఁతగ నా
భూపాలునికథఁ బాడుం, డేపద్ధతి నే వచింప నెలమి వినితిరో. ౧౬ 3327

తే. అట్లు తంత్రీలయాన్వితం బై మనోజ్ఞ
మైన రామాయణంబు నయ్యమునఁ బాడుఁ
డనుచు బహుళభంగులం బల్కి యా మునీంద్రుఁ
డమలచిత్తుండు మౌనంబు నాశ్రయించె. ౧౭ 3328

క. జనకసుతాతనయుల నా, ముని యుపదేశించినట్లు భూపతి యజ్ఞం
బొనరించెడు చోటికిఁ జయ్యనఁ బోయిరి; *శత్రుహరణులో నాసహజుల్.

చ. చని యిటు లాసహోదరులు సన్ముని చెప్పిన కాంతమంగళం
బును నొడఁ గూర్చుభాషలను బొంకముగా వచియించి రశ్వినుల్
ఘనుఁడగు భార్గవుం డెలమిగాఁ దెలుపన్ గ్రహియించినట్టు లా
మునిపతివాస మందె సుఖముల్ దగ నిద్దురఁ బొందుచున్ నిశన్. ౧౯

తొంబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౯౪ - వ సర్గము.

కుశలవులు గానము చేయ రామాయణమును శ్రీరాముఁ డాకర్ణించుట.

క. తెలతెలవేగినఁ గృత్యం,బులఁ దీర్చి కుశుండు లవుఁడు పూజితసుహుతో
జ్జ్వలవహ్నియట్లు వెలుఁగుచు, నెలమిన్ మునిపంచినట్టులే తద్గాథన్. ౧

క. సురుచిరగతిఁ బాడిరి; భూ,వరమౌళియుఁ బూర్వమౌనివరనిర్మితమై
సరసంబై పఠనార్హ,స్వరసంయుతమై మనోజ్ఞసరణి వెలయుచున్. ౨

ఉ. గానము చేయఁగాఁ దగి నికామముదం బొనఁగూర్పఁ జాలి తం
త్రీనియుతిం దనర్చి లయరీతిని బొల్చి ప్రమాణబద్ధమై
మానసపద్మముం జెలఁగుమాడ్కి నొనర్చెడుగాథ దాని నా
మౌనిమహేంద్రుశిష్యు లనుమానము లేకయె పాడుచుండఁగన్. ౩ 3333

క. వినియెన్ రాముఁడు చక్కఁగ, మన మానందాంబురాశిమగ్నం బగుటన్
జనపతి యజ్ఞాంతంబున, మునివరులం బౌరవరుల భూపతివరులన్. ౪ 3334

క. సరసమతులైన సూర్యు,త్కరమును బౌరాణికులను క్ష్మాసురవృద్ధో
త్కరమును వ్యాకరణజ్ఞుల, స్వరలక్షణవేత్తలయిన సాధుద్విజులన్. ౫

సీ. లక్షణవేత్తలై లయవిదుల్ గా నొప్పు గాంధర్వులం బౌరగణమునందుఁ
బెద్దలౌ వారలఁ దద్దయు నేర్పుచేఁ బాదాక్షరసమాసపద్ధతులను
జక్క నెఱింగిన చతురుల సిద్ధాంతులను క్రియాకల్పంబులను దెలిసిన
వారల సాధుకావ్యములందుఁ బాండితిఁ దగినవారల భాషతత్త్వమెఱుఁగు

* నిర్జగత్తు దరిందమా-అనిమ్మా.

తే. వారి నింగితవేత్తలో♦వారి హేతువాదులో వారి నాచార♦పరతఁ గనిన
వారి వచనంబులందు నే♦ర్పరులుగాఁగ, ఛందసు వారిని ఛందస్సు♦తత్త్వవిదుల.

క. *పలువిధములో పురాణం,బుల నెఱిఁగినవారి వేద♦ములఁ బఠియింపం
గలవారిఁ జిత్రకర్మం,బుల నెఱిఁగినవారి వృత్త♦ముల సూత్రములన్. ౯

తే. చక్క నెఱిఁగిన ప్రౌఢుల♦శాస్త్రవిదుల, నీతివేత్తల వేదాంత♦రీతి నెఱుఁగు
పండితులఁ దత్ప్రబోధన♦పరులు నైన, జ్ఞానులన్ బిల్వఁగాఁ బంచి♦సభను జేర్చి.

క. బాలుర గాయకవరులను, శీలురఁ బిల్వంగఁ బంచె♦సిద్ధమునులు భూ
పాలురు వారలపాటల, నాలించి తదీయరూప♦మాధృతిఁ గనుచున్. ౧౦

క. కనులం ద్రావెడుపోలిక, జనపతినిన్ బాలకులను♦ జక్కఁగ మఱియున్
గని యిట్లు చెప్పుకొని రొ,క్కని కొక్కరు తత్సభన్ ద♦గన్ మధురోక్తిన్.

చ. ఇరువురు వీర లీక్షితిప♦హేంద్రుని రాముని జూచినట్టులే
వరిసఁ గనంగఁ గానంబడుచుఁ♦ జక్కనిరూపున నున్నవార లీ
యిరువురు సోదరుల్ జటల♦నే ధరియింపక చాయసక్కలాం
బరములఁ గట్టకున్న రఘు♦వర్యుఁడు వీడన యట్టిరీతినన్. ౧౨ 3341

క. కనఁబడుదురు భేదం బే, మని చెప్పఁగ వచ్చు? వీరి♦ నరయఁగ బింబం
బునుండి బింబ మునయిం,చినరీతిగ రామునుండి♦ చెలఁగినరీతిన్. ౧౪

క. పరికింప నాటకం బీ, వరుసను శ్రుతిహితముగాఁగఁ♦ బలుకుచునుండన్
ఇరువురు మునిశిష్యులు రఘు,వరుగాథను దివ్యభణితిఁ♦ బాడఁగఁ బూనన్.

క. అతిమానుషగాంధర్వం, బతిమధురం బగుచు నప్పు♦డలరె; నచట నం
స్థితిఁ గన్న శ్రోత లెవ్వా, రతిమానుషగానమును స♦మాధృతి వినుచున్.

క. పొందగు నంత్యప్తి నదే, చందంబున; నంత మొదటి♦సర్గము మునిరా
డ్బృందారకుఁడౌ నారదుఁ, డందంబుగఁ జెప్పెఁ బూర్వ♦ మద్దిమొదలుగన్.

తే. పాడఁ జొచ్చిరి వాల్మీకి♦పల్కినట్టు
లిరువదియొ సర్గ లాదిగ♦ మొదటఁ బూర్తి
యైన పవరాహ్ణమున రాముఁ♦డాదరమునఁ
బల్కె వింశతిసర్గసం♦భవముదమున. ౧౬ 3346

క. కొనుఁడీ పదునెనిమిదివే, లని లెక్కింపంగఁ బడిన♦ హాటకముల నో
మునిశిష్యులార! యింకే, మనమునఁ గలదేని వాంఛ♦ మానక చెపుఁడీ!.

క. అని యడిగి వీరి శిష్యుని, యనుబన్నునితోడఁ బలుక♦ నాలత్మణుఁ డా

* ఛందోవిదః పురాణజ్ఞాన్-అనియూ. ఇంతకుముం దైదవ శ్లోకమునందు పౌరాణికాంశ్చబ్ద విదః-అనియున్నది. పౌరాణికు లనఁగాఁ బురాణమునందలి యర్థమును జెప్పువారనియు, పురాణజ్ఞాన్-అనఁగాఁ బురాణముల నెఱింగినవారనియు గ్రహింపనగు.

కనకముల వేయువేయుగ, ఘనమోదం బంది యీయఁ♦గా నానహాజుల్. ౧౯

చ. కనుఁగొని యానువర్ణముల ♦ గాఢతరంబగు విస్మయంబునుం
గని గ్రహియింప కిట్లనిరి; ♦ కాననవానుల మేము మూలముల్
వనముననున్న పండ్లు దిను♦వారము హాటక మిద్ది యేల? యే
పనికి వ్యయించువార మని ♦ పల్కినమాటల నానభాసదుల్. ౨౦ 3349

సీ. కౌతూహలమునఁ జ♦క్కఁగ నాలకించుచు విస్మయం బొందిరి ♦ విభుఁడు నట్టి
యాశ్చర్యరసమగ్నుఁ ♦ డయ్యె; నంతట రాముఁ డానహాజన్ముల♦నాదృతిఁ గని
కావ్యసంశ్రవణని♦కామమోదంబున వారియాగమనంబు ♦ భూరి తేజ
మలరఁగాఁ బ్రశ్నించె; ♦ నర్భకులార! యీకావ్యప్రమాణసం♦ఖ్యయది యెంత

తే. యెంతవఱ కిందునం గథ ♦ యెఱుఁగనగును?
గర్త యెవ్వండొ యీభూరి♦కావ్యమునకు
నమ్మహాముని యెందుండు? ♦ ననిన రాము
పలుకు లాలించి వారలు ♦ పలికి రిట్లు. ౨౧ 3350

క. మునిపతి వాల్మీకియె యీ, ఘనకావ్యంబునకుఁ గర్త ♦ కమ్రచరిత మె
ల్లను దీని మీకుఁ దెల్పం, జనునని మాకాజ్ఞఁ జేసె ♦ సన్ముని యతఁడే. ౨౨

క. క్రతుశాలచెంత నున్నాఁ, డతులితతేజుం డతండె ♦ యాదృతి నెందుం
బ్రతిలేని యిట్టికావ్యము, మతివిభవ మ్మలరఁ జేసె ♦ క్ష్మాపాలవరా!. ౨౩

క. ఇరువదినాలుగువే లని, పరిగణితము శ్లోకసంఖ్య ♦ [1]భార్గవుఁడు మునీ
శ్వరుఁడగు వాల్మీకియె భూ,వర! సర్గంబులను [2]నైదు♦వందలు గాఁగన్. ౨౪

ఆ. [3]పరమనియతిఁ జేసెఁ ♦ బరఁగు నుపాఖ్యాన,శతము కాండములిట♦షట్సంఖ్య
వెలయు నేడవదిగ ♦ వితతమౌ నుత్తర,కాండ మిలునిచరిత ♦ కడపటి దగు.

క. ఒనరించె నీరీతిగ నా, మునిపతి మాగురువు చరిత♦ము భవత్కథ ను
మ్మనఘా! యీకావ్యశ్వరు, ఘనచరిత మ్మిందుఁ జక్కఁ♦గా నలరారున్. ౨౬

ఆ. జీవితంబునందుఁ ♦ జెలఁగుశుభాశుభ, మిందు వర్ణితంబు ♦ సుందరముగ;
నోమహారథా! మ♦హోజ్జ్వలవిక్రమా!, దీని వినఁగఁ గోర్కిఁ ♦ బూనుదేని.

క. మనుజేంద్ర! యశ్వమేధం,బు ననంతరమందు సుఖముఁ ♦ బొందుసమయమం
దునఁ దమ్ములతోఁ జక్కఁగ, వినఁ దగు నన రాఘవుండు ♦ విని యానుడులన్.

క. వినిసల్లి చేయఁ దగునం,చని వారలఁ బోవఁ బంచె ♦ ననుజులు మోదం
బున వాల్మీకి మహాముని, గనఁబోయిరి; రాముఁ డంత ♦ క్ష్మాసురయుతుఁడై.

క. గురుబుద్ధులైన క్షత్రియ,వరులం దాఁ గూడి యజ్ఞ♦వాటంబున కా
దరమునఁ దద్గానమనో,హారతకు సంతోషపడుచు ♦ నరిగె సుముఖుఁడై. ౩౦

---

1 భార్గవేణ తపస్వినా-అనిమా. 2 పంచసర్గశతానిచ-అనిమా. 3 ఉపాఖ్యానశతంచైవ-అనిమా. ఉపాఖ్యానశత మిలోపాఖ్యానాంతమ్-అనివ్యాఖ్య.

ఆ. తాళలయల మిగులఁ • దనరి సప్తస్వరశబ్ద,యుక్తనుగుచు సర్గ•యుక్తి నొప్పి
తంత్రీలయలఁ జక్కఁ • దగి వ్యంజనాన్విత,మైన దాని వినియె•నవనివిభుఁడు.

తొంబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౯౫ - వ సర్గము.

{ రాముఁడు రామాయణమును విని కుశలవులఁ దనకొడుకులనుగా నెఱిఁగి సీత సభలో శపథముచేయునట్లు చేయుమని వాల్మీకిం బ్రార్థించుట. }

మ. జననాథుం డిటు లద్భుతంబయిన యా•సంగీత మత్యాద్యవృత్తిన్
వినుచున్ జాలదినంబులం గడపెఁ బృ•థ్వీనాథుండొకో గూడి యా
తనిసామంతులు వానరుల్ విని ప్రమో•దం బొంది; రారాముఁ డా
తనయద్వంద్వముతల్లి సీత యని గీ•తం బందె యెంచెన్ మదిన్. ౧౺ 3361

మ. పరిమన్మధ్యమునందు సీతసుతులే • వా రంచుఁ దా నెంచి యా
సరణిన్ బల్కెను; [బిన్నతమ్ము రిపుసం•ఘాతాంతకున్ భావనన్
వరధర్మజ్ఞు విభీషణున్ బగులఁ జం•పం జాలి విఖ్యాతుఁడై
ధరణిం బొల్చు సుషేణుఁ గాంచి] ముద విం•శం బొంది యాలింపఁగన్. 3

క. పరిశుద్ధచరితుల భూ,వరభక్తులు దూతలన్ జ•నంబునఁ బిల్వం
బరిజనులఁ బంపి వారలు, త్వరపడి రా నిట్టులనియె • వాంఛ చెలంగన్. 3౺

చ. నిరుపమబుద్ధియై తగి ము•నిప్రవరుండయి కావ్యకర్తయై
పరఁగెడు వాల్మీకిం గనుచుఁ • బల్కుఁడి నే నని నాదుపల్కుగాఁ
బరహితతత్పరా! దివిజ•వారము మెచ్చఁగఁ జాలు సీత నా
తరుణిని బిల్వఁబంపుఁ డని • తన్నయ భక్తిని బల్కుఁగాఁ దగున్. ౪ 3364

క. పరిశుద్ధవర్తనంబున, విరహితపాపముగ దాను • వెలయుననేనిన్
బరిషత్తున నిట మానీ,శ్వరునానతి సీత తపదు • స్వాంతవిశుద్ధిన్. ౪౺ 3365

ఆ. పలుకుఁ గాక; మానీ•పరమేశుఁ డేమాట, కేమిపలుకు సీత • యింగితం బ
ఱుట్టులుండు దాని • నెఱిఁగి వేగను తెల్పుఁ, డల్లి జనకపుత్రి • యెల్లరు విన.

సీ. పరిషత్తునందును శ•పథముఁ బల్కంగాక తనయాత్మశుద్ధి సం•దలు నెఱుఁగ
నాయాశయముఁ దీర్ప • నన రామునానతి దెలుపున వాక్యంబు • తేటపడఁగ
నాలించి యద్భుతం • బంది యాదూతలు చని రెందు వాల్మీకి•ముని వసించు
పర్ణశాలకు • నరిగి మహాత్మునిఁ బ్రదీప్యమానాభను•భాతి నొప్పు

తే. నామునిం గని ప్రణమిల్లి • యతిమృదుతను
మధురతను గాంచు రాముని•మాట లెల్ల
భక్తి విజ్ఞప్తిఁ జేసి; రా•బ్రహ్మమౌని
భూరితేజోవిరాజిత•మూర్తి వినుచు. ౧౦౺ 3367

క. *రామునిమనోగతంబును, దా మది నూహించి సువిహి♦తంబుగఁ బలికెన్;
భూమీశునాజ్ఞరీతిగ, నామె వచించున్ శుభంబు ♦ నగు మీకెల్లన్. ౧౨

క. వనితలకుఁ బతియె దైవం, బనుటయె తథ్యంబు గాన ♦ నట్లె జరగు నీ
పనియన వేగముగల యా, జననాయకుదూత లరిగి ♦ సభ శ్రీరామున్.

క. కని మనవి చేసి రాఘున,మునివాక్యము లెల్ల నంత ♦ మోదంబున నా
జనపతి కాకుత్థ్సుఁడు విని, మునివర్యుని నెన్ని యచటి ♦ మునుల నృపతులన్.

క. పరికించి పలికె రేపే, ధరణీసుత శపథ మిందుఁ ♦ దాఁ జేయు మునీ
శ్వరు లెల్ల శిష్యయుతులై, నరపతు లనుచరులఁ గూడి ♦ నాతిప్రతిజ్ఞన్.

క. వినుదురు గాక సు తెవ్వరు, జనకాత్మజ చేయఁబోవు ♦ శపథంబు వినం
గను గోరువారో వారలు, చనుదెంతురు గాక విగత♦సంశయు లగుచున్.

చ. అని యిటు లామహాత్ముఁడు ధ♦రాధిపుఁ డాడిన నెల్లమానులున్
విని యది మేలుమే లనుచు ♦ విశ్రుతనాదముతోడఁ బల్కి; రా
జనపతు లారఘూత్తముని ♦ సన్నుతిఁ జేసిరి సద్గుణంబు లి
ట్లనఘము లెల్ల నీమనసు♦నందె యొసంగె నటంచు మెచ్చుచున్. ౧౬ 3373

క. పలికిరి; తరువాత మహీ,శలలాముఁడు రాఘవుండు ♦ జానకి రేపే
తొలిజామున శపథంబును, బలికెడు నని వారి నెల్లఁ ♦ బంపె వసతికిన్. ౧౭

చ. అని యిటు లారఘూత్తముఁ డ♦హార్యతరక్రతుకర్త రాడ్విభుం
డనుపమబుద్ధిశాలి జన♦కాత్మజ చేయు ప్రతిజ్ఞ రేపె యా
నని తెలియంగఁ బల్కి సుమ♦హాత్ముల మానుల రాజముఖ్యులన్
బనిచె నివాసశాలలకు ♦ స్వాంతమునం గల కోర్కి పొంగఁగన్. ౧౮ 3375

తొంబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౯౬ - వ సర్గము.

{ వాల్మీకి సీతతోఁ గూడి సభకు వచ్చి కుశలవులు సీతసుతులగుటం దెలిపి శపథము చేయ ననుజ్ఞ యిమ్మని ప్రార్థించుట. }

క. ఆరాత్రి గడువ నుదితుం,డై రవి యలరార రఘువ♦రాన్వయతిలకుం
డౌ రాముఁడు క్రతువాటము, చేరం జని తేజ మలర ♦ సిద్ధమునితతిన్. ౧

క. పిలువంగఁ బంచె నంతట, నలఘుతరఖ్యాతినలరు ♦ నట్టి వసిష్ఠుం
డలకాశ్యపజాబాలులు, ఖలహారులగు వాసుదేవ♦కౌశికమునులున్. ౨ 3377

తే. దీర్ఘతపుఁడు దుర్వాసుండు ♦ దివ్యతేజుఁ
డగుపులస్త్యుఁడు భార్గవుఁ ♦ డతులకీర్తి

---

* ఏవం భవతు భద్రం వో. యథా వదతి రాఘవః-ఆనిమూ.

శాలి మార్కండేయుం డట్టులె ♦ శక్తి నాను
నావ్యాయులును మార్కండేయుం ♦ డఖిలవేత్త. ౭ 3378

సీ. గర్గుండు చ్యవనుండు ♦ ఘనుఁడు శతానందుఁ డా భరద్వాజుండు ♦ నగ్నిపుత్త్రుఁ
డగు సుప్రభుండు మ♦హాత్ములౌ నారద పర్వతుల్ గౌతమ♦పరమమౌని
కాత్యాయనుండు న♦గస్త్యసుయజ్ఞులు నింకను మహితులై ♦ యెనఁగుమాను
లత్యంతమాహాత్మ్యు ♦ లరుదెంచి రెంతయు బలపరాక్రమములఁ ♦ బ్రబలులైన

తే. వనచరానును లావార్త ♦ వినెడుతలఁచి, వచ్చి; రెల్లరుక్షత్త్రియ♦వైశ్యశూద్రు
లల్లి వేలకు వేలుగా ♦ నఖిలదేశ,వాను లరుదెంచి రాసీత ♦ వచ్చుననుచు.

క. ధరణీసుతు లావృతిమై, నరుదెంచిరి జ్ఞాననిష్ఠు♦లై కర్మరతిం
బరఁగిన కోవిదు లెల్లను, ధరణీసుతశపథము విను♦తమి పైకొనఁగన్. ౯

క. చనుదెంచి పర్వతము నిల్చినగతి నిశ్చలముగాఁగ ♦ జేరి సభను జ
నఘనిరీతిఁ గూరుచుండుట, విని యావార్తను మహర్షి ♦వీరుఁడు కడఁకన్. ౧౦

ఉ. జానకితోడ వచ్చె; ముని♦సత్తము వెంబడి మోము వంచి యా
మానిని దోసిలొగ్గి రఘు♦మండను రాముని ప్రాణనాయకున్
మానసమందు నెంచుచు న♦మానుమతి క్రిఁ జెలంగియున్ గళ
స్థానము బాష్పరుద్ధమయి ♦ చాలఁ గృశత్వము నొంద వచ్చెఁ దాన్. ౧౧

క. వనజానను వెంబడిగాఁ, జనుదెంచెడు శ్రుతివిధమున ♦ నమ్ముని వాల్మీ
కిని వెన్కొని వచ్చిన యా, జనకజఁ గని యెల్లవారు ♦ సంతోషమునన్.

తే. మేలు మేలని పొగడిరి; ♦ చాలదుఃఖ
వివశమతులౌచు జను లెల్ల ♦ విహ్వలించి
యక్కటా యని యార్వంగ ♦ నారవంబు
దెనల వ్యాపించె; నంత జ♦నసమితి నట. ౧౩ 3384

క. రాముని గొందఱు మెచ్చిరి, భూమిజ నుతియించి రందుఁ ♦ బొక్కుజనులలో
ధీమంతులు కొందఱు మఱి, యామాడ్కిన్ రాము సీత ♦ నఖిలస్తుతులన్.

క. తనిపిరి కొందఱు శోకంబునఁ గుందిరి కొంద ఱందు; ♦ బుధనుతుఁడు సభా
జనముల నడుమన్ జానకి, వెనువెంటన్ రాఁగఁ జొచ్చి ♦ వీరుని రామున్.

క. కని యిట్లనియె గభీరధ్వని యలరఁగ రామచంద్ర! ♦ ధరణీనుత సా
ధునుతచరిత్ర త్వదంగన, జనాపవాదమున నీవు ♦ శంకితమతివై. ౧౬ 3387

చ. వనముల నుండఁ బంప ముని♦వర్ణితశీలయు నాదునాశ్రమం
బునకు సమీపభాగమున ♦ భూరిలతావృతకాననాంతరం
బున విడనాడి లక్ష్మణుఁడు ♦ పోయిన నయ్యెడ నుండె, నుల్లస
ద్గుణనయశ! రామచంద్ర! త్రిజ♦గత్ప్రియకృత్యమహావరా! విభూ!. ౧౭

క. లోకాపవాదసాధ్వస, మీాకరణిం బొందినాఁడ ♦ వీట్టి యనఘు ని
న్నీకాంతామణి సంశయ, మేకరణిని బొందకుండ ♦ నిత్తరుణమునన్. ౧౬½
క. శపథ మొనర్చెదుఁ గావున, నృపవర్య! యనుజ్ఞ యి మ్మ♦హీనబలమునన్
రిపుకులనాశనశక్తిని, వ్యపగతపాపమున మిగుల ♦ వఱలెదుతనయుల్. ౧౭
[1]తే. వీర లిరువురు కవలు దు♦ర్వారవైరి,గర్వనిర్వాపణాంచద♦ఖండశక్తి
రాజితులు జానకీదేవి♦రమ్యగర్భ,భవులు నీపుత్రకులు సుమ్ము ♦ పార్థివేంద్ర!.
చ. ఋత మిది నీదుప్రోల వివ♦రించితి; నేను బ్రచేతసుం డనన్
క్షితిని బ్రసిద్ధుఁడైన ముని♦జిష్ణునకుం దశమాత్మజుండ నూ
నృతము వచింతుఁ గాని మది ♦ నెప్పుడు నే ననృతంబు నెన్న నీ
సుతులు భవత్తనూజులు వి♦శుద్ధమతుల్ సుగుణాఢ్యు లుత్తముల్. ౧౯ 3392
[2]తే. పెక్కు వర్షసహస్రముల్ ♦ పృథుతపంబుఁ
జేసినాఁడను గాన నీ♦సీతయందు
దోస మిసుమంత యున్నచో ♦ నాసమస్త
సత్తపఃఫల మెల్ల ని♦ష్ఫలమె యగును. ౨౦ 3393
ఉ. జానకి శూన్యపాపయయి ♦ సాధుచరిత్రయె యయ్యెనేని నే
మానితరీతి వాక్కునను ♦ మానసకాయయుతిన్ బ్రశస్తినిం
గానఁగఁ జేసియున్న యన♦ఘంబగు సాధుతపఃఫలంబు న
న్నూనును గాక జానకియె ♦ యొప్పునిదైన గడంగెడుం జుమీా. ౨౧ 3394
క. విను మనసు మష్ఠమంబుగఁ, దనరిన పంచేంద్రియములఁ ♦ దగ నెంచియె సీ
తను వననిర్ఝరసీమను, గనఁబడఁగ విశుద్ధ యనియె ♦ గ్రహియించితిఁజూ. ౨౨
క. పరిశుద్ధ సాధువర్తన, విరహితపాపయును శుద్ధ♦వితతమతియునౌ
ధరణీశ! భర్తృదైవత, ధరణీసుత యీామె సూనృ♦తం బిదియైనన్. ౨౨½
క. జనుల యపవాదభీతిం, గనినట్టి భవత్సమీాప♦గతభూమిని నీ
మనమునకుఁ బ్రత్యయంబును, గనుపట్టఁగఁ జేయఁ బల్కుఁ♦గలదు శపథమున్.
తే. తా మహాభాగ యయ్యు ను♦త్తమయు నయ్యు
భర్తృవ్రతము ననుష్ఠింపఁ ♦ బరమముదముఁ
బొందినది గాన నీ వన్న ♦ పోల్కి శపథ
మొనరుచున్ రాఘవా! సత్య♦మునె దలంచి. ౨౩½ 3398
[3]చ. ధరణిప! శుద్ధభావమునఁ ♦ దాను జెలంగియు దివ్యదృష్టిచేఁ
బరఁగిన నేను జెప్ప జన♦వాదభయంబున నాకులాత్మయె

---

1 ఇమౌ తు జానకీపుత్రౌ వుభౌ చ యమజాతకౌ, సుతౌ తవైవ దుర్ధర్షౌ సత్య మేత ద్బ్రవీమి తే-అనిమూ. 2 బహువర్ష సహస్రాణి తపశ్చర్యా మయా కృతా, నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ-అనిమూ. 3 తస్తా ధియం నరవరాత్మజ శుద్ధభావా దివ్యేన దృష్టివిషయేణ

బరమపతివ్రతాత్వమున ♦ భాసిలు నంచు నెఱింగి నీవు భీ
కరవనసీమకుం బనుపఁ♦గా నట నున్నది నాదుచెంగటన్. ౨౮౫ 3399

తొంబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౯౭ - వ సర్గము.

{ శ్రీరాముఁడు లోకాపవాదమునకై శపథము సీతచేఁ జేయింపవలయునని వాల్మీకిని బ్రార్థించుట. }

క. అని యిటు వాల్మీకి వచించిన రాముఁడు దోసిలొగ్గి ♦ సీతను గీర్తిం
చని వెలయు దాని సభలోఁ, గని యిట్లని పలికె సాధు♦గంభీరోక్తిన్. ౧ 3400

చ. నిరతము ధర్మపద్ధతుల ♦ నేర్పుచు బ్రహ్మవిదుత్తముండు నా
ధరణిఁ బ్రసిద్ధిఁ గాంచి మహి♦తంబగు యోగరతిం జెలంగు నో
వరమునినీంద్ర! నీవగు న♦పాపపుఁ బల్కులఁ బ్రత్యయంబు సు
స్థిరముగ నామదిం దనరు; ♦ సీతయు మున్నమరాళినన్నిధిన్. ౨ 3401

క. మనమున నాకుం బ్రత్యయ,మును నగ్నిఁ బ్రతిజ్ఞ చేసె ♦ మునివర! యటు గా
వున నింటికిఁ గొనివచ్చితి, జనాపవాదంబు మిగుల ♦ జుమఁ బ్రబలుటచేన్.

క. జానకి విడనాడితి; నో,మౌనివరా! లోకభీతి♦మైఁ గలుషంబున్
లేనిది యని మది నెఱిఁగియుఁ, గానలకుం బంచినాఁడఁ ♦ గావున మీరల్.

క. సైరింపవలయు నేనీ,నారి నుపేక్షపూర్వకముగ ♦ జానకియెడలన్
భూరితరంబుగఁ జేసిన, ఘోరవహీనంపు నింద ♦ జ్ఞానురమౌనీ!. ౮౫ 3404

క. కవలగు నీతనయులఁ గుశ,లవులను నాతనయు లనుచు ♦ లలి నెఱుఁగుదు;మౌ
నివరా! యీసభ నడుమను, బ్రవిమలహృదయాబ్జ సీత ♦ ప్రతిన యొనరుపన్.

క. మనమున నాకుం బ్రత్యయ,ము నెగడున ట్లొనరుపంగ ♦ మునివర! తలఁపం
జను; నన రామునియాశయ,ము నెఱిఁగినురనత్తములు ప్ర♦మోదహృదయులై.

క. వనజాసను ముం దిడుకొని, చనుదెంచిరి తేజ మలర ♦ శక్రాదులు త
జ్జనకజ శపథము చేయన్, విను వేడుక యలర వారి♦వెంటన్ వసువుల్. ౭

సీ. ఆదిత్యులును రుద్రు ♦ లశ్విదేవతలును గంధర్వులును మరు♦ద్గణము లచ్చ
రలు సాధ్యు లనెడుని♦ర్జరులు విశ్వేదేవతలు దేవమౌనులు ♦ లలితనాగు
లట్టులె గరుడులు ♦ ననుపమయుతమున నలరుసిద్ధులు హర్ష♦మొలయ సీత
శపథంబు వినఁగోరి ♦ చనుదెంచి రంత; నాపాలు రాకను ♦ వరుసఁ గాంచి

తే. సురలు మౌనులు వచ్చుటఁ ♦ జోద్య మంది
మరలఁ బల్కెను శ్రీరఘు♦మండనుండు;

---

మయా ప్రవిష్టా, లోకాపవాదకలుషీకృతచేతసా యా త్యక్తా త్వయా, ప్రియతమా విదితాఽపి
శుద్ధా-అనియూ.

దేవవరులార! మునులార! ♦ దివ్యమాని
పాపనోక్తులచేఁ గల్గెఁ ♦ బ్రత్యయంబు. ౧౦౹ 3408

క. ఐనను హాయమేధంబున, మౌనిముఖుల్ గూడియున్న ♦ మహితసభను సీ
జానకి శుద్ధయె యని నా,మానసమునఁ దోఁచుఁ గాక ♦ మరల పృథముగన్.

చ. అని రఘునాయకుం డనఁగ ♦ నల్లన మంగళదివ్యభూరివా
సనలు చెలంగఁగాఁ ద్రిదశ♦సత్తముఁడౌ పవనుండు నెల్లెడన్
జనములు మోఁద మొందునటు ♦ సంచరణం బొనరించె నందు; నా
యనిలునితాఁకు నొంది జను ♦ లద్భుత మిద్ది యచింత్యమం చొగిన్. ౧౨౹

క. తలఁచిరి బహువిధరాష్ట్రం,బులనుండి జనవ్రజంబు ♦ మును కృతయుగమం
దలఘుగతిన్ వచ్చెడునటు, వెలసిరి వారెల్ల నట్లు ♦ వింతగఁ గూడన్. ౧౩

క. కని సభ నొకపర్యాయము, జనకజయుఁ దపస్వినులకు ♦ శాస్త్రోక్తముగా
వినుతింపఁబడిన వస్త్రం,బును గాషాయంబుఁ దాల్చి ♦ భూమిని దల్లిన్. ౧౩౹

ఆ. వివర మొసఁగునట్లు ♦ వేఁడ నధోదృష్టి,పొలయఁ జేయుచును వి♦మలముఖంబు
వంచి దోసి లొగ్గి ♦ యంచితభణితి ని, ట్లనియె నెల్ల మనుజు ♦ లాలకింప. ౧౪

సీత సభలో శపథము పలుకుట.

చ *మనమున నెప్పుడేని రఘు♦మండను రాముని దప్ప నన్య నొ
క్కని నయినన్ దలంపకయ ♦ త్స్థాస్థలి నుండినమాట సత్యమే
జననిరో! భూమిదేవి! పతి♦సంగతి వీడిన కష్టముల్ తొలం
గను వివరంబు నాపయిని ♦ గల్గిన ప్రీతిని నిమ్ము వేగమే. ౧౫ 3414

శా. శ్రీరామున్ రఘువర్యు నన్వహము నా♦చిత్తంబునన్ వాక్కులన్
గారాబంబులఁ జేయుకర్మముల ని♦క్కం బీశుఁగా నెంచి నే
నారాధించుట సత్యమేని జను ల♦త్యాశ్చర్య మందంగ నా
శ్రీరాజీవదళాక్షుపత్ని యిడుతన్ ♦ జేయూఁత శ్వభ్రాకృతిన్. ౧౬ 3415

ఉ. రామునికంటె వేఱగు న♦రప్రవరున్ మది నే నెఱుంగ నం
చీమహితస్థలిన్ నిలిచి ♦ యే నిటు పల్కినమాట సత్యమే
భూమి మదీయవాంఛితము ♦ పొల్లుగఁ జేయక తా బిలంబు నెం
తో మమతం జెలంగి యివు ♦ డొప్పుగ నిచ్చెడుఁ గాక యీయెడన్. ౧౭

చ. అని యిటు మూఁడుమాఱులు మ♦హానియతిన్ శపథంబు పల్కి యా
జనకజ యూరకుండ నొక♦చందమునన్ గన నద్భుతంబుగా
ననుపమమై యనుత్తమము♦నై కడుదివ్యమునై చెలంగు నా
సన మొకఁ డుద్భవించె జన♦సంఘము లొక్కటఁ జోద్య మందఁగన్. ౧౮

* యథాహం రాఘవా దన్యం మనసాపి న చింతయే, తథా మే మాధవీ దేవీ వివరం దాతు
మర్హతి-ఆనివా.

## ౯౮ - వ సర్గము.

{ శ్రీరాముఁడు జానకికై శోకించి భూదేవిని భస్మముచేయఁ బూని బ్రహ్మచే నివారింపఁబడుట. }

క. జనకజ యట్లు రసాతలమును జొచ్చుటఁ గాంచి కవులు ♦ మునులును శ్రీరా
మునిసన్నిధి మేత్తేలని,యును, గటకటయంచుఁ బల్కి ♦ యుద్విగ్నులునై. ౧
క. నరపతి యంతట నౌదుం,బరదండం బూఁతగాఁగఁ ♦ బట్టుకొని నిరం
తరబాష్పధార నీక్షణ,సరసిజములు కలఁకఁబాఱ ♦ సన్నధ్వనితోన్. ౧౼
క. మోమును వంచి వ్యథాకుల,మౌ మదితో నింత యనఁగ ♦ ననువుపడని చిం
తామాధ్యంబునఁ దోఁచక, యేమియు ననలేకయుండె ♦ నేడ్పు గదురఁగన్.
మ. చిరకాలం బిటు చింతచేఁ గలఁగుచున్ ♦ జిత్తంబు నిశ్చేష్టతం
బొరయన్ బాష్పము లేకధార లగుచున్ ♦ భూమిం బ్రవేశింప ని
ర్భరశోకంబును గ్రోధముం బెనఁగొనం ♦ బల్కెన్ మహాదీనుఁడై;
భరమై యిప్పు డపూర్వశోక మిది నా♦స్వాంతంబుఁ గుందించెడున్. ౩౼
ఉ. నే నిటు చూచుచుండ ధర♦ణీసుత నాదగు భాగ్యలక్ష్మి నా
జానకి భూమిలో నడఁగెః ♦ సాగరవర్యముఁ దాఁటి మున్ను లం
కానగరంబునన్ దనుజ♦కాంతుని జంపి మహార్తి మున్గు నా
మానినిఁ గంటిఁ బ్రీతిమెయి ♦ మామకదోర్బలశక్తితోడుగన్. ౪౼ 3433
చ. సురలును మానివర్యులును ♦ జూచుచు నుండఁగ నగ్నిశుద్ధయా
తరుణిని నే నయోధ్యకు ని♦తాంతముదంబునఁ దెచ్చుకొంటి నీ
తరుణమునందు నిచ్చటనె ♦ తా నడఁగెం గద సభ్యులార! మీ
రరయుఁడు నాదుశక్తి నిట ♦ నట్టులు పూర్వము నేను బూనికన్. ౫ 3434
ఉ. దానవనేతఁ జంపి వని♦తామణిఁ దెచ్చిన నా కశక్యమే
పూనిక భూమి తోడుకొని♦పోయిన సీత మరల్చుటల్ కనం
గా నిఁక నోధరారమణి ♦ క్రమ్మఱ నాదయితామణిన్ వగం
బూనిన నాదుచిత్తమున ♦ భూరితరక్రుధ పుట్టకుండఁగన్. ౫౼ 3435
మ. మరలం దెచ్చి యొసంగు మిట్టిపనికిన్ ♦ మా అత్తవ్ నీవున్న వి
స్ఫురరోషంబుఁ గనంగఁజేసెదఁ జుమీ ♦ పూర్వంబె నారోషముం
బరమాశ్చర్యము నొంది చూచితివిగా ♦ పంతంబు నీకేల? యో
ధరణీ! యత్తవు నాకు నేమనక క్రో♦ధం బింత వారించితిన్. ౬ 3436
చ. జనకుఁడు నాకు మామ మును ♦ సత్క్రతుకార్యమునన్ హలంబు చేఁ
గొని నిను దున్నుచున్ బడసెఁ ♦ గోమలి సీతను; గాన మేదినీ!
*జనకజ నాకుఁ జూపు మది ♦ శక్యము గాదని తోఁచెనేని న
న్ననువుగఁ ద్రోవఁ జూపి దయి♦తాంతికమున్ వడిఁ జేర్పు మిత్తతిన్. ౬౼

* తస్మాన్నిర్యాత్యతాం సీతా వివరం వా ప్రయచ్ఛ మే-అనిమూ.

ల్గును గాని యీసభాంతర,మునఁ గల్గదు సంగమంబు ♦ మునినుతచరితా!.
క. నాపలుకుజాడ లెఱుఁగుము, యీపరిమన్మథ్యముననె ♦ యీకావ్యమె చూ
నీపావనచరితామృత, మేపారం గ్రోలఁ జేయ ♦ నెనఁగు ననమమై. ౧౭ 3446
క. కావ్యములలోన నుత్తమ,కావ్యంబై వేదసార♦కలితం బగుచున్
భవ్యంబై సాంగముగా, దివ్యకథారసము నెల్లఁ ♦ దెల్పుం జుమ్మీ. ౧౮½
తే. సంశయం బింతయును లేదు ♦ జన్మము మొద
లఖిలసుఖదుఃఖసేవన ♦ మంతముగను
దెలుపుఁ గాఁగల కృత్యముల్ ♦ తెలుపఁదగిన
యుత్తరాహ్వయకాండ మా♦యోగివరుఁడు. ౧౯½ 3448
క. ఒనరించె నాదికావ్యం, బనఘా! యీకావ్యమా స♦మంచితగాథల్
నినుఁ గూర్చియె యలరారెడు, ననుపమతావకయశంబు ♦ నవనిం జాటున్.
తే. కావ్యములలోన నెల్ల రా♦ఘవుఁడు తప్ప
నద్యశంబును బొందఁగాఁ ♦ జాలఁ డెవఁడు
మున్ను తెలిపితి దేవత ♦ లున్నతఙని
నీకు నీవార్త లెల్లను ♦ నేను రామ!. ౨౦ 3450
క. ఇది దివ్య మద్భుతాకృతి, యిది సూనృతవాక్యసంఘ ♦ మిది యజ్ఞానా
స్పదరహితమంచు నెఱుఁగుము, విదితం బీకావ్య మెల్ల ♦ విబుధవినుతమై.
క. పురుషవరేణ్యా! నీవన, నిరుపమధర్మాభినిరతి♦నిం దగు దేవే
శ్వరుఁడవు భవిష్యగాథను, బరమాదృతి మీఱ వినుము ♦ ప్రమదముగల్గున్.
క. అనుపమకీర్తీ! రామా,యణమునఁ దగు శిష్టగాథ ♦ హారితరంబై
తనరెడు నుత్తరకాండం, బనుపేరున; మునులఁ గూడి ♦ యద్దానిఁ దగన్. ౨౧
క. వినవయ్య! భూరితేజా!, యనుత్తమంబైన కథను ♦ నన్యులు దీనిన్
వినఁ దగరు రాజమునివై, తనరారెడు నీవె వినఁగఁ ♦ దగుదువు వీరా!. ౨౩½
చ. అని యిటు లాదృతిం బలికి ♦ యంబుజసంభవుఁ డెల్లలోకసం
జనితసుకీర్తి దేవముని♦సత్తములం గుమిఁగూడి రాఁగ నా
త్మనియుతనాసభూమికి న♦మానుషమూర్తిని రాము నెంచుచుం
జనియెను; యజ్ఞవాటగత♦సాధుమతుల్ మహనీయకీర్తులున్. ౨౪½ 3455
తే. బ్రహ్మలోకార్హులును నగు ♦ పరమహాను, లావిరించిని సెలవీయ ♦ నడిగిమరలి
రాభవిష్యమహాగాథ ♦ నాలకింప,రాముఁ డున్నట్టి యాయధ్వ♦రమున కెలమి.
క. [నిరుపమకీర్తిని జక్కఁగ, ధరణిని నింపంగ నిల్వఁ ♦ దా రొప్పఁగ వ
చ్చిరి; వారివెనుక వసుధాం,తరమున వెలువడియె నొక్క♦ ధ్వని యసదృశమై.
క. రామా సంతాపంబును, నీమెయిఁ బొందంగ నేల? ♦ యిట్టిపనికిఁగా
*నామార్తాండతనూజుఁడె, యామానసకారణంబె ♦ యంచుఁ దలఁపుమా.

* కృతాంతో హ్యత్ర కారణమ్-అనియూ.

క. అనుమానపడక చక్కఁగ, వినిపింపుఁడు గానభణితి ♦ వేడుక నని చె
ప్పిన నంత మహిమచేఁ దగు, మునివర్యులు కూరుచుండ ♦ మోదముపొంగన్.

క. ఉత్తరకాండము కుశలవు, లత్తఱిఁ జక్కంగఁ బాడి; ♦ రంతట రాముం
డుత్తలపాటున జానకి, చిత్తమ్మునఁ దోఁచువగల ♦ క్షితిఁ జొచ్చుటచేన్. ౭౫

క. నూనృతవైభవమునఁ దన, మానన మొప్పంగ సీత ♦ మానక చనె నం
చానృపుఁడు తలఁచి దుఃఖము,చే నెంతయుఁ గలఁగిపూర్తిఁ ♦ జేసెం గ్రతువున్.

క. క్రతుపూర్తిచేసి శ్రీరఘు,పతి సీతను గానలేక ♦ పాడఱినగతిన్
క్షితి యెల్లఁ దోఁపఁగా న,న్మతి శాంతిం బొందక వగ ♦ మానకయుండెన్.

క. నరపతుల నందఱం గపి,వరులను భల్లూకదనుజ ♦ వరులను మనుజో
త్కరముల మర్యాద తగన్, ధరణీపతి పంపె వినయ ♦ ధనుఁడై ప్రీతిన్. ౫౨

తే. ధరణిదివిజుల కెల్ల వి ♦ త్తంబు లొసఁగి
పనిపె; నీరీతి హయమేధ ♦ మును నొనర్చి
విధిని బరిపూర్తి నొందించి ♦ విభుఁడు సర్వ
రాష్ట్రవాసులఁ బంపి వి ♦ శ్రాంతి లేక. ౫౫ 3472

చ. తరుణిని జిత్తసీమ నిడి ♦ తద్గతభావుఁడునై యయోధ్యకుం
ద్వరపడిపోయె వెంబడి సు ♦ తద్వయ మొయ్యన రాఁగ; నిశ్చితా
ర్థ్వరుఁడయి నెమ్మనంబునను ♦ దారను వేఱొకదానిఁ గోర కా
పరమపతివ్రతామణినె ♦ భావమునందు సతంబు నెంచుచున్. ౭౫ 3473

క. ప్రతిసవమున భార్యార్థము, హితకారిణి జనకతనయ ♦ యెప్పగిదిఁ దగున్
బ్రతికృతిఁ గాంచనమున ను,న్నతిమీఱ నొనర్చుకొనుచు ♦ నైజమహిమచేన్.

క. దశవర్ష సహస్రంబులు, దశరథతనయుండు భక్తి ♦ తాత్పర్యములన్
యశ ముర్వి నిండ హయమే,ధశతములను జేసె బహుళ ♦ దక్షిణ లిడుచున్.

సీ. అశ్వమేధముల సం ♦ ఖ్యకుఁ బదిరెట్లుగా బహుదక్షిణాన్విత ♦ వాజపేయ
ముల నొనరించె; ని ♦ మ్ముల గోశతంబుల బహుధనంబులభక్తి ♦ వ్యయ మొనర్చి
కీర్తిని గోరి య ♦ గ్నిష్టోమముల నతిరాత్రంబులం దక్కు ♦ క్రతువరముల
నొనరించె; సిరిచేత ♦ నొప్పునారాఘవుం డిట్టులు మహిమచే ♦ నెసఁగి ధర్మ

తే. తత్పరుండయి క్షత్త్రియ ♦ తల్లజుఁడయి
ధరణిఁ బాలించుచుండంగ ♦ జరగెఁ గాల
మెల్ల కపిరాక్షసులు మహా ♦ భల్లుకములు
రామశాసనమును స్వశి ♦ రములఁ దాల్చి. ౧౧౫ 3476

క. పరిపాలించిరి రాజ్యము, ధరణీశులు ప్రతిదినంబు ♦ ధర్మంబున శ్రీ
కరు రాము మోదమందెడు, కరణిం జేయుచును భూరి ♦ కరుణాత్మకులై. ౧౨

తే. కేకయుండు యుధాజిత్తు ♦ శ్రీకలితుని
నంగిరఃపుత్త్రు, గార్గ్యుని♦మార్షి నమిత
తేజునిం బంపుచో రఘు♦ధీరునకు న
యుతతురంగంబులం బ్రీతి ♦ యొప్పఁచుండ. ౨ 3487

క. వరరత్నకంబళంబుల, సురుచిరచిత్రాంబరముల ♦ శుభతమరత్నా
భరణంబుల నొగిఁ బంపం, గర మనురాగమున వానిఁ ♦ గైకొని మునియున్.

క. అరుదెంచి తనదురాకను, నరపతికిం దెలుపఁగ ముని♦నాథునిరాకన్
బరమాదృతి విని కేకయ,ధరణీశుఁడు మాతులుండు ♦ దయ చెలువారన్. ౩౪

చ. పనిపిన యామహాధనము ♦ భవ్యతురంగముఖ్యవస్తువుల్
విని యనురాగ మొంది రఘు♦వీరుఁడు తమ్ములఁ గూడి క్రోశముం
జని ముని నాతిథేయముల ♦ శక్రుఁడు గీష్పతిఁ బూజచేసిన
ట్లనువుగఁ బూజచేసి యతఁ ♦ డాదృతిఁ జూపినవస్తుసంతతిన్. ౫౪ 3490

క. కని భక్తిని గైకొని య,మ్మునిపతితోఁ గుశలపూర్వ♦ముగ మాతులుఁ గూ
ర్చినవార్త లడిగి యుపవి,ష్టుని ముని గురుతేజు గార్గ్యుఁ ♦ జూచి నృపతియున్.

చ. మునివర! మాతులుండు ప్రియ♦మున్ జెలువారఁగ నేనిమిత్తమై
పనిపెనొ మిమ్ము, దేవగురు♦భంగిని బొల్చెడు మీరు నాగృహం
బున కరుదెంచినంతఁ బరి♦పూతమె యయ్యెను జన్మమన్న; రా
మునిపలు కాలకించి తమి ♦ పొంగఁగ గార్గ్యమునీంద్రుఁ డిట్లనున్. ౭ 3492

సీ. వాగ్విదుత్తమ! రఘు♦వర్య! కార్యమురీతి వినిపింతు మీరామ ♦ విన్నవించి
నట్లుగ; గురుబాహు♦వగు నాయుధాజిత్తు పలికె నీరీతి, న♦ప్పలుకులు విని
యట్లు చేయుము మది ♦ కదిసరిపడినచో; గంధర్వరాజ్య మొ♦క్కండు గలదు
ఫలమూలబహుళమై ♦ పరమశోభనమయి సింధునదీపార్శ్వ♦సీమలందు

తే. వెలయుచుండును యుద్ధకో♦విదులు సాయు
ధులును నగు భూరిగంధర్వ ♦ లెలమి దాని
నేలుచున్నారు వారల ♦ కెల్ల రాజు
తనరు శైలూషుఁ డనువాఁ డు♦దారబలుఁడు. ౧౧ 3493

*చ. తనయులు వానికిం గలరు ♦ దారుణసత్త్వులు మూఁడుకోట్లు భూ
వినుతచరిత్ర! వారలను ♦ విక్రమ మొప్ప జయించి తత్పురం
బును గొని యేలవయ్య! శుభ♦ముల్ దగు దాన మఱొండురీతి నా
జనపద మేలరాదు గురు♦సత్త్వులు వారయి పొల్చుచుండుటన్. ౧౨౪ 3494

క. గురుబాహూ! యీవిషయము, సరియనియే తోఁచెనేని ♦ సాధింపుము నే
నరయ నహితంబు పల్కను, ధరణీశా! యనియె, నన్నఁ ♦ దద్భణితులకున్. ౧౩౪

* శైలూషస్య సుతా వీరా స్త్రిస్రః కోట్యో మహాబలాః-అనిమూ,

తే. హృష్టపుష్టజనావళు ♦ లెసఁగ నున్న
కేకయాహ్వయరాజ్యమ్ము ♦ వీఁకఁ జొచ్చి
యందుఁ దనరారు సంతుష్టి ♦ కాత్మ నలరె
నంత భరతుండు సేనల ♦ కధిపుఁ డగుచు. ౨౯½ 3505

నూటవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౧ - వ సర్గము.

{ భరతుఁడు గంధర్వుల జయించి కొడుకులకు రాజ్యము పంచి యిచ్చి రామునికడకు వచ్చుట. }

క. విని గార్గ్యసహితుఁడై వచ్చిన వార్తల కాత్మ నలరి ♦ సిరులవెలయు నా
జనపతి కేకయనాథుఁడు, మనమున సంతోష మంది ♦ మంత్రియుతుండై. ౧

క. పరివారముతోఁ ద్వరపడి, యరిగెన్ మేనల్లుఁ గూడి ♦ యఖిలబలము ల
చ్చెరువుగఁ దోడనె రాఁగా, నురుతరమాయాబలమున ♦ నొప్పెడురిపులన్.

తే. కామరూపులగంధర్వ♦కాంతులను జ
యించు వేడుక నంతట ♦ నేపుమీఱ
నాయుధాజిత్తుతోఁ గూడి ♦ యభ్భరతుఁడు
విక్రమంబున గంధర్వ♦విషయములకు. ౩ 3508

క. చని బలములతో నగరం,బున కల్లంతననె నిల్వఁ ♦ బొంగి మహోద్యో
ధనకాంక్షులు గంధర్వులు, విని భరతునిరాక భూరి♦వీర్యం బలరన్. ౩½

క. హుంకారంబులను ధను,ష్టంకారంబులను దిశల ♦ శబ్దము గలుగన్
బింకములతోడ మార్కొని, రింకం బోవచ్చు నెచటి ♦ కీతతి ననుచున్. ౪

క. జరగెను దుములంబగు సం,గర మప్పుడు గగురుపాటు ♦ గల్పించుచు భీ
కరరీతిఁ గానఁబడుచున్, బరస్పరజయంబు లేక ♦ బళి యనఁదగుచున్. ౪½

తే. సప్తరాత్రము లీరీతి ♦ జయము లేక
సంగరము చేయుచుండంగ ♦ శక్తిఖడ్గ
చాపములు గ్రాహములు గాఁగ ♦ సతతరక్త
ధార లంబుప్రవాహసం♦తతులు గాఁగ. ౫½ 3512

క. మనుజాంగకములు నదిలోఁ, గనుపట్టెడు వస్తువులుగఁ ♦ గ్రాలునదులు పా
ఱెను సర్వదిశల; నంతట, ఘనబలుఁ డాభరతుఁ డప్డు ♦ కడుఁ గ్రోధమునన్.

చ. ధనువున నంత్యకాలమున ♦ దారుణరీతి జ్వలించు నగ్నియే
తనకధిదైవతంబుగను ♦ దార్కొను నస్త్రముఁ గూర్చి శత్రురా
జిని వధియించు నూహఁ గొని ♦ చెచ్చెఱ మంత్రపురస్సరంబుగాఁ
దనరెడుదాని వైచె నది ♦ తద్రిపుజాతము నాక్షణంబునన్. ౭ 3514

## ౧౦౨ - వ సర్గము.

{ లక్ష్మణతనయులను గారుపథదేశమున నిల్పి రాముఁడు భరతలక్ష్మణులను ప్రయాణమును జేయుట. }

క. తనయత్నము ఫలియించిన, దని తమ్ములతోడఁ గూడి ♦ యామోదంబుం
గని యద్భుతమై పొల్చెడు, ననూనవాగమృత మొప్ప ♦ ననె లక్ష్మణుతోన్.

సీ. నీకుమారులు వీరు ♦ నిఖిలధర్మవిదుత్తములు చంద్రకేత్వంగ♦దులు పటిష్ఠ
విక్రమాఢ్యులు గాఁగ ♦ వెలయుచు నున్నారలటుగాన నభిషేక ♦ మాచరింతు
రాజ్యంబుఁ బాలింప ♦ రమ్యదేశం బొండు నిర్ణయింపుం డది ♦ నెమ్మి నిడఁగఁ
జాలి యసంబాధ♦మై లలి నొప్పనా మనబాలకులనుండి ♦ మనుజపతుల

తే. కేని మున్యాశ్రమంబుల♦ కేని బాధ
కలుగకుండంగవలయు న♦ట్లలరు దేశ
మొకటి తెల్పుండన న్విని ♦ యురుతరంపు
భక్తి భరతుండు నన్నతోఁ ♦ బలికె నిట్లు. ౨ 3527

క. నిరుపద్రవంబు రమ్యము, సరసజనాకీర్ణమునయి ♦ క్షమఁ గ్రాలు మనో
హరవస్తునిబిడమై సాధురతిం దగు కారుపథము♦తో యసమృద్ధిన్. ౩ 3528

క. పుర మాదేశంబున నోధరణీశ్వర! యంగదునకుఁ ♦ దగు నిర్మింపన్
సురుచిరశశికాంతమనోహరనగరము చంద్రకేతు ♦ వను తనయునకున్. ౪

క. ఒనరించి యుందు వారల, ననుపం దగునంచు భరతుఁ ♦ డొప్పుగఁ బల్కన్
విని రాముఁ డద్ది తగినదె, యని తాను గ్రహించి దేశ ♦ మది చారుమతిన్.

తే. చక్క విభజించి యంగదు♦సాధుమతిని,నందునుంచెను,నంగదీ♦యాఖ్యపురము
తన్నివాసమునం బొల్చె ♦ దాశరథియుఁ, బరహితంబగుకృత్యత♦త్పరుఁడుగాన.

ఆ. చంద్రకేతువునకు ♦ శౌర్యధుర్యునకు నిశాంతధర్మమతికిఁ ♦ దగిన దనుచు
మల్లదేశమందు ♦ మహిమచేఁ దగుపుర, మొక్కఁ డూహచేసి♦యునిచె నందు.

క. అది చంద్రకాంతపురమన, విదితంబయి స్వర్గపురికి ♦ వేయిమడుఁగు లొ
ప్పిదమున నధికంబై తగెఁ;, దదనంతర ముల్లములను ♦ దాశరథు లొగిన్. ౯

క. పరమప్రీతిం గాంచిరి, పరదుర్జయు లగుట వారు ♦ పరికించి యనం
తర మభిషేక మొనర్చిరి, వరతనయుల కిర్వురకు స్వ♦భావహితులకున్. ౧౦

క. ఈరీతి నాకుమారుల, శారాముఁడు రాజ్య మొసఁగి ♦ యురుగుం డని పెం
పారం బల్కుచు నంగదు, మారాభునిఁ బశ్చిమంపు♦మహి కరుగంగన్. ౧౧

తే చంద్రకేతువు తద్భాగ♦జనపదమున
కరుగఁ దగువంచుఁ బల్కె; నా♦యంగదునకుఁ
దోడుగా లక్ష్మణుఁడు భర♦తుండు చంద్ర
కేతువునకు సాయముగ నే♦గిరి ముదమున. ౧౨ 3536

ధరణివిభుండు లక్ష్మణుని ♦ తద్వచనంబుల నాలకించి స
త్వరముగ నమ్మహామహుని ♦ ధన్యమునీశ్వరుఁ దోడితెమ్మనన్. ౬ 3547

చ. విని రఘురామసోదరుఁడు ♦ వేగమ పోయి స్వదేహకాంతులన్
గనుఁగొనఁ బ్రజ్వలజ్జ్వలన♦కల్పుఁడుగాఁ దగి లోకమెల్ల నా
కృనిమిషమాత్రఁ గాల్చునటు ♦ క్రాలుమహర్షిని తోడి తెచ్చె నా
మునియును రామచంద్రు ద్యుతి♦మూర్తిని గాంచి మనోజ్ఞవాక్కులన్. ౭౫

క. నరవర! వర్ధిల్లుము! యని, పరమాదృతిఁ బల్కెఁ; రామ♦భద్రుఁడు తేజ
స్స్ఫురితుఁడు పాద్యం బర్ఘ్యం, బురుభక్తి నొసంగి కుశల♦మొప్పనె? యిటన్.

క. అని ప్రశ్నచేసి కనకా,సనమునఁ గూర్చుండఁ జేయ ♦ సమధికయశుఁడై
తనరారి వాగ్విదుత్తముఁ, డనఘుఁడునగు నమ్మునీంద్రుఁ ♦ డట గూర్చుండన్.

తే. స్వాగతంబె మునీశ్వరా! ♦ యాదరమునఁ
బల్కుమా దూతకృత్యంబు ♦ వైశమ యని;
రాజసింహుఁడు పల్కె వి♦భ్రాజమాన
తేజుఁ డామునివర్యుఁ డా♦ధీరుఁ గాంచి. ౧౧ 3551

క. ఇరువురమే యుండఁగ ని, త్తరుణంబున నాదురాక ♦ తగుఁ జెప్పంగా
*ధరణీశ! యస్మదుక్తుల, నరుఁ డెవ్వఁడు గాని వినఁ గ♦నన్ వధ్యుండౌ. ౧౨౫

ఆ. ఇట్లు చేయఁ బ్రతిన ♦ నిపుడు చేయుదువేని, నే వచించువాఁడ ♦ నీకు నాదు
రాక యనిన నట్లె ♦ రాముఁడు శపథంబు, చేసి లక్ష్మణునకుఁ ♦ జెప్పె నిట్లు

క. ద్వారముకడ నీ వుండుము, యేరిని రానీయఁ గూడ ♦ దిరువుర మిచటం
జేరుదుము సుమ్ము మా నుడు, లేరైనన్ వినఁగ రా ద♦హీనగుణాఢ్యా!. ౧౪౫

క. వినినన్ మముఁ జూడంగాఁ, జనుదెంచినఁ జంపు నట్లు ♦ శపథము నేఁ జే
సినవాఁడ ద్వారమం దే,మనుజుని నంపకుము నీవె ♦ మరియాద తగన్. ౧౫

ఆ. నిలువు మంచుఁ బలికి ♦ నెమ్మి నాతం డుండ, నింకఁ జెప్పవయ్య ♦ శంక లేక
యోమునీంద్ర! మదిని ♦ నొప్పినదానిని, జంకుపడక నాదు ♦ స్వాంత మలర.

నూటమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౧౦౪ - వ సర్గము.

కాలుఁడు విష్ణుమూర్తివని రామునకుం జెప్పి వైకుంఠమునకు రమ్మనుట.

చ. అన విని యామునీంద్రుఁ డపు ♦ డారఘురామునితోడ నివ్విధం
బునఁ బలికెన్; మహాత్మ! నృప♦పుంగవ! యెందుల కేను వచ్చినాఁ
డనొ వినవయ్య! తెల్పెదఁ గ♦డంగి పితామహుఁ డంపె నన్ను నో
జనవర! పూర్వభావమునఁ ♦ జక్కఁగ నెన్నుమ యాత్మజుండఁ జూ!. ౧౫ 3551

---

* య శ్శృణోతి నిరీక్షేద్వా స వధ్యో భవితా తవ-అనిమా.

సీ. నీమాయచేతనే ♦ నిర్మింపఁబడితిని సర్వహరుండను ♦ శమనుఁ డనఁగ
నలరువాఁడను బంక♦జాకరుం డఖిలేశుఁ డిట్లని పల్కె; న♦హీనతేజ!
జగములఁ బాలింప ♦ సమయం బొనర్చితి పూర్వము నీమాయఁ ♦ బూని లోక
ములఁ బుట్టఁ జేసితి ♦ వలజలరాశిలోఁ బవళించి పుట్టించి♦తివి తొలి నను;
తే. నవల నుదకాళిఁ బవళించి♦నట్టి నాఁగు, నయ్యనంతుని బుట్టించి♦తాత్మమాయ
నవలగురుబలముల నొప్పు♦నట్టి యిర్వు,రను మహాదానవుల జలం♦బునసె నీవు
క. జనియింపఁ జేసితివి వా, రనుపమదోర్బలము మీఱ ♦ ననురి మధువనం
గను గైటభుఁ డనఁగాఁ దగి, రనఘా! యవ్వారియస్థు ♦ లంతటఁ బర్వెన్ ౯౪
క. గిరినికరాంచితమగు నీ,ధరణియు నవ్వారిపేరఁ ♦ దగి మేదినినాఁ
బరఁగెను; రవివలెఁ బొల్చెడు, వరనాభిసరోగుహమునఁ ♦ బరమకరుణచేన్.
క. నను బుట్టించితి వంతట, వనజాక్షా! సృష్టిచేయు ♦ పని యెల్లను నా
పనిగా నిడఁబడియెను నే, ననూనతద్భార మూని ♦ యంతట నిన్నున్. ౭౪

తే. జగములకు నెల్లఁ బతివని ♦ సంతతంబుఁ
గొల్చుచుంటిని; భూతాళి♦కోర్కు లొనఁగు
నాకుఁ దేజస్సు నిమ్ము శ్రీ♦నాథ! యనుచు
వేఁడుచుంటిని; నవ్వేళ ♦ విశ్వరూప! ౮ 3562

సీ. ఆసనాతనభావ♦మందు దుర్ధర్షుఁడవయి నీవు భూతాళి ♦ కభయ మిడుచు
విష్ణుత్వ మొందితి ♦ విశ్వనాథా! యంత నదితిగర్భంబున ♦ నమలతేజ
మలరఁ బుట్టిన యింద్రుఁ ♦ డఖిలజగంబులఁ బాలింప నతనికిఁ ♦ బటుసహాయ
మొనరింప నెంచితి ♦ వుగ్రదైత్యులబాధ నంది తపించెడు ♦ నఖిలభూత
తే. ములను గాపాడ రావణుఁ ♦ గలనఁ జంప
మనుజతను గంటి వీకృత్య♦మున గతించెఁ
బదునొకొండు సహస్రముల్ ♦ వత్సరములు
కొఱఁతలేకుండఁ జాలదే? ♦ క్షోణివసతి. ౧౧౪ 3563

క. వనజాక్షుండవు నీవే, మనోమయాత్మజుఁడ విష్ణు ♦ మనుజతకు గతిం
చెను బూర్ణాయువు దీనన్, గనుమా కాలంబు దీఱెఁ ♦ గద యని యింకన్.
తే. ఇంకఁ గొంతకాలంబు నీ ♦ విల వసించి
ప్రజలఁ బాలింపఁదలఁచినఁ ♦ బరమముదము
నంది వసియింప వచ్చునం ♦ చనియె బ్రహ్మ;
యెంచుమా యిందుఁ జేయంగ ♦ నేది హితమొ. ౧౮ 2565

క. సురలోకజిగీషయె యి, త్తరుణంబునఁ గోరుదేని ♦ ధన్యులు గద? ని
ర్జరులు సుఖింతురు విగత,జ్వరులై విష్ణువగు నీదు♦సన్నిధి మిగులన్. ౧౫ 3566
క. అని యిట్లు బ్రహ్మవాక్యం,బును గాలుఁడు తెల్ప హాస♦మున మోము చెలం

గను సర్వహారణమును నెమ్మనమునఁ గాంక్షించి నృపతి♦మండనుఁ డనియెన్.

క. సురపూజ్యుని వాక్యంబును, బరమార్థము వింటి దానఁ ♦ బరమామోదం
బు రహింఁ జేకూరె మహో, త్తరమోదము నీదురాకఁ ♦ దనరె మహాత్మా!. ౧౬

తే. ముజ్జగంబులకుం గార్య♦ములు ఫలింప
జనన మొందితి మేలగు ♦ ననఘ! నీకు
వచ్చెదను మర్త్యభూమికి ♦ వచ్చినట్లు
మరల నిజధామమునకు బ్ర♦హ్మానుడీరీతి. ౧౭ 3569

క. మనమున నున్నదియే నీ,వున దెల్పితి నీదురాకఁ ♦ బొంగె మనము రో
జన లేదు నుంతయున్ నా, కనఘా! సురకార్య మిట్లు ♦ సార్థక మయ్యెన్. ౧౮

క. వనజాసనుండు చెప్పిన,యనువునఁ గార్యంబు చెల్లు ♦ నఖిలము శమనా!
చనవయ్య! శంకయించుక,యును మనమునఁ బొందకుండ ♦ నుద్యమ మలరన్.

నూటనాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౫ - వ సర్గము.

రాముఁడు కాలునితో సంభాషించుతఱి దుర్వాసుండు వచ్చెనని లక్ష్మణుఁడు చెప్పుట

క. అని యిట్లు రామరుద్రులు, మనమునఁ గలభావములను ♦ మన్ననతో నా
వనజాసనోక్తి గావం,గను బల్కుచునున్నయట్టి ♦ కాలమునందున్. ౧ 3572

క. మునిపతి దుర్వాసుఁడు వ,చ్చెను రామునిదర్శనంబు ♦ చేయఁగ ద్వారం
బున; కంత లక్ష్మణుఁడు వం,దనములు సల్పెను భయంబు ♦ తా నొంది విధిన్.

క. రామానుజుఁ గని యిట్లను, నామౌనివరుండు వేగ ♦ యవనీశుని శ్రీ
రాముని జూపుము కోరిక, నామదిఁ గల దద్ది తీర్పు ♦ నాథుఁ డతండే. ౩

చ. అన విని లక్ష్మణుండు పర♦మాంత మునీంద్రుని వందనంబులం
దనిపి వచించె నీగతిని ♦ ధాత్రిసురోత్తమ! కార్య మెద్దియో
వినవలతుం బ నేదయిన ♦ నే నొనరింపఁగఁ జాలువాఁడ నా
మనుజవిభుండు కార్యభర♦మగ్నుఁడు గాన క్షణంబు నిల్వుమా. ౪ 3575

చ. విని యిటు పల్కు నానృపతి♦వీరకుమారునిభాషితంబు నా
మునివృషభుండు క్రోధరస♦మున్ వెలిపుచ్చుచు నేత్రవహ్నిచే
తను దహియించువానివలె ♦ దారుణవాక్కుల నిట్లు పల్కె; నా
పనుపున రామభద్రునకు ♦ వైశమ తెల్పుము నాదురాకనున్. ౫ 3576

తే. ఈక్షణంబున నా రాక ♦ నెఱుకపఱుప
నిష్టపడవేని రాజ్యంబు ♦ నీపురంబు
రామునిం గూడ శపియింతు ♦ రామునంత
తిని నిను భరతుని సంత♦తిని విడువక. ౬ 3577

క॥ మనమునఁ గల్గినక్రోధం,బును నిల్వఁగఁ జాల ననుచు ♦ మునిపతి ఘోరం
బు నిశాతవజ్రకల్పం,బును నగు వాక్యమును బల్క ♦ మోముకలంగన్. ౮

సీ. మనమున నిట్లు ల♦క్ష్మణుఁడు చింతించె; నీముని నిశ్చయంబి ద♦మోఘ మరయ
నాకు నొక్కనికె యా♦నరపతి మాటను దాఁటినందులకు నం♦తంబు గలుగుఁ
గాని యందఱ కది ♦ కల్గక యుండెడు; నని చక్కఁగా నెంచి ♦ యవనిపతికి
విన్నవించెను ముని♦వృషభునాగమనంబు విని తమ్ముమాట నా♦విభుఁడు కాలుఁ

ఆ. సాగనంపి భక్తి♦సాంద్రుఁడై యెదురేగి
యత్రితనయుఁ గాంచి ♦ యగ్నివోలెఁ
దనదు తేజమునను ♦ దగ వెల్గు నమ్ముని
కెరఁగి దోసిలొగ్గి ♦ హితము మెఱయ. ౧౧ 3579

క. తెలుపుము మునినాయక! యిమ్ముల వచ్చిన కార్య మేమొ ♦ ముందుగ నన న
ప్పలు కాలకించి మునిపతి, యలరుచు నిట్లనియె సూనృ♦తాదృతమనసా!. ౧౨

తే. ధర్మవత్సల! విననయ్య! ♦ తపము చేయ
వేయి వర్షము లయ్యె నే ♦ వితతదీక్ష
మొదలుపెట్టి, నేఁడాదినమున ♦ కది ఫలించె
వలతు నిష్టభోజనము నీ♦వలన నేను. ౧౩ 3581

చ. అన విని రాఘవుండు కడు ♦ హర్షము మీఱఁగ భోజనంబు న
మ్మునివరుకోర్కిరీతిగను ♦ ముందుగ సిద్ధము చేయఁబంచి యా
తని కెటఁగించె; నంత నమృ♦తం బనఁగాఁ దగు నిష్టభోజనం
బునఁ గడుఁ దృప్తిఁ బొంది *రఘు♦పుంగవు మెచ్చుచు నాతఁ డేగఁగన్. ౧౪

క. తనయాశ్రమంబునకు నా,ముని చన లక్ష్మణుని యన్న ♦ మును కాలునితోఁ
దనచేసిన శపథంబును, మనమున యోజించి దుఃఖ♦మగ్నుం డయ్యెన్. ౧౫

సీ. కాలువాక్యంబులఁ ♦ జాల లోఁ జింతించి దుఃఖాబ్ధిమగ్నుఁడై ♦ లోఁప కూర
కుండి యాపద్ధతి ♦ యురుభయంకరరీతిఁ గప్పడ స్మరియించి ♦ కడుఁ దపించి
దీనాననుండయి ♦ మానసం బుత్తలపాటొందఁ బలుకక ♦ పార్థివేంద్రుఁ
డొకకొంతసే పూర♦కుండి కాలునివాక్యపద్ధతి మరల ను♦స్వాంతమందు

తే. నెంచి కార్యంబు లేదని ♦ మించువగలఁ
బొగిలి లక్ష్మణుకూర్మిని ♦ బొగడి యేమి
చేయఁ దోఁపమిఁ దల వాంచి ♦ యాయనూన
యశుఁడు చింతానముద్రమ♦గ్నాత్ముఁ డయ్యె. ౧౬ 3584

నూటమైదవ సర్గము సంపూర్ణము.

---

* సాధు రామేతి సంభావ్య స్వమాశ్రమ ముపాగమత్, తస్మిన్ గతే మునివరే-అనిమూ.

## ౧౦౬ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణుఁ ద్యజింప నతఁడు వైకుంఠమున కరుగుట.

[క. మనమునఁ గలవిలపాటును, గనుచున్ మూఁకత్వ మొంది ♦ కడు నిట్టూర్పుల్
గనఁబడ నశ్రువు లొప్పఁగఁ, *దనుఁ దానే తిట్టుకొనుచుఁ♦దహతహపడుచున్].

తే. మోము వాంచి దీనుండయి ♦ సోమురీతి
జలకణము లొక్క మొగిఁ బడ ♦ జాలినొందు
రామునిం గాంచి లక్ష్మణుం ♦ డీమెయిఁ దగఁ
బలికె మధురతరంబగు♦భంగి మెఱయ. ౨ 3586

క. గురుబాహూ! నాకొఱకై, పరమంబగు తాప మొందఁ ♦ బనిలేదు మహీ
శ్వర! కాలగతులు పూర్వమె, నరులను బంధించి యుంచు ♦ నా విందుముగా.

క. నను విడువుము శపథంబును, జననాయక! చెడక యుండు♦చందంబునఁ గా
వను జను శపథము దీర్పని, మనుజులకున్ నరక మబ్బు ♦ మాట లిఁకేలా?.

క. కలదే నాపైఁ బ్రేమము, పలుకక నన్నుం ద్యజింపు ♦ పరమకరుణగాఁ
దలఁచెద నందియ మందకు, మిల ధర్మము నిల్పుటొకఁడె♦ హితముమహాత్మా!.

చ. అని యిటు లక్ష్మణుండు పర♦మాద్భుతరీతి వచింప మంత్రులన్
ఘనమతులౌ పురోహితులఁ ♦ గ్రన్ననఁ బిల్వఁగఁ బంచి రాముఁ డా
ర్తిని దనయంగముల్ కలఁగఁ ♦ దేకువమాలి వచించె వారితోఁ;
దనకును రుద్రమూర్తికి య♦థావిధి సాగినవృత్త మార్తుఁడై. ౬ 3590

తే. నడుమ దుర్వాసురాకయుఁ ♦ గడఁగి యతఁడు
శపథమును జేయుటయుఁ దెల్ప ♦ సచివవర్యు
లును బురోహితపుంగవు♦లును వినియును
బలుక కుండ వసిష్ఠుఁ డు♦జ్జ్వలతనుండు. ౭ 3591

క. మనమునఁ జింతించి వచిం,చెను; గాంచితి శాస్త్రరీతి♦చే గగ్గురుపా
టును బొందఁజేయు వార్తను, వినిపించెద మీకు సాగు ♦ విరహం బింకన్. ౮

క. అనుజుని కూటమి వదలం, జను నీకు మహాయశంబు ♦ క్షమ గల్గిన యో
జననాథ! వదలుమా నీ,యనుజుని కాలంబు ప్రబల♦మై తోఁచెదుఁ జూ!. ౯

క. పరిపాలింపుము శపథము, ధరణిని నద్దానిన్ వృ♦థా చేసిన ను
ర్వర ధర్మము విలయంబగుఁ, జరాచరం బెల్ల ధర్మ♦సంతతి నలరున్. ౧౦

ఆ. అద్ది చెడిన నదియు ♦ నంతంబు గను దేవ
మునులు చెడుదు, రమల♦ము గద ధర్మ
పథము దానిఁ గాంచు ♦ పద్ధతియే మేలు
శంక యేల? విడువఁ ♦ జను ననుజుని. ౧౧ 3595

* సాస్రం నిందమానం ప్రియాప్రియే-అనిఘా.

డురుసత్త్వుండయి తనతను, వరుదుగ గ్రహియించె శత్రుఁ ♦ డాతనిఁ బ్రీతిన్.

క. కొని చనియె స్వర్గమున; కా, వనజాక్షుచతుర్థభాగ♦వరము సురపదం
బున కేతెంచుటఁ గని సుర, లనూనహర్షంబు పొంది ♦ యర్చించి రొగిన్.

నూటయాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౭ - వ సర్గము.

రాముఁడు భరతప్రార్థనమురీతిఁ గుశలవులకుఁ బట్టాభిషేకము చేయుట.

క. అనుజుని లక్ష్మణు నీరీ,తిని ద్యాగము చేసి నెమ్మ♦దిని *వగ శోకం
బును గదురఁ బురోహితు మం,త్రినికరమును బౌరవరుల ♦ ధీరుం డంతన్. ౧

క. పిలిపించి వారితో నిటు, పలికెన్; ధర్మాత్ముఁడైన ♦ భరతుని నీకో
సలదేశంబుల నేలఁగ, నలఘుతరప్రీతిఁ జేయ♦నగుఁ బతి గాఁగన్. ౨ 3611

తే. ఇప్పు డభిషేక మొనరుప ♦ నిచ్చగింతు
నీయయోధ్యకుఁ బతిఁజేసి♦యే వనంబుఁ
జేర నరిగెద; వస్తువుల్ ♦ సిద్ధపఱుపుఁ
డింకఁ గాలంబుఁ బుచ్చరా ♦ దిపుడె నేను. ౩ 3612

చ. వనమున కేగువాఁడ గురు♦భావుఁడు లక్ష్మణుఁ డేగె నట్టు, లా
తనిగతి నొందువాఁడ నని ♦ ధారణిభర్త వచింపఁ బౌరు లా
ర్తిని దలలొగ్గి మ్రొక్కి యతి♦దీనత సత్త్వము దూలినట్టు లుం
డ నపుడు రామువాక్కులక♦డంకకు మూర్ఛిలి యాసభాస్థలిన్. ౪ 3613

క. భరతుఁ డొకకొంతసేపటి, కరుదుఃఖము మిగులఁ దెలిసి ♦ యుర్విని గొను నా
దరమును బూనక యిట్లను, ధరణీశా! పల్కువాఁడఁ ♦ దథ్య మ్మిచటన్. ౫

తే. సత్యమును సాక్షిగా నేను ♦ శపథ మిపుడు
చేయుచున్నాఁడ స్వర్గంబు ♦ సిద్ధ మిదిగొ
యనిన నే నొల్ల నిను వీడి♦నట్టులైన
రాజ్య మేఁ గోరుదునె రఘు♦రామ! యింక. ౬ 3615

క. వీరే కుశలవు లివు డీ, ధారణిఁ బాలింపఁ గట్టఁ ♦ దగుఁ బట్టంబున్
భూరమణ! కోసలమునకుఁ, దా రాజగుఁ గుశుఁడు నాదు♦తాత్పర్య మిదా.

తే. ఉత్తరంబగుకోసల ♦ మొప్ప లవుఁడు
పాలనము చేయఁగాఁ దగుఁ ♦ ద్వరగఁ బోవు
దూత లేగి శత్రుఘ్నుని ♦ దోడితేర
గాఁ దగున్, దూత లీరీతి♦గా ననఁదగు. ౮ 3617

---

* దుఃఖశోకసమన్వితః-అనియు.

క. మనపయనము స్వర్గంబున, కని యాలస్యంబు చేయ ♦ కచటు వదలి ర
మ్మని పల్కఁ జనును నాథర,ఘుని పల్కుల నాలకించి ♦ యూరఁ బౌరుల్. ౮౺

క. పౌరులు మోములు వంచుచు, భూరితరంబైన చింతఁ ♦ బూని నసిష్ఠుం
డీరీతిఁ బల్కెఁ వత్సా!, భూరనుణా! రామచంద్ర! ♦ పురజను లెల్లన్. ౯

చ. ధరణిని దూలినారు జన♦తామహృదయేప్సిత మాత్మ నెంచి యా
దరమున దానిఁ దీర్పఁ దగుఁ ♦ దప్పక వారల కప్రియంబు తే
వరునను జేయఁగాఁ దగదు ♦ వారలకోరిక యెట్లొ దాని భూ
వర! వినుమన్న నమ్మునిని ♦ భక్తిఁ గనుంగొని లేచి రాముఁడున్. ౧౦ 3620

ఉ. పౌరులఁ గాంచి యిట్లనియెఁ ♦ బల్కుఁడు నే నొనరింప నర్హమై
ధారణి శాస్త్రరీతికిని ♦ దా నెసులే దనిసిద్ధమైన య
ట్లారసి తెల్పుఁడీ! యనిన ♦ నాపురవాసులు పల్కి రిట్టు లో
ధారణినాథ! నీ వరుగు ♦ ధాత్రికి నస్థ్మము తప్ప కే మొగిన్. ౧౨ 3621

చ. పురజనులందఱుఁ బ్రీతియును ♦ బొల్పగు స్నేహము మీరఁ గల్గినన్
ధరణిఁ దృజించి పుత్త్రులను ♦ దారలఁ గూడి భవత్పదంబు నా
దరమునఁ బొందఁ గోరుదుము ♦ దాని గ్రహింపఁగ నొను రామ! నీ
వరుగుపథంబు నత్తపము♦నందు వసింజయిండి మనోజ్ఞమున్. ౧౩ 3622

సీ. దుర్గమంబైనను ♦ స్వర్గతుల్యంబగునది గాని జలధియు ♦ గ్యూనఁ దలఁప
మాకు నిష్టంబగు ♦ నేకడనేగిన వత్సుము మము వీడ ♦ వలనుగాదు
ప్రభువు నీవే కాద ♦ పరమగతియు నీవె సంప్రీతియును నీవె ♦ సాధుదైవ
తము నీవె మాహృద్గ♦తంబగు శాంతియు నీవె మే మెల్లను ♦ నీపరినర

తే. మున వసింపఁగఁ దలఁతుము; ♦ చనదు మమ్ము
వలదనుచుఁ బల్క నని యిట్లు ♦ పలుకుచున్న
పురజనులదృఢభక్తికిఁ ♦ బొంగి యట్లె
చేయవచ్చు నటంచని ♦ శ్రీతిపుఁ డనియె. ౧౪ 3623

క. అని యిట్లు పలికి తనదు గ,మన మాదినమున దనుచు ♦ మది నెంచి తనూ
జుని గుశుని గోసలంబున,కు నుత్తరపుఁగోసలమున♦కును లవు నునుపన్. ౧౫

క. తనమదిని నిశ్చయించుచు, దనమున నందే కుమార♦ధీనుల కభిషే
కనితాంతమహము గల్గఁగ, నొనరిచె నాపురవమునందె♦యొప్పు మెరయఁగన్.

చ. తనయుల నంకమందు నిడి ♦ కౌను నృపాంబునఁ గౌఁగిలించి కౌం
చుము శిరముల్ మహాద్భుతిని ♦ సొంపు దగన్ స్పృశియించి యంత స్వం
దనములు వేయి యేన్గు లయు♦తంబును లక్షహయంబులన్ ధనం
బును దమిఁ దుల్యరీతిగను ♦ భూవరుఁ డిచ్చెను బూన్కిమీరఁగన్. ౧౯

క. ధనముల రత్నంబుల నొ,ప్పినపురముల వారి కొసఁగెఁ ♦ బృథుమోదరసం
బున నొప్పుజనము లలరఁగ, ధనపతినగరంబునాఁగఁ ♦ దనరెడువానిన్. ౧౯

క. తనయుల నిర్వురఁ బంపెను, జననాథుఁడు నృపులఁ జేసి ♦ చయ్యనఁ బ్రీతిన్
జనములఁ బాలింపఁగ వీ,రనిచయపూజ్యులను ధర్మ♦రంజితతనులన్. ౨౦

తే. ఇట్టు లిర్వురఁ దనయుల ♦ నిలకుఁ బాల
కుల నొనర్చి శత్రుఘ్నునిఁ ♦ బిలువ దూత
లను మహావేగవంతులఁ ♦ బనిచె భరతు
వాంఛితమురీతి నానర♦వర్యుఁ డంత. ౨౧ 3629

నూటయేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౮ - సర్గము.

{ రాముఁడు శత్రుఘ్నసుగ్రీవులు తనతో రా ననుజ్ఞ యొసఁగి హనుమ
ద్విభీషణజాంబవదాదుల భూమి నిల్వ ననుజ్ఞ యొసఁగుట. }

ఉ. రామునియాజ్ఞఁ బూని రఘు♦రామునితమ్ముని గాంచువేడ్క ను
ద్దామబలాతివేగముల ♦ ధాత్రిఁ బ్రసిద్ధిని గన్న దూత లా
భూమిపతీంద్రుఁ డున్నెడకుఁ ♦ బోయిరి త్రోవను జాగుసేయ కే
యామధురాపురంబును ద్రి♦యామల మూటను బొంది యచ్చటన్. ౧౪ 3630

తే. అరినిషూదను శత్రుఘ్ను♦నందుఁ గాంచి,వృత్త మెల్లను దెల్పి; ర♦వీరవరుఁడు
లక్ష్మణత్యాగమును నృప♦లలితు ప్రతిన,కుశలవాభిషేకంబును ♦ గోరి ప్రజలు.

చ. అనుగమనంబు వేఁడ నృపుఁ ♦ డట్టులె చేయఁగ సమ్మతించుటల్
తనయులలోన జ్యేష్ఠుఁడయి ♦ దర్పయుతుండును నా కుశాఖ్యు విం
ధ్యనికటమందు భాగ్యములఁ ♦ దద్దయు నొప్పు కుశావతీపురం
బున కధినాథుఁ జేయుట ల♦వుండను చిన్నకుమారు వీరునిన్. ౮ 3632

క. శ్రావస్తి యనుపురంబున, కావిధమున రాజుఁ జేసి ♦ యభిషేకము నా
భూవిభుఁడు చేయుటయు విని, యావిధముననయ్యయోధ్య♦యందలిప్రజలన్.

క. తనతోడ రాఁగ ననుమతి, జనపతి యిడి నిర్మనుష్య♦సంకీర్ణగఁ జే
యను దలఁచుట భరతుండును, దనతో రా స్వర్గమునకుఁ♦దరలఁదలఁచుటల్.

తే. వినియె సర్వము దూతలు ♦ విస్తరించి
తెలుప నాదూత లివ్విధిఁ ♦ దెల్పి యూర
కుండ మహితుండు శత్రుఘ్నుఁ ♦ డురుజవమున
రమ్మనిన వారిపల్కుల ♦ నెమ్మదిఁ గొని. ౧౪ 3635

సీ. ఘోరాతిఘోరమై ♦ కులసంక్షయంబగు వార్తకు నెంతయు ♦ వనట నొంది
ప్రజలను రావించి ♦ పరమమునీంద్రుఁడై కాంచనాహ్వయమునఁ ♦ గ్రాలు నట్టి

చ. కనుఁగొని వందనంబు లిడి ♦ కమ్రవచస్సుల హృద్గతార్థముల్
మనవి యొనర్చె నిట్లు; రఘు♦మండన! వీరుని సంగరుల్ బురం
బున కభిషిక్తుఁ జేసి నినుఁ ♦ బూనికఁ గొల్వఁగ వచ్చినాఁడ నీ
యనుగమనంబె కోరితి దృ♦ఢాత్మ నటంచును లోఁ దలంపుమా. ౨౪ 3650
చ. అన విని యన్యచిత్తముల ♦ నారసి రంజిలఁ జేయు రాముఁ డి
ట్లనియెను వానరేంద్రుఁ గని ♦ యాతని నెయ్యము లోఁ దలంచి; యో
వనచరనాథ! మిత్రుఁడవు ♦ బంధులకన్నను నీవె యెక్కుఁడం
చును మది నెంచినాఁడ, నినుఁ ♦ జూచిన సంతస మబ్బు నామదిన్. ౨౫
క. నినుఁ గూడక సురలోకం,బును నంతకు మించు స్థాన♦మును బొందఁ దలం
పను జుమ్మటంచు సంతట, వనచరభల్లూకదనుజ♦వారమునుడులన్. ౨౬
క. వినుచు విభీషణు నాదృతిఁ, గని మధురము మృదువునైన ♦ కమ్రవచనముల్
వినిపించె నిట్లు; ధరణిన్, మనుజులు చెలువారుదనుక ♦ మహిను వెలయుఁగన్.
క. తనువును దాల్తువు నీవును, దనుజేంద్రా! భూరివీర్య! ♦ ధరణి వెలయుదాఁ
కను లంకనుండి రాజ్యం,బును బాలన మొప్పఁ జేయఁ ♦ బూనుముసౌమ్యా!.
క. దినకరశశధరు లుర్వియుఁ, గను స్థితి నెందాఁక నాదు♦కథ యిల నెందాఁ
కను బొల్చునో నీరాజ్యం, బనఘాత్మా! యంతదనుక ♦ నలరున్ స్థిరమై. ౨౯
చ. అనుపమమిత్రభావమున ♦ నాజ్ఞ యొనర్చితి, నాదుశాసనం
బును గొని యీవిధిన్ నడువఁ ♦ బూనుట లెస్స నిరంతరంబు ధ
ర్మనిరతి నీప్రజాతతిని ♦ మన్ననమీఱఁగఁ బ్రోచుచుండు మే
మనకుము నాదువాక్యనకు ♦ నన్యవిధంబగురీతి నోసఖా!. ౩౦ 3656
సీ. మఱియు వేఱొక్కండు ♦ మాటను జెప్పెద సన్మతీ! [1]యిక్ష్వాకు♦జనపతులకుఁ
గులదైవతంబయి ♦ విలసిల్లు నాజగన్నాథు వాసవముఖ్య♦నాకివితతి
పూజ్యు నారాధింపఁ ♦ బూనుము సర్వదా; యన విని రామువా♦క్యంబు నట్టె
యొనరింతు నని శిరం♦బునఁ దాల్చె నాజ్ఞను రాక్షసముఖ్యుఁడై ♦రమ్యగుణవి
తే. భూషితుండయి పొల్చు వి♦భీషణునకు,నివ్విధిం దెల్పి హనుమంతు ♦ సిద్ధతేజుఁ
గాంచి యీవిధిఁ బల్కెనో♦గాలితనయ!, [2]బ్రదికియుండఁబ్రతిజ్ఞను♦బల్కితీవు.
క. దానిని వృథచేయకుమా, నానిర్మలగాథ జగము♦నను నెందాఁకన్
మానితరీతిఁ జెలంగునొ, వానరవర! యంతదనుక ♦ వర్ధిలవయ్యా!. ౩౨ 3658
క. మనమున నిరంతరప్రీ,తిని బొందుచు నాదునుడిని ♦ దివిరి ప్రపంచం
బున విస్తరిల్లఁ జేయుచు, మనవయ్యా! సాధుమనుజ♦మండలనుతులన్. ౩౩
చ. అని రఘురాముఁ డెంతయును ♦ నాదృతి సన్మతి నెంచి పల్కినన్
విని సుమహాప్రమోదమున ♦ విన్నప మివ్విధిఁ జేసెఁ జాలఁ బా

1 ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకుకులదైవతం, ఆరాధనీయ మనిశం సర్వైర్దేవైః సవాసవైః-అనిమూ. ఈ విషయము యుద్ధకాండమున వ్రాయఁబడినది కాన నిటవ్రాయఁబూనలేదని గ్రహించునది. 2 జీవితే కృతబుద్ధి స్త్వం మా ప్రతిజ్ఞాం వృథా కృథాః-అనిమూ.

మానిఁ గొల్చుచు వేదంబు ల,వనిసురరూపములఁ దాల్చి ♦ వైభవ మెసఁగఁగ.

తే. అఖిల రక్షణిపైన గా♦యత్రి యున్లి, యోంకృతియును వషట్కార♦మూర్తిపతిని ననుసరించి వెసంజనె;♦నంతఋషులు,భూసురులుచిత్తములయందుఁ♦బొంగుకాంత.

క. చనిరి మహాత్ముని శ్రీరా,ముని గూడి సురేంద్రస్థాన♦మునఁ దగుద్వారం బును భేదించి ప్రవేశిం,పను గోరుచు, నంతఁ బ్రీతి♦వనితామణులున్. ౯ 3672

తే. అంతిపురమును విడనాడి ♦ యాత్మవృద్ధ, బాలదాసీజనంబుల ♦ నోలిఁ గూడి సేవకులు మందు లెల్లను ♦ శ్రీపదంబుఁ,గోరవారలఁ దోడ్కొని ♦ శ్రీరఘువరు.

క. మనమున నెన్నుచుఁ బోయిరి, [1]తనయంతఃపురముతోడఁ ♦ దమ్మునితోడన్ జనియెను భరతుం డగ్నులఁ, గొని నియమం బొప్ప భూప♦కుంజరుతోడన్. ౧౧

సీ. అంత మహాత్ములై ♦నట్టి బ్రాహ్మణు లెల్ల నగ్నిహోత్రములతో ♦ నాత్మదార తనయబంధువులతోఁ ♦ దన్మహీపతిఁ గూడి చని; రంతమంత్రులు♦ సకలభృత్య తనయ బాంధవ,పశు♦తతులతో సేవకవితతితో సంతోష ♦ మతిశయముగఁ బొంగుచుండఁగ రామ♦భూపతినరుఁగూడి చని;రంతఁబ్రజ లెల్ల♦సాధుహృదయు

తే లగుచుఁ దృప్తజనావృతు ♦ లగుచు రాము,సద్గుణారంజితులుగాన♦సరనగతుల నతనిఁ గొల్చుచుఁబోయిరి; ♦యట్లువనిత,లెల్లఁబురుషులుపశుపతు♦లెల్లరాఁగ.

క. గతకల్మషులై శ్రీరఘు,పతితోడం బోయి; రంత ♦ వానరవరు ల ప్రతిమప్రమదంబున స,మ్మతమునఁ బుష్టియును దుష్టి ♦ మానుగ నొలయున్.

క. కిలకిల యనఁబడు శబ్దం,బులతో శ్రీరాముఁ గొల్చ ♦ బుద్ధులతోడం జెలఁగుచుఁ జని; రాయందఱుఁ, గలయంగా వెదుక దుఃఖ♦కలితుండొకఁడున్.

క. దీనుఁడు వ్రీడాకలితుఁడు, గానంబడఁ డొక్కఁడైనఁ ♦ గాని తలంపం గా నందఱు హర్షంబున, మానసములు పొంగఁ జిత్ర♦మంజులభణితిన్. ౧౬

తే పెండ్లి కరిగినచందానఁ ♦ బ్రియవచనము,లొక్క రీతిగఁబల్కుచు ♦ నోలిఁజనిరి; జానపదులందు శ్రీరామ♦చంద్రుఁడిట్లు,బయలువెడలుటఁగనుగొను♦వాంఛమీఱ

క. చనుదెంచి కాంచిరో యా,జను లెల్లను రాముఁ గూడి ♦ స్వర్గంబునకుం జని రానందంబున, నా,జనులును బౌరులును గీశ♦సమితియు నెలుఁగుల్. ౧౮

క. పరమప్రమదము భక్తియు, సరిగా మది నొప్ప రామ ♦ చంద్రు వెనుకఁ బో యిరి, శ్రద్ధమీఱ! భూతో,త్కర మెయ్యదదృశ్య మగుచు♦గ్రాలునొపురిలోన్.

క. ఆయా భూతము లెల్లను, నాయధిపుఁడు స్వర్గమునకు ♦ నరుగ వెడలఁగాఁ బాయక వెంబడి భక్తిం, బోయెను; శ్రీసద్గుణాభి♦పూరితు రామున్. ౨౦

ఆ. కనిన స్థావరచులు ♦ ఘనచరజంతువుల్,స్వర్గమునకుఁ జనియె ♦ సంతసమున; నాయయోధ్యయందు ♦ నరసిన నతిసూక్ష్మ,జంతు వొకటియైనఁ♦జక్కఁ గనిన.

[1] సాంతఃపురశ్చ భరత శ్శత్రుఘ్నసహితో యయా-అనిమూ.

తే. యట్లు చేయంగ నెంచిమ♦హామతియగు, రాముఁడాత్మవైష్ణవశరీ♦రంబుఁజొచ్చె
ననుజయుతుఁడయి; యంతను♦హాత్మువిష్ణు,ను యునినతనినర్చించిర♦మర్త్యులెలమి.

క. మరుదధిపసాధ్యశతముఖ,పురోగమాదిత్యవహ్ని♦పూజ్యమునులు న
చ్చరలును గంధర్వులు ఫణి,గరుడులు యక్షులునువనుజ♦కాంతులుదైత్యుల్.

ఆ. సకలరాక్షసులును ♦ సాధుసాధ్వనువాద,ములను బూర్ణకామ♦ములను హర్ష
ములను జెలఁగి స్వచ్ఛ♦ముగఁ బాపదూరము, గను నెసంగుదివిఁ ♦ జనిరిపిదప

క. గురుతేజుఁ డంత విష్ణువు, సరసిజభవుఁ జూచి పలికె ♦ జను లిదె నాతో
నరుదెంచిరి వీరికి భా,సురలోకం బొందు వేగ ♦ మూవు వసింపఁగ. ౧౬౪ ౩౯౯౩

క. ననుఁ గూడి మైత్రిఁ బాయక, చనుదెంచిరి సాధుమతులు ♦ జను లతిభక్తుల్
నను నమ్మి వదలి రాత్మలఁ, గనుకం గాపాడవలయుఁ ♦ గాదే వీరిఁ. ౧౭౪

చ. అనుటయు విష్ణువాక్యము మ♦హామతియౌ పరమేష్ఠి చక్కఁగా
విని జగదాకరుం డగుట ♦ విష్ణువుఁ గూర్చి వచించె నిట్టు లీ
జనులు భవత్కృపాలవము ♦ శాశ్వతభక్తిని బొందినారు గా
వునను సుఖాలయంబగుచుఁ ♦ బూజ్యతరంబగు లోక మొందఁగన్. ౧౮౪

ఆ. తగినవారు వీరు ♦ ధన్యులు సాంతాని,కాఖ్యలోక మొప్పు ♦ నట వసించు
వారు; పశుపతత్రి♦వారమైనను నినుఁ, దలఁచి ప్రాణముల వ♦దలునయేని. ౧౯

క. అవికూడను సాంతానిక, సువిమలలోకంబునందుఁ ♦ జొచ్చి వసించున్
భవనాశక! యను నంతటఁ, బ్రవిమలరూపముల నెల్ల♦ప్రజలు మహిమలన్.

తే. బ్రహ్మలోకంబు మీఁదట ♦ బ్రహ్మగుణము,లొప్పునాలోకమున కేగి♦రప్పు డఖిల
కపులుతమతమ దేవాంశ♦కములఁబొంది,రల్లిభల్లూకములునొందె♦నభవునాజ్ఞ.

క. వనచరపతి సుగ్రీవుఁడు, వనరుహసఖులోక మొందె ♦ వారక దివిజుల్
కనుచుండఁ దనకు జనకుం, డనఁదగు రవియందుఁ జేరె; ♦ నంతట నితరుల్.

ఆ. గోప్రతారమనెడు ♦ గొప్పతీర్థంబున, మునిఁగి రామముఖులు ♦ ఘనతరమగు
సంతసమునఁ బొదలి ♦ చని రందు మున్గిన, వార లంగములను ♦ వదలియపుడె.

సీ. వ్యోమయానంబులఁ ♦ దామెల్ల నలరుచుఁ జనిరి తిర్యక్కులు ♦ శతము సరయు
వున మునింగినయంత♦టనె భాసురాంగము లలరార స్వర్గంబు♦నందె; నంత
స్థావరంబులుమఱి ♦ చరములు చూడ దివ్యాదివ్యవపువుల ♦ నమరులవలె
వెలుఁగుచు సరయువు♦జలముల మునిఁగిన యంతనే దేవత్వ ♦ మలవడంగ

తే. నాతఱిని వచ్చి యున్నట్టి ♦ యఖిలకపులు, భల్లుకంబులు రాక్షసుల్ ♦పావనజల
మందుఁ దమతమతనువుల ♦ నట్టె వదలి, స్వర్గమున కేగి; రంతటఁ ♦బద్మభవుఁడు.
రామునే యాశ్రయించి యు♦ద్దామభక్తి,యలర వచ్చినవారల ♦ నర్హపదము
లందు నిల్పినమ్మోదంబు♦పొందిసురలఁ,గూడిస్వపదంబునకుఁబోయె♦వేడుకలర.

నూటపదియవ సర్గము సంపూర్ణము.

## ౧౧౧ - వ సర్గము.

—ఫలస్తుతి.—

క. అని యిటు లుత్తరకాండం,బును గూడిన గానకావ్య♦మును బ్రహ్మాది
ప్రణుతమునౌ రామాయణ,మును వాల్మీకియె రచించె ♦ మోదం బలరన్. ౧
క. తరువాత విష్ణుమూర్తియు, సురపూజితలోకనుండు ♦ శుభతమరీతిన్
గరము ప్రతిష్ఠితుఁడై యా,నరముఁ బాలించె లోక♦తతులం గడఁకన్. ౨
తే. భువనములమూటవ్యాపించి♦పొలుచునవ్వఁ,డామహావిష్ణువే వచ్చె♦నొరయింత
కాలమునకంచు దేవని♦కాయములును,సిద్ధగంధర్వులును మోద♦సిద్ధి గనుచు.
చ. అనవరతంబు రామకథ ♦ నాయతభక్తిని వించుఁ బాడుచున్
ఘనతమహార్షముం గనిరి ♦ గావున నీకథ యాయు విచ్చుఁ బా
పనిచయతూలవహ్ని యన ♦ భాసిలు, భాగ్య మొసంగు వేదరా
శిని సరిపోలు నట్లగుటఁ ♦ జిత్తమురంజిలఁగా వినం దగున్. ౩ 3711
తే. శ్రాద్ధములయందుభక్తిని♦జదువునట్లు,చేయఁగాఁదగుఁబుత్త్రుల♦సిద్ధిఁగోరి త్వరగ.
చదువఁబుత్త్రులఁదులభియించు♦నముదిధన,మునుమదింగోరఁగాఁబొందు♦ధనము
క. దీనిం బాదము చదివిన, చో నిఖిలాఘమును వోలఁగు ♦ శ్లోకి నెవఁడు పెం
పూనిన గర్వంబుమెయిన్, మానక యనుదినము పాప♦మండలి చేయన్. ౪
తే. రామకథయందు శ్లోకమా♦త్రంబు చదువఁ
బాపరాసులు తొలఁగుఁ నె♦వండు చదువు
నాతనికి వస్త్ర కనకమ్ము♦లమర నిచ్చి
తృప్తి చేయంగఁ దగు, వాఁడు ♦ తృప్తిఁ గనిన. ౫ 3114
క. సురలెల్లఁ దృప్తిఁగాంతురు,పరమాయుష్యంబు నొసఁగు♦భవ్యము నగుచున్.
బరిమతమౌ రామాయణ,మును భక్తిఁ బఠించునాతఁ♦డున్నతి మెఱయున్.
క. తనయులతోఁ బౌత్త్రులతోఁ, దనివారఁగ నిందుమీఁదఁ ♦ దద్దయుఁ బొలుచున్
మనుకేంద్ర వానరఘ్యం,బును గొప్పదియౌ నయోధ్య♦పుర మది జగతిన్. ౬
తే. పెక్కువేలవర్షంబులు ♦ దిక్కులేక,యుండెబుమభుని ప్రభువుగా♦నొందివెలసె;
నిద్ది యాఖ్యానమాయుష్య♦మిచ్చుదీని,భావిఫలములతోఁగూడ♦బ్రహ్మమౌని.
తే. ఉత్తరంబగు కాండంబు ♦ నొప్పమీఱ,గాఁ బ్రచేతసుపుత్త్రుండు♦కమ్రఫణితి
నొనరిచెన్ బ్రహ్మయునుదాని♦నొప్పుకొనియె;నశ్వమేధసహస్రంబు♦లాచరింప.
క ఘనవాజపేయములు ప్రీతిని నయుతము చేయ నట్టి ♦ దివ్యఫలము గ
ల్గునొ యిందొక సర్గము నే,మనుజుఁడు పఠియించు దాని ♦ మానక పొందున్.
సీ. పుణ్యతమంబులై ♦ పొల్చుప్రయాగాది సత్తీర్థములు మఱి ♦ జహ్నుకన్య
మొదలుగాఁ గల నది♦న్ముఖ్యంబులును నైమిశాదివనంబును ♦ నల్లధరణి
నలరు కురుక్షేత్ర♦మాదియౌక్షేత్రములను భక్తి సేవింపఁ ♦ గనెడు పుణ్య
మీపుణ్యతమగాథ ♦ నెలమితోఁ బఠియింపఁ వినఁగను,వాల్మీ♦కిముని నెవండు

తే. భాస్కరగ్రహణంబున ♦ భక్తిమీఱఁ
గాఁ గురుక్షేత్రమున నిచ్చి ♦ కనుఫలంబు
దాని రామాయణంబును ♦ బూని చదువఁ
గాంచు సత్యము తలఁపంగఁ ♦ గా దనృతము ౧౩ 3720

క. ఫల మట్టిది రామాయణ, మెలమిం జదువంగఁ గలుగు ♦ నీయిరువురు తు
ల్యులు శ్రద్ధమీఱ రాముని, సులలితగాథల్ వినంగఁ ♦ జొప్పడు నతఁడున్.

క. చనుఁ బాపవిముక్తుండై, వనజాక్షుని లోకమునకుఁ, ♦ బ్రాక్కావ్య మిదా
మునిభాషితంబు పూర్వం,బున వాల్మీకి బ్రహ్మయాజ్ఞఁ ♦ బూని రచించెన్.

చ. అనవరతంబు భక్తిమెయి ♦ నాదృతి శ్రీరఘురాముగాథనున్
వినిన మనోజ్ఞవైష్ణవము ♦ వీతమలంబును నైన దేహమున్
గను; దనయుల్ కళత్రమును ♦ గాఢతరంబగు భాగ్యముం దనం
తన యభివృద్ధి నొందు; నియ♦తంబగు చిత్తసమాధి నొందుచున్. ౧౬ 3723

క. వినఁదగుఁ బఠింపఁగాఁ దగు;, ఘనమగు నీకావ్య మెన్న ♦ గాయత్రియె యా
ననుపమమగు దీనిని జది,వినచో ననపత్యుఁ డొందుఁ ♦ బ్రుథుసుతుల నిలన్.౧౭

క. ధనహీనుఁడు ధనముం బొం,దును బాపవిముక్తుఁడౌను ♦ దొడఁగ పాపం
బొనరించు మర్త్యుఁ డొకపద,మును జదివిన యంతమాత్ర;♦భూమిస్థలిలోన్.

సీ. ఎవఁడు నిత్యము భక్తి ♦ నీరాము కథవినుఁజదువునాతఁడుకల్మ♦షములఁ బాసి
దీర్ఘాయువును బొంది ♦ దీపించు;శ్రేయంబు నొందనెవ్వఁడు కోరు♦నెందమందు
నాతఁడు విమలకా♦వ్యంబును దీనిని బఠియించి శ్రీరాముఁ ♦ బరముఁ దలఁపఁ
గాఁ జను; నిత్యంబు ♦ త్మానురేజ్యులచేతఁ జదివింపఁదగు దాని ♦ శ్రద్ధ వినఁగఁ

తే. జను నదెవ్వఁడు శ్రీరఘు♦స్వామిసకల,చరితమునుజక్కఁబఠియింపఁ ♦ జక్రిలోక
మునకు నిస్సంశయంబుగఁ ♦ జను నతండె,కాక యాతని తండ్రికిఁ♦ గల్గు సద్గి.

క. ఆతనిజనకుఁడు తాతయు, నాతనిజనకుండు నిట్లె ♦ యుందఱు వనజా
క్షాతతలోకము నొందుదు, రీతెఱఁగున కేమిశంక♦యే లేదు ధరన్. ౨౨

క. పురుషార్థచతుష్టయమును, బురుషోత్తముఁడైన రాఘ♦వుని శాశ్వతన
చ్చరితం బొసంగుఁ గావునఁ, బరమంబగు దీని యత్న♦పరుఁడై సతమున్. ౨౩

క. మనుజుండు వినం దగు; రా,ముని గాథను భక్తి నెవఁడు ♦ భూరిముదమునన్
వినునో పదమును బొదం,బును నాతఁడు పద్మయోని♦ముఖ్యపదంబున్. ౨౪

వ. కనఁ జను నంతె కాక యటఁ ♦ గంజజుతో సరిగాఁగఁ బూజలం
గొను నిరతంబు; నివ్విధిని ♦ గోరిఁ బూర్వచరిత్ర మిద్ది మీ
కనుపమసాధుమంగళము ♦ లన్ని యొసంగును గాన విష్ణువై
తనరెడు రాముభక్తి సత♦తంబు నెనంగుచు నుండుఁ గావుతన్. 5730

నూటపదునొకండవ సర్గము సంపూర్ణము.

చ. వనజభవాది దేవపతి ♦ నారదునూహానిజప్రభావ! పా
వనిపరిపూతమస్తకవి ♦ భాసురదివ్యపదాబ్జ! సజ్జనా
వనపరతంత్ర! యోగిజన ♦ సన్నుతసుందరనామ! పార్వతీ
వనితనుతమిత్ర! భక్తజన ♦ బాంధవ! శ్రీరఘువంశభూషణా!.

సీ. ఇది మహీసురకుల ♦ విదితకాశ్యపమౌని గోత్రజాపస్తంబ ♦ సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర ♦ కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ ♦ ప్రథితకీర్తి
జననుంచి వంశాబ్ధి ♦ చంద్రసుబ్రహ్మణ్యవిబుధసర్యసుపుత్ర ♦ వినుతిపాత్ర
సంచితగురుభక్తి ♦ కాంచనస్పృష్టాపరాభిధేయార్యజ ♦ నాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మప్ర ♦ ణీతమైన
యాంధ్రరామాయణమున నా ♦ ధ్యాత్మికాది
శాంతులు ఘటింపఁ జేయుచు ♦ సౌఖ్యదాయి
యైనయుత్తరకాండ మిం ♦ పార నెలయు.

---

ఉత్తరకాండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

